e Largest
rculated
lugu Monthly

# చతుర

ఏప్రిల్ 1998 ✦ రూ. 7/-



## భూషణం గారి భోషాణం

పి.చంద్రశేఖర్ఆజాద్

# సచిత్రవిచిత్రం



## జంగిల్ రూం

అమెరికన్ టీవీతో ప్రారంభించి నటిగా సుప్రసిద్ధురాలైన ఓ తారామణికి అడవిలో నివశించాలనేది చిన్ననాటి తీరని కోరిక. అదెలాగూ తీరేది కాదుకదా అని తన డ్రాయింగ్ రూంనే ఓ 'జంగిల్'గా కనుపించేలా తయారుచేయించుకుంది ఇంటీరియర్ డెకొరేటర్స్ చేత. ఇది చూసి ముచ్చటపడిన టీవీలవాళ్లు అక్కడో సీరియల్ తీస్తామంటే 'సారీ!' అందీ తారామణి.

# చతుర ప్రపంచం

## అసలైన ఎవార్డ్

'పత్రికా సంపాదకుడు', లేదా 'విలేకరి'... ఈ ఉద్యోగాలు... నిజం చెప్పాలంటే ఎంతో ఆత్మసంతృప్తితో కూడిన ఉత్సాహపూరిత మైన ఉద్యోగాలు.

ఓసారి చెన్నైలోని 'అమెరికన్ సెంటర్' వారిచే నిర్వహించబడిన జర్నలిజంకి సంబంధించిన ఓ సింపోజియంకు జాక్‌టెయిలర్, శ్రీమతి కరోల్‌గ్రీన్ అనే జర్నలిస్టులు అమెరికా నుంచి వచ్చారు. జర్నలిస్ట్ టెయిలర్ 10 సంవత్సరాలపాటు ఓక్లహోమాలోని ఓ లోకల్ పేపర్‌లో పనిచేశారు. అటుతర్వాత ఆయన డల్లాస్ టైమ్స్ హెరాల్డ్‌లో చీఫ్ రిపోర్టర్‌గా చేరారు.

ఇంక శ్రీమతి కరోల్‌గ్రీన్ పత్రికావిలేకరే కాకుండా లాయరుకూడా. ప్రస్తుతం ఆవిడ 'డెన్వర్‌పోస్ట్' న్యూస్‌పేపర్‌కి ఇండస్ట్రియల్ రిలేషన్స్ ఆఫీసరుగా పనిచేస్తోంది. మన విలేకరి ఒకరు కరోల్‌గ్రీన్‌ని ఇంటర్వ్యూ చేస్తూ టీ.వీ. మీద ఆవిడ అభిప్రాయం చెప్పమన్నారు.

"టీ.వీ.ని ప్రజలు ఎంత ఇష్టపడుతున్నారో, ప్రజల్లో దానికున్న ఆధిక్యత ఏమిటో అందరికీ తెలిసిందే. అయితే వార్తాప్రసారణ విషయానికొస్తే పేపర్లు ఇచ్చినంత విపులంగా టి.వి.లు ఇవ్వలేవు. ప్రాంతీయ వార్తలనుంచి ప్రపంచ వార్తలదాకా అతి విపులంగా అందించగలిగేవి వార్తాపత్రికలే. అందుకే వాటికి ఇప్పటికీ టీవీలకన్న అధిక ఆదరణ లభిస్తోంది.

అమెరికాలో కూడా టీ.వీ.లను అధిగమించి ఆకర్షణీయమైన వార్తలను ప్రజలకు చేరవేయడానికి మా పత్రికా ప్రతినిధులంతా చాలా కష్టపడతాము" అన్నారు ఆవిడ. ఇన్వెస్టిగేటివ్ జర్నలిజం వల్ల పత్రికా ప్రతినిధులు, సిబ్బందికూడా చాలా సమస్యలను ఎదుర్కోవలసి వస్తుంది. ముఖ్యంగా తప్పుడు వార్తాప్రసారాల వల్ల ఆయా సంస్థలు పెద్దమొత్తంలో పరువునష్టం చెల్లించాల్సివుంటుంది. అప్పుడప్పుడు సిబ్బంది




ఉద్యోగాలకి కూడా ముప్పు కలుగుతూ వుంటుంది. ప్రాణాలకు కూడా ప్రమాదమేర్పడుతుంది. అయితే అమెరికాలో మరో ఇబ్బందికరమయిన 'లా' వుంది. తప్పుడు వార్తను ప్రచురించినందుకుగాను ఆ సంస్థ పరువునష్టం సొమ్ము కట్టలేకపోతే ఐ.పి. పెట్టవచ్చు అప్పుడు ఆనష్టం వార్తలను సేకరించిన విలేకరులు కట్టాల్సివస్తుంది.

కవర్‌ఫోటో : వి.శివసత్యమూర్తి

అందుకే ఈ వృత్తిలో సత్ఫలితాలు ఎంత ఆనందకరమో, అప్పుడప్పుడు ప్రతికూల పరిస్థితులేర్పడితే అంత బాధాకరంకూడా అంటారు అనుభవజ్ఞులు.

ఎన్నో అవార్డులు తెచ్చుకున్న జర్నలిస్ట్ టెయిలర్‌ని "ఇన్ని అవార్డ్‌లలో మీకు అత్యంత సంతృప్తినిచ్చిన అవార్డ్ ఏది? " అని అడిగినప్పుడు ఆయన చెప్పిన సమాధానం ఇలా వుంది- "ఓసారి ఓ పాఠకుడు నాకో ఉత్తరం రాశాడు. అందులో నా రిపోర్టింగ్ ద్వారా ప్రచురితమైన ఓవార్త అతనికెంతో మేలు కలిగించిందని రాశాడు. అంత కుమించిన సంతృప్తికరమైన ఎవార్డ్ నాజీవితంలోలేదు" అని.

---

## 'టెలిఫోన్' కథ

'ట్రింగ్', 'ట్రింగ్'మంటూ సూర్యుడికన్నా ముందేలేచి సుప్రభాతం పాడుతుంది టెలిఫోన్ ఈ రోజుల్లో. మనిషి జీవితం ఎంత వేగమయిందంటే టెలిఫోన్ ఎత్తి అవతలి నుంచి మాట్లాడే వ్యక్తి ఎవరో కనుక్కునే పాటి తీరిక, ఓపిక వుండక అప్పుడప్పుడు కొంతమంది ఆ రిసీవర్‌ని తీసి పక్కనపెట్టడం కూడా కద్దు. దీనికి తోడు రాంగ్‌కాల్స్ బాధ చెప్పనలవికాదు. ఎంత బాధాకరమైనా టెలిఫోన్ లేకపోతే మాత్రం సర్వం కోల్పోయినట్లుంటుంది అలవాటయిన వాళ్లకి. ఫోన్ ఒక్కరోజు డెడ్ అయితే ఇల్లంతా శూన్యం అనిపిస్తుంది.

అయితే అలెగ్జాండర్ గ్రహంబెల్ టెలిఫోన్ కనుక్కోడానికి పూర్వం 'బాల్టీమోర్ కౌంట్ ఎడ్వకేట్' అనే పత్రికలో ఓ ప్రకటన వచ్చింది. "పేరు తెలియని ఓ వ్యక్తి వైరు ద్వారా ఇరువురు వ్యక్తులు ఎంత దూరం నుంచైనా మాట్లాడుకునేలా చేసే ఓ పరికరం తయారుచేస్తానని ప్రజలని నమ్మించి డబ్బు వసూలు చేస్తున్న కారణంగా అతనిని న్యూయార్క్ పోలీసులు అరెస్ట్ చేశారు. వైర్ల ద్వారా సంభాషణ అనేది ఎంత అసంబద్ధమైన విషయమో అందరికీ తెలిసినదే కాబట్టి అతడికి తగిన శిక్ష విధించబడుతుంది" ఇదీ ఆ ప్రకటన సారాంశం.

అయితే పోలీసుల్నిగానీ ప్రజలనిగానీ తప్పుపట్టలేం. ఎందుకంటే వైర్లుద్వారా సంభాషణ సాధ్యమేననీ, దానికి ఎంతో భవిష్యత్తు వుంటుందని అప్పటి మనిషి కనీసం ఊహించను కూడా లేదు. మొట్టమొదట గ్రహంబెల్ ఈ టెలిఫోన్ గురించి వివరించి చెబుతున్నప్పుడు, ఎవరూ శ్రద్ధగా వినలేదు సరిగదా దాన్నో పిల్లల ఆటవస్తువులా భావించారు.

మొట్టమొదటిసారిగా ఫిలడల్ఫియాలోని ఓ ఎగ్జిబిషన్‌లో బెల్ తన టెలిఫోన్‌ని అందరికీ పరిచయం చెయ్యడానికుద్యుక్తుడయ్యాడు. అప్పుడే ఎడిసన్ ఎలక్ట్రిక్ బల్బుని కనుక్కుని ప్రదర్శనకి పెట్టాడు. కానీ ప్రజలు టెలిఫోన్‌ని పట్టించుకున్నట్లు ఎడిసన్ బల్బ్‌యందు ఆసక్తి చూపించలేదు.

బ్రెజిల్ రాజు టెలిఫోన్ తీసుకుని అవతలినుంచి గ్రహంబెల్ గొంతు విని తెల్లబోయాడు. 'ఇందులో నిజంగానే మాట వినబడుతోంది' అని అరిచాడు. వెంటనే బెల్‌కి మంచి బహుమతి ప్రదానం చేశాడు. అప్పటినుంచీ బెల్‌కి కొంత గుర్తింపు వచ్చింది అయినా ఆ క్షణంలో టెలిఫోన్ భవిష్య శతాబ్దాల్లో మరిన్ని విన్యాసాలు చేస్తుందని మాత్రం ఎవరూ ఊహించలేదు. కానీ దురదృష్టవశాత్తు ఇండియాలో మాత్రం టెలిఫోన్ ఇప్పటికీ సామాన్యమానవుని ఇంటిని అలంకరించలేకపోతోంది.

అమెరికాలో ప్రతివారికీ ఒకటికి మించి కూడా కనెక్షన్లు వుంటాయి పైగా అక్కడ గవర్నమెంట్ టెలిఫోన్ కంపెనీలేకాక, ప్రైవేటు కంపెనీలు చాలానే వున్నాయి. అమెరికా టెలిఫోన్ సిస్టమ్స్ ప్రపంచం



మొత్తంమీద గొప్పదని గుర్తింపు పొందింది. యూరప్, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలో వున్న టెలిఫోన్లు మొత్తం కలిపి ఒక్క అమెరికాలోనే వున్నాయి. ప్రైవేటు సంస్థలు తమ వ్యాపారాభివృద్ధికోసం తామిచ్చే టెలిఫోన్ కనెక్షన్లను సవ్యంగా పనిచేసేలా ఎప్పటికప్పుడు అప్రమత్తంగా మెలుగుతుంటాయి. 90 సంవత్సరాల కాల ప్రమాణంలో టెలిఫోన్ వేగంగా అభివృద్ధి చెందుతూ వచ్చింది.

మొత్తం టెలిఫోన్ పుట్టుపూర్వోత్తరాలు తెలియాలంటే కాలిఫోర్నియాలోని ఎబిలిన్ సిటీలో వున్న 'ఇండిపెండెంట్ టెలిఫోన్ మ్యూజియం'ను సందర్శించాలి. అక్కడే మొట్టమొదటి టెలిఫోన్ ఎక్స్ఛేంజ్ 1898లో క్లిసన్ బ్రౌన్ అనే వ్యక్తి ద్వారా స్థాపించబడింది. బ్రౌన్ తన ప్రైవేటు టెలిఫోన్ ఎక్స్ఛేంజ్ సర్వీస్‌ని ఇతర రాష్ట్రాలకు కూడా పాకించాడు. టెలిఫోన్‌కి డయల్ సిస్టమ్‌ని మొట్టమొదట కనిపెట్టినది ఆల్‌మట్ బ్రౌన్ అనే వ్యక్తి. మొట్టమొదటిసారిగా 1892లో ఇది ప్రారంభించబడి ప్రభుత్వ టెలిఫోన్ కంపెనీలు ఎక్కువగా పట్టణాలలో విస్తృతంగా అభివృద్ధి చేస్తే మిగిలిన ప్రైవేటు కంపెనీలు పల్లెల్లో టెలిఫోన్ సౌకర్యాభివృద్ధికి కృషి చేశాయి.

టెలిఫోన్ పరికరం కూడా కాలానుగుణంగా మారుతూ వచ్చింది. పాత పరికరాలన్నీ కూడా మ్యూజియంలో భద్రపరచబడ్డాయి. టెలిఫోన్ యొక్క క్రమాభివృద్ధి గ్రాఫ్‌ద్వారా వివరించబడుతుంది. అప్పట్లో ఉపయోగించిన బార్బ్‌డ్ వైర్లు కూడా మ్యూజియంలో భద్రంగా వున్నాయి. 83 సంవత్సరాలకి పూర్వం టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లో వాడిన స్విచ్‌బోర్డ్‌ని ఇప్పటికీ భద్రపరిచారు. అయితే అది ఇప్పటికీ సక్రమంగా పనిచేస్తోంది




అప్పట్లో ప్రత్యేకమైన 5 నాణేలను వేస్తే టెలిఫోన్లు పలికేవి. ఆ నాణాలు కూడా ఇప్పటికీ మ్యూజియంలో వున్నాయి.

గ్రహంబెల్ టెలిఫోన్ కనిపెట్టినా స్ట్రోజర్ దీనికి కట్టుదిట్టమైన డయల్ సిస్టమ్‌ను కనిపెట్టడంతో ఇది ఇంత అభివృద్ధి చెందగలిగిందంటారు పరిశోధకులు. అందుకే మ్యూజియంలో 'స్ట్రోజర్ డయలింగ్ సిస్టమ్' కూడా ప్రత్యేక గౌరవంతో ప్రదర్శింపబడుతుంది.

## కళ్లను చూసి పెళ్లి

'**సర్వేంద్రియాణాం నయనం** ప్రధానం' అన్నది అందరికీ తెలిసిందే. అంతేకాదు, ముఖంలో అందాన్నిచ్చే ముఖ్యభాగం కళ్లే. కొన్ని కళ్లు గాంభీర్యాన్ని ప్రదర్శిస్తే, మరికొన్ని భీతిని కలిగిస్తాయి. ఇంకొన్ని కళ్లు ప్రశాంతతని, దివ్యకాంతుల్ని వెదజల్లుతాయి. కొంతమందికి కళ్లతోనే మాట్లాడగలిగే నేర్పు వుంటుంది. అంటే కేవలం కళ్లలోని హావభావాలతో నవరసాల్నీ ఒలికించగలరన్న మాట. పోతే కళ్లకు సంబంధించి మరో ముఖ్య కోణంవుందనీ, కళ్లలోని అతి సున్నితమైన నరాల నిర్మాణాన్నిబట్టి మనిషి స్వభావాన్ని, ఆలోచనలని అంచనా వెయ్య

చ్చని శాస్త్రజ్ఞులు అంటున్నారు.

కళ్లకి సంబంధించిన శాస్త్రాన్ని ఇరిడాలజీ అంటారు. ఆస్ట్రేలియాలోని సిడ్నీకి చెందిన డా॥డరోతీ హాల్ ఈ శాస్త్రాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. మనిషి కళ్లలోకి చూసి అతని స్వభావాన్ని, ఆలోచనల్ని చక్కగా చెప్పచ్చు అంటున్నారు ఆవిడ. కంటిపాప చుట్టూ సన్నటి నూలు లాంటి ఫైబర్స్ వేల సంఖ్యలో వుంటాయి. వీటి నిర్మాణం సదరు వ్యక్తి యొక్క స్వభావాన్నిబట్టి వుంటుంది. లేదా ఆ స్వభావాన్నిబట్టి ఈ నిర్మాణ మేర్పడుతుంది. వీటిని ఐరిస్ అంటారు. ఈ ఐరిస్‌లో వివిధ రకాలు న్నాయి.




1) సిల్క్ ఐరిస్: ఈ నిర్మాణంలో ఫైబర్స్ చాలా సన్నగా, పలుచగా వుండి ఒకదానికొకటి బాగా దగ్గరగా వుంటాయి. ఈ సిల్క్ ఐరిస్ గల వాళ్లు చాలా కష్టపడి పనిచేసే స్వభావం కలవారై వుంటారు. ఎలాంటి ఆందోళనా చెందకుండా గంటల తరబడి శ్రమించి పనిచేయగలరు వీరు. బద్ధకస్తులను చూస్తే వీరికి ఒళ్లుమండి పోతూ వుంటుంది. చాలా సాహసకార్యాలకు పూనుకునేది వీరే. రెండు తరాలక్రితం జనంలో ఎక్కువమంది ఈ సిల్క్ ఐరిస్ గలవారే వుండేవారని తెలుస్తోంది. ఇప్పుడు వాళ్ల సంఖ్య తగ్గిపోయింది. వీళ్లకి మంచి ఆరోగ్యం కూడా వుంటుంది.

2) లైనెన్ ఐరిస్: ఇందులో ఫైబర్స్ చాలా దట్టంగా వుండి ఒకదానికొకటి బాగా దగ్గరగా వుంటాయి. వీళ్లు మామూలు మనుషులు. చాలా మంది ఈవర్గంలోకి వస్తారు. వీరు మరీ బలవంతులూ కాదు, మరీ బలహీనులూకారు. వీళ్లతో చాలా మంది కలిసిపోగలరు. వీళ్లు హార్డ్‌వర్క్ చేసినా తొందరగానే అలిసిపోయి పనికి గుడ్‌బై చెప్పేస్తారు. అందరితో చనువుగా కలిసిపోయే వీరు ఎవరికీ ఎలాంటి సమస్యలూ తెచ్చిపెట్టరు.

3) హేజియన్ ఐరిస్: ఈ నిర్మాణంలో ఫైబర్స్ గట్టిగా వుండి ఒకదానికొకటి దూరంగా విసిరివేయబడి వుంటాయి. వీళ్లకి ఆలోచన ఎక్కువ, ఆచరణ తక్కువ. గాలన్ల కొద్దీ కాఫీ తాగుతూ ఎన్నో ఆదర్శవంతమయిన విషయాలను చర్చిస్తూ, గంటల తరబడి గడిపేస్తారు గానీ క్రియశూన్యం.

4) జాల్ ఐరిస్: ఈ నిర్మాణంలో ఫైబర్స్ పెద్దవిగా తెల్లని తెలుపురంగుతో వుంటాయి. వీళ్లు తమ తెలివితో, వాక్చాతుర్యంతో కార్యసాధన చేస్తూ వుంటారు. అంతేగానీ... నిజమైన మేధోశక్తి వీళ్లల్లో సున్న. స్త్రీ పురుషుల మధ్య వివాహ బంధాలు కుదిర్చేటప్పుడు కూడా ఈ ఐరిస్ నిర్మాణాల్ని గమనించడం మంచిదంటున్నారు డరోతి. కనుగుడ్డు చుట్టూ వున్న తెల్లని భాగం భార్యాభర్తలిద్దరిలోనూ ఎక్కువగా వుంటే వారిది అనుకూల దాంపత్యం అయితీరుతుందంటారామె.

ఆవిడేకాక ఆవిడ భర్త డా॥రాన్ కూడా ఈ శాస్త్రంలో నిష్ణాతులే!

# చతుర కతలు

## ఎస్కేపిస్ట్

స్కామ్‌ల్లో తలమునకలుగ మునిగి, కుంభకోణాల్లో కూరుకుపోయి, అవినీతి ఆరోపణలు పుష్కలంగ వున్న మిస్టర్ దుఖ్‌రామ్ గారు తీవ్రాలోచనలో పడ్డారు.

ఆయన మీద గవర్నమెంటువారు మరోసారి సిబిఐ ఎంక్వయిరీ వేశారు! ఈసారి తన మంత్రి పదవి వూడేట్టువుంది.

ఆలోచించి... చివరకు ఫ్యామిలీ డాక్టర్‌కు ఫోన్ చేశారు. ఆయన హాస్పిటల్లో అత్యపసరరోగుల్ని వదిలేసి ఆఘమేఘాలమీద వచ్చాడు.

"సిబిఐవాళ్లు యింటరాగేషన్‌కు వస్తున్నారు. ఈసారి తప్పించుకోవడం ఎలా?" అడిగాడు దుఖ్‌రామ్.

తన డాక్టరీ బుర్రకు లాయర్ బుర్రని జోడించి... "ఏముందీ మళ్లీ గుండె నొప్పి వచ్చిందని హాస్పిటల్‌లో ఎడ్మిట్ అయితే సరి" అన్నాడు డాక్టర్.

"మొన్నటి 'ఆల్ ఫార్స్' కుంభకోణంనుండి తప్పించుకోవడానికి ఆ అస్త్రం వుపయోగించాంకదా! ప్రతిసారీ అలాగైతే అందరూ అనుమానిస్తారు"

"పోనీ తలకాయనొప్పి వచ్చింది... హాస్పిటల్లో జాయినయ్యారు. అని చెప్తే ఎలా వుంటుంది" అన్నారు డాక్టర్‌గారు.

"మొన్నొకసారి నా తలకు స్కానింగ్ తీసి నా హెడ్‌లో బ్రెయిన్ లేదని రిపోర్టిచ్చావ్ కదయ్యా!"

"సారీ మర్చేపోయాను?" నాలిక్కొరుకున్నాడు డాక్టర్. మళ్లీ వెంటనే, "పోనీ కడు



పునొప్పి వచ్చిందని చెప్తే!" అన్నారు

"అడ్డమైన గడ్డీ తిని నిజంగానే వీడికి ఉద రపీడనం వచ్చి వుంటుందని అనుకొంటారు. అసలే పశుగ్రాస కుంభకోణంలో నా పేరు ఉందాయె" అంటూ ఉసూరుమన్నారు మిని ష్టర్.

తర్జన భర్జనలు జరిపి వ్యాధుల పట్టిక ఆమూలాగ్రం పరిశీలించి చివరకు ఎయిడ్స్ సెలక్టు చేశాడు దుఖ్ రామ్.

"ఎయిడ్స్ వచ్చిందని చెప్తావా? అదొక భయంకరరోగం. జనాలు గుండాగి చస్తారు. దాని గురించి నీకేమీ తెలియదను కొంటా" అన్నాడు డాక్టర్ విసుగ్గా.

"మనకి అదే కావాలి మిస్టర్ డాక్టర్! ఆ రోగం వచ్చిందని తెలిస్తే సిబిఐ వాళ్లు మన దరిదాపుల్లోకి రారు. పైగా 'మృత్యువు చేరు వలో మంత్రిగారు' అంటూ పేపర్ స్టేట్ మెంట్లిప్పిస్తాం!! ప్రజల్లో సింపతీ కూడా పెరుగుతుంది"

నోరెళ్లబెట్టుకొని విని. ఆపై "మినిస్టర్‌గారికి ఎయిడ్స్. మా ఆసుపత్రిలో జాయిన్ అయ్యారు" అంటూ ప్రకటనలిచ్చాడు డాక్టర్.

రెండు రోజులు గడిచాయి. సిబిఐ వాళ్లు ఎవరూ రాలేదు. వస్తారన్న నమ్మకం కూడా పోయింది అందరికీ.

దుఖ్ రామ్ సంతోషంగా ఫీలయ్యాడు.

అప్పుడే సడన్‌గా ఫోన్ మోగింది. రిసీవర్ ఎత్తి హలో అన్నాడు. అటువైపు నుంచి మెల్లగా ఓ శబ్దం వినిపించింది.

"హలో... నేను దుఖ్ రామ్‌గారి లాయర్ని మాట్లాడుతున్నాను. ఆయనగారికి ఎయిడ్స్ అటకదా! అందుకని ఆయన భార్య డైవోర్స్‌కి అప్లయి చేశారు... ఆయనగారి స్టెనోమణి, పర్సనల్ సెక్రటరీమణి రాజీనామాలివ్వబోతున్నట్లు తెలిసింది.,"

"హల్లో... హల్లో... హల్లో..."

కసిగా ఫోన్ పెట్టేసి... నీరసంగా మంచంమీద వాలాడు దుఖ్ రామ్.

**-డాక్టర్ కె.శివసుబ్బారావు**

---

## కాలుష్యం

సుబ్బారావుకి శబ్ద కాలుష్యమంటే అసలు గిట్టదు. శరీరంలో విచిత్ర మార్పులొస్తుంటాయ్. వాంతులు, నిద్రపట్టకపోవడం, తల తిరగడం ఇత్యాది లక్షణాలన్నీ బాడీలో ఉదయించేస్తుంటాయ్.

అతను సిటీలో ఓ ప్రైవేటు కంపెనీలో వర్క్ చేస్తున్నాడు. రొద చేసుకుంటూ తిరిగే వాహనాల ధాటికి తట్టుకోలేకపోయాడు. బాగా సిక్ అయ్యాడు. ఆ బాధలు పడలేక దగ్గర్లోని ఓ గ్రామంలో ఇల్లు అద్దెకు తీసుకొని భార్యతో సహా వుంటున్నాడు.

శకటాల రణగొణధ్వని తగ్గింది. ప్రశాంతంగా ఫీలయ్యాడు. అది అబద్ధమని తెల్లవారుఝామున తెలిసిపోయింది. సుబ్బారావు రాత్రిళ్లు చాలాసేపు మేల్కొంటాడు. అతను నిద్రపోయేది తెల్లవారుఝామున మూడు గంటలనుంచి. నాలుగంటలు నిద్రపోయి, ప్రొద్దున్నే ఎనిమిది గంటలకు లేస్తాడు.

కానీ ఆ రోజు నిద్రపోయాక దగ్గర్లోని గుడినుంచి భక్తిపాటలు, శ్లోకాలు, సంస్కృత పద్యాలు, హరిశ్చంద్రోపాఖ్యానాలు మైకు నుంచి కర్ణకఠోరంగా విన్పించసాగాయి. ఇహ నిద్రపట్టలేదు. ఆరోజునుంచి నిద్రే కరువయ్యింది.

లాభం లేదని యిల్లు మారాడు. అలా మాటిమాటికీ మారుతూనే వున్నాడు. ఒక వీధిలో క్రైస్తవ బోధనలు వినబడ్డాయి,





మరొక ఇంట్లో వున్నప్పుడు అల్లాసూక్తులు, ఇంకోచోట రెసిడెన్షియల్ స్కూలు వుండి ప్రొద్దున్నే పిల్లలందరూ లేచి, గడబిడా పాఠాలు చదువుతున్నారు. సుబ్బారావుకు కంటిమీద కునుకు మృగ్యమైంది. మనిషి బాగా చిక్కిపోయాడు.

ఇటువంటి పరిస్థితుల్లో అతని ఫ్రెండు కానిస్టేబుల్ కనకం కలిశాడు. సుబ్బారావు బాధ విన్నాక పోలీస్ శిక్షణతో బెరడుకట్టిన ఆయన గుండెకాయలో జాలి అనే ఓ పదార్థం వెలిసింది. చాలా దయతో "బాధ పడకు బ్రదర్. మా స్టేషన్లో ఓ సెల్ ఖాళీగా వుంది. దాన్నెప్పుడూ వాడం. అందులో పడుకో" అన్నాడు. పోలీస్‌స్టేషన్ యింటికి దగ్గరకాబట్టి నిద్రవొచ్చే టయానికి అక్కడికి వెళ్లిపడుకొనేవాడు. ఈ ప్లానూ అట్టర్‌ఫ్లాపయింది. కారణం పాపం! స్టేషన్లో లాకప్‌కొట్టుడు, వీరబాదుడు, తర్డ్‌డిగ్రీలు, హండ్రడ్ డిగ్రీలు అక్కడే జరుగుతుండటంతో నిద్రాదేవి ఇంకా దూరంగా పారిపోయింది.

దీనికో పరిష్కారం ఆలోచించి సిటీలో ఓ డాక్టర్ దగ్గరకు వెళ్లి దాన్ని అమలు జరిపాడు.

ఒకనాడు సుబ్బారావు మార్కెట్‌లో వెళుతుండగా కనకం గట్టిగా పిల్చాడు. అయినా వినిపించుకోకుండా వెళ్లిపోతున్నాడు సుబ్బారావు. కనకం దగ్గరకెళ్లి, ఇంకా గట్టిగా పిల్చాడు. అయినా వినబడలేదు. వెనక్కి తిరగలేదు.

చాలా దగ్గరకు వెళ్లి పిలిచాడు. సమాధానం లేదు. ఒక్క చరుపు చరిచాడు వీపు మీద. సుబ్బారావు వెనక్కి తిరిగాడు.

"ఏమిరా! వినబడటంలేదా? "

అప్పుడు జేబులోనుంచి చెముడు మిషన్ తీసి చెవుల్లో పెట్టుకొన్నాడు.

"చెముడు ఎప్పుడొచ్చింది నీకు?." ఆశ్చర్యంగా అన్నాడు కనకం!

"ఈ శబ్దకాలుష్యాల బాధ భరించలేక నేనే డాక్టర్ దగ్గరకెళ్లి చెవిలో వుండే శబ్దగ్రహణనాడులను కట్ చేయించుకొన్నాను. మామూలుగా నాకు ఏ శబ్దాలు వినబడవు. ఇదిగో ఈ మిషన్ పెట్టుకుంటే తప్ప!" అన్నాడు సుబ్బారావు.

నోరెళ్లబెట్టాడు కానిస్టేబుల్ కనకం.

–కె.యస్.రావ్





# అంచనా

మా సీతారాములు తమాషా మనిషి. తెలివితేటలలో తాను దిట్టనన్న గట్టి నమ్మకం వాడిది.

పేరుకి సీతారాముడే అయినా సీతలేని రాముడువాడు. అందుకే సీతకోసం వేట ప్రారంభించాం మేము. మేమంటే నేనూ, వాడూ నన్నమాట. ప్రాణమిత్రుడిగా వాడి ప్రతిపనిలోనూ నేనూ చేదోడు వాదోడుగా వుండాల్సిందే.

మంచి సంబంధం ఒకటి వుందంటే అమ్మాయిని చూడ్డానికి వెళ్లాం మేము. ఆ పిల్ల తల్లిదండ్రులు మాకెంతో మర్యాద చేశారు. ముఖ్యంగా అమ్మాయి తల్లి చాలా చురుకైనదీ, కలుపుగోలు మనిషీను. అమ్మాయి కూడా చూడ్డానికి బాగానేవుంది.

అయితే ఆ సంబంధం ససేమిరా తనకు వద్దన్నాడు సీతారాముడు. అన్నివిధాలా నాకు నచ్చిన సంబంధం అది. ఈడ్చిపెట్టి తన్నాలనిపించింది నాకు వాణ్ణి. కాదన్నందుకు కాదు, వాడు చెప్పిన కారణానికి.

అమ్మాయి తల్లి యాక్టివ్‌గా వుందట. కనుక అమ్మాయి తప్పకుండా డల్‌గా వుండే మనిషే అయి వుండాలట.

నేను కోపం పట్టలేక వాడి పీకపిసకబోతుంటే ఇలా వివరణ ఇచ్చాడు, యాక్టివ్‌గా వుండే తల్లులు పిల్లలచేత పనిచేయించరట. ఇంటి పనంతా తామే చక్కదిద్దుకుంటారట. అందువల్ల పిల్లలకు పనీపాటూ అబ్బకుండా పోతుందట. సోమరిపోతుల్లా తయారవుతారట. తన ఎరికలోని కుటుంబాలన్నీ అంతేనట.

నవ్వాలో, ఏడవాలో తెలియలేదు నాకు. అంత చక్కటి సంబంధాన్ని ఏదో కుంటిసాకుతో కాలదన్నుకోవడం వాడి ఖర్మ అనిపించింది. అంతేకాదు, అలాంటి మూఢనమ్మకాలున్న ఆ దేభ్యంగాణ్ణి చేసుకోకపోవడం ఆ అమ్మాయి అదృష్టం అని కూడా అనిపించింది.

ఆ తరువాత ఇంకో సంబంధం వచ్చింది. నేను రానంటే బతిమాలి తీసుకెళ్లాడు. అమ్మాయి, తల్లీ కూడా బాగానే వున్నారు. కాకుంటే ఈసారి తల్లి అంత చురుకైన మనిషిలా అనిపించలేదు. కూతురుమాత్రం



ఫాస్టు. ఆ అమ్మాయి వేగాన్ని అందుకోగల శక్తి మా సీతారాముడికి వుందా అనిపించింది నాకు. స్టిల్, మొదట చూసిన అమ్మాయే అన్నివిధాలా తగిన పిల్ల అన్న అభిప్రాయం నాలో మెదులుతోంది.

ఇంటికి వెళ్లగానే డిక్లేర్‌చేశాడు సీతారాముడు తాను ఈ అమ్మాయినే చేసుకుంటానని. "తల్లి మన్నుతిన్న పాములా వుంది. పిల్ల చురుగ్గా వుంది. అంటే చిన్నప్పట్నుంచీ మందకొడి తల్లికి కూతురే కూర్చోబెట్టి చేస్తోందన్నమాట" అంటూ వివరించాడు కూడా.

"నీ థియరీ నాకంత కన్విన్సింగ్‌గా లేదు. ఎందుకైనా మంచిది మరోసారి ఆలోచించు. అన్నివిధాలా నాకు మొదటి సంబంధమే అనుకూలంగా కనిపిస్తోంది" అంటూ హెచ్చరించాను స్నేహధర్మంగా.

"నా అంచనా ఎప్పుడూ తప్పుకాదు. డోంట్ మిస్‌లీడ్‌మీ" అంటూ నా మీద కసురుకున్నాడు.

ఆ తరువాత మూణ్ణెల్లకే ఆ అమ్మాయితో పెళ్లయిపోయింది మా సీతారాముడికి.

అత్తారింటి వద్ద మూడు నిద్రలు చేయడానికి నన్ను తోడు రమ్మన్నాడుగాని నాకు వీలుకాక వెళ్లలేదు.

మూడు రాత్రుల ముచ్చట ముగియగానే సీతారాముడు తిరిగొచ్చాడని ఆలకించి వాడింటికి వెళ్లాను పలకరించడానికి.

కొత్త పెళ్లికొడుకు మధురోహల్లో తేలిపోతూంటాడనుకున్నాను. కానీ ఏదో సుదీర్ఘాలోచనలో మునిగిపోయి వున్నాడు.

విశేషాలేమిట్రా అనడిగితే చెప్పాడు,

"నా అంచనా తప్పయిందిరా సత్తిగా! తల్లి డల్‌గా వుందనీ, పిల్ల ఫాస్టుగా వుందనీ ఆ అమ్మాయికి ఇంటిని చక్కదిద్దుకునే నేర్పు, ఓర్పు వుంటాయనుకున్నాను. తల్లేకాదు, పిల్లకికూడా పనీపాటులు అబ్బలేదని తేలిపోయింది"

"మరి తల్లీకూతుళ్ల ఆపోజిట్ ట్రెయిట్స్‌ని గూర్చిన నీ థియరీ మాటేమిటి? " అనడిగాను విస్తుపోతూ.

"అక్కడే పప్పులో అడుగేశాన్రా" అన్నాడు.

"మరైతే ఇంటి పనులు చేసేదెవరంట? " సందేహం కలిగింది నాకు.

"ఆ ఇంట్లో పనంతా ఆ పిల్ల తండ్రే చేస్తాడట!"

వాడి సమాధానం విని అవాక్కయ్యాను నేను.

—తిరుమలశ్రీ

---

## వీలుకానిది

"నీకీ మధ్య తల బిరుసెక్కువైంది. ఏ మాటన్నా వీలుకాదనేస్తున్నావ్. కొత్తగా వచ్చారుకదా, మన పక్కింటి మా కొలీగ్ భార్యతో కాస్తంత మాట్లాడ్తూండమంటే వీలు కాదంటావేమిటి? " శంకరం భార్యని కసురుకున్నాడు.

శారద "అది వీలుకాదండీ... అంతే" కచ్చితంగానూ, తాపీగానూ జవాబిచ్చింది. శంకరం కాస్సేపు ధుమధుమలాడి ఆఫీసుకెళ్ళిపోయాడు ఎర్రబడిన ముఖంతో.

ప్రసాద్ శంకరం వాళ్ళాఫీసులో కొత్తగా అపాయింటయివచ్చాడు. పక్కింట్లోనే అద్దెకు దిగాడు. తన భార్య సరళ పగలంతా ఒంటరిగా ఉంటుందనీ, శంకరం భార్య ఆమెతో కాస్తంత మాట్లాడ్తూంటే బాగుంటుందనీ రోజూ అతను ఆఫీసులో శంకరాన్ని పోరుతున్నాడు.

"మీ మిసెస్ కాస్త రిజర్వుడు అనుకుంటాను" అన్నాడు నిన్న.

భార్యమీద ఈరోజు అందుకే అంతెత్తున ఎగిరాడు శంకరం.






తలపోటుతో ఆ మధ్యాహ్నం ఇంటికొచ్చేశాడు శంకరం. నాలుగు మెతుకులు బలవంతంగా తిని మాత్ర వేసుకుని విశ్రాంతి తీసుకుంటున్నాడు బెడ్రూంలో.

కాస్సేపటికి పక్కింటావిడ సరళ స్వరం విన్పించింది వీధి గుమ్మం దగ్గర "ఏం చేస్తున్నారూ" అంటూ.

శారద సమాధానం చెప్పబోతుండగా ఆమే అందుకుంది వచ్చి కుర్చీలో కూలబడ్తూ.

"అబ్బబ్బ... పొద్దుట్నుంచీ పనే తెమల్లేదండీ బాబు. ఈ వీధిలో కాస్తంత పలకరించేవారే లేరాయె. పేరుకే మనుషులున్నారుగానీ మీరూ రారు మా ఇంటికి. ఆరుగంటలకనగా లేచానా... బ్రష్షు చేసుకునీ స్నానంచేసీ, పాలవాడొస్తే అరలీటరు పాలు పోయించుకుని, కాఫీ కాచుకొని ఆయనకో కప్పిచ్చి, నేనో పెద్ద కప్పుడు తాగాను. ఓ సోలెడు పిండి కలిపి పది చపాతీలొత్తాను. ఆయనో రెండు తిని నాలుగు ఆఫీసుకి పట్టుకుపోయారు. నేనో రెండు తిన్నాను. కోడిగుడ్డు పులుసు చేశాన్లెండి. ఓ రెండుల్లిపాయలు కోసి, రెండు గుడ్లు కొట్టి పోశాను. ఇంకా నాలుగు చపాతీలూ, కాస్తంత కూరా ఉన్నాయి. ఓ గిద్దెడు బియ్యం కడిగి అత్తెసరు పెట్టుకున్నాను" ఆగకుండా చెప్పుకుంటూపోతోందామె. బయటి గదిలో శారద, పడకగదిలో శంకరం నోర్మూసుకుని వింటూండిపోయారు.

"...చీరలు రిన్ పెట్టి ఉతికి ఆరేశాను. లంగాలూ, బనీన్లూ సర్ఫ్‌లో నానేసి ఉతికాను. దుప్పట్లూ, గలీబులూ వేన్నీళ్లల్లో నిర్మాలో నానేసి జాడించి ఆరేశాను. అన్నట్లు జాకెట్లూ సబ్బెట్టి చీరల్తోబాటే ఉతికేశాను. కాఫీ తాగుదామంటే కలుపుకునే ఓపికే లేదంటే నమ్మండి"

ఇంతలో శారద కూతురు లలిత కాఫీ తెచ్చిచ్చింది. కాఫీ చప్పరిస్తూనే ఆమె తన కథనం కొనసాగించింది అవిరామంగా.

"...ఇంకా బియ్యం ఏరుకోవాలి. పొద్దుట ఇడ్లీలు చేయాలి. ఓ గిద్దెడు పప్పు నానేస్తాను. ఇహ చట్నీకోసం..." అంటూండగానే.

శంకరం తల తిరిగిపోయింది! భార్యమీటజాలేయసాగిందతనికి. ఆమెను శంకించినందుకు మనసులోనే లెంపలేసుకున్నాడు.

"నిజమే! పక్కింటామెతో 'మాట్లాడటం' వీలుకాదంటే వీలుకాదు సుమీ' అన్నాడు ఆ తర్వాత భార్యతో గట్టిగా.

—నియాజ్ అలీ

# చతుర

సంపుటి: 21

సంచిక: 3

ఏప్రిల్ 1998


ఆ ఊరువాళ్లు 'దెయ్యాల కొంప' అని పిలిచే పాడుపడిన దివాణం అది. ఆ ఇంట్లో ఆ వంశానికి ఆఖరివాడు... బ్రహ్మచారిగా, ఒంటరిగా, పాములు, తేళ్లు తిరుగాడుతున్నా వాటితో సహజీవనం చేస్తూ... గత వైభవ స్మృతులతో దరిద్రంలో మునిగి తేలుతున్నాడు. అలాంటిది... ఓ రోజున... "సోదరా! నీ జీవితాన్నే మార్చేస్తా"నంటూ వచ్చాడో అపరిచిత వ్యక్తి. 'సంపెంగనూనె' బహుమతిగా ఇచ్చి అతని మనసుని దోచుకుని, అటుపైన... అనతికాలంలోనే అతన్ని దేశానికి ఓ వినూత్న పద్ధతిలో పరిచయం చేసి, విదేశాలకి సైతం తీసుకెళ్లి అతన్నో విశిష్ట స్థానంలో నిలబెట్టాడు.

అల్పకాలంలోనే ఇదెలా సంభవమయింది? 'కాదేదీ వ్యాపారానికనర్హం' అని నిరూపిస్తూ ఆధునిక వ్యాపార రీతులను ఆశ్చర్యకరంగా ఆవిష్కరిస్తూ, నవ్విస్తూనే ఆలోచింపచేసే

పి. చంద్రశేఖర ఆజాద్

# భూషణం గారి భోషాణం

ఈ నెల చతుర సమగ్ర నవల.

గోపాలపురం బస్ ఆగింది.

అందులోనుండి అతను దిగాడు.

చేతిలో సూట్ కేస్, భుజాన బ్యాగ్ వున్నాయి. కొద్ది క్షణాలు నిలబడి చుట్టూ చూశాడు.

పెద్ద చెరువు, గట్లమీద విశాలమైన వృక్షాలు, దూరంగా చేలల్లో గాల్లోకి లేస్తున్న పొగ కనిపించాయి. ముందుకు కదిలాడు. ఊరంతా బద్ధకాన్ని పులుముకుందా అనిపించింది.

ఈ రోడ్లు ఎన్ని సంవత్సరాల క్రితం వేశారో అనుకున్నాడు.

నాలుగడుగులు ముందుకు వేశాడు.

దారి రెండుగా చీలింది. ఏది ఎక్కడకి వెళ్తుందో అర్థంకాక ఓ క్షణం ఆగాడు.

"ఈ వూర్లో చెట్లూ, చెరువులూ తప్ప మనుషులు కనిపించరా" అనుకున్నాడు.

అప్పుడు కనిపించాడతను రోడ్డుమీద. లుంగీగట్టిగా కట్టుకొని మోకాళ్ళపైదాకా మడిచాడు. అనుమానం నిండిన చూపుల్తో మెల్లగా అంగలు వేస్తూ వచ్చాడు. దగ్గరికి వచ్చాక 'ఈ శాల్తీ ఎక్కడిది బాబూ' అన్నట్లు చూశాడు.

"సార్" అని పిలిచాడతను.

ఏం కావాలన్నట్లుగా తలెగరేశాడు.

"భూషణంగారిల్లు ఎక్కడో చెబుతారా"

ఆ మాట వినగానే ముఖంలో మార్పు వచ్చింది. లుంగీ కిందకి వదిలేశాడు.

"ఆయనగోరికి తమరేమవుతారండీ"

"దూరపు బంధువులం"

"ఓహో.. తమరిట్టాగే నడుచుకుంటూ వెళ్లి కుడిపక్కకి తిరగండి. అట్నుండి ఎడమ పక్కన పెద్ద వేపచెట్టు. అక్కడ రెండు దార్లు. కుడేపుకి సరాసరెల్లిపోండి. దారి పొడుగునా చెట్లుంటాయి. అలా నడుచుకుంటూ వెళ్తే పెద్ద గోడొకటి కనిపిచ్చుద్ది. తలుపులు మూసుంటాయి. మామూలుగా నెట్టేరు... వీసం కదలవండి."

"అక్కడ పనిమనుషులు లేరా?"

"పనిమనుషులు" అని కిసుక్కున నవ్వాడు.

"ఆ గేటుని బలంగా నెట్టేయండి. కిర్రుకిర్రుమని తలుపు తెరుచుకుంటుంది. కంగారు పడిపోకండి. ఎదురుగా పెద్ద దెయ్యాల కొంప కనిపిస్తుంది. లోపలకు ఎల్లండి"

"దెయ్యాల కొంపంటున్నారు. అందులో నిజంగా దెయ్యాలున్నాయా?"

"మనకు తెలవదండి. అక్కడ పెద్ద పెద్ద పుట్టలుంటాయండి. గోధుమరంగు తాచు పాములుంటాయండి. రక్తపింజర్లూ.. కట్ల పాములుంటాయండి. ఇంకానేమో..."

"మనుషులు మాత్రం వుండరంటున్నారా?"

"నేనెందుకంటానండి. అందులో తమరు ఆ ఇంటి బంధుగులు" అన్నాడు వ్యంగ్యంగా.

"భూషణంగారు అందులోనేనా వుండటం?"

"అందులోనేనండి"

"థాంక్స్"

"ఓహో.. ఇంగ్లీషు... మరి పదండి" అన్నాడు తలెగరేసి.

ఆ వ్యక్తి ఇంకేం మాట్లాడకుండా ముందుకు నడిచాడు.

'బోసడిగాడ్ని 'భూషణంగారు' అంట. ఆడిదో కొంపంట. ఈడాడికి సుట్టవంట. కొడుకు అర్ధరాత్రి కేకలెట్టుకుంటూ లగెత్తాల' అనుకుంటా వెళ్తున్నాడు.

అతనికి ఆ మాటలు వినిపించినా ఏమనకుండా ముందుకే నడిచాడు.

వేపచెట్టు దగ్గర రెండు తోవలు. అక్కడి నుండి గతంలో పెద్ద బాటవున్న గుర్తులు.




రెండుపక్కలా చెట్లు చూసుకుంటూ వెళ్లాడు. అతను చెప్పినట్లుగా దూరంగా పెద్ద గోడ, మూసిన తలుపులు. దగ్గరకి వెళ్లాక పాకుడు పట్టిన గోడ. దాని మీద పెరుగుతున్న చిన్నచిన్న మొక్కలు. ఓ మూల రావి ఆకులు కనిపించాయి. సూట్ కేస్ కింద పెట్టి తలుపులు బలంగా నెట్టాడు. అదోరకం శబ్దం. తెరుచుకున్నాక చేతులకేసి చూసుకున్నాడు. అదేరంగో తెలియదుగాని, అటూ ఇటూ చూసి చెట్లనుండి ఆకులు తెంచి వాటితో రుద్దాడు. కొంతపోయింది. ఇంక మిగిలిన రంగుతోపాటు ఆకుల రంగు అదనంగా కనిపించింది.

దాన్ని ఎక్కడ పూయాలో అర్థంకాక సూట్ కేసు అందుకున్నాడు. లోపలకి నడుస్తుంటే దెయ్యాల బంగళాలోకి వెళ్తున్న ఫీలింగ్.

"అతను చెప్పింది నిజమేనా? " అనుకున్నాడు.

లోపలంతా అస్తవ్యస్తంగా వుంది. చెట్లూ, ఏవేవో పిచ్చి మొక్కలూ, వాటిమీదే ఎగురుతున్న రంగురంగుల పిట్టలూ, సీతాకోకచిలుకలూ కనిపిస్తున్నాయి. ఎందుకో టక్కున ఆగిపోయాడు.

"ముంగిసా" అనుకున్నాడు.

చాలా తాపీగా నడుచుకుంటూ వెళ్తోంది. ఎంట్రవలావుందే అనుకున్నాడు. మామూలుగా అయితే మనుషుల అలికిడయితే చాలు చెంగున దూకుతాయి. అవి తనని మనిషిగా గుర్తించలేదా లేక ఇదోరకం దెయ్యమా అనిపించింది.

అలా నడుచుకుంటూ వెళ్లగానే ఆ దృశ్యం కనిపించింది. ఒకతను తన ముందు అద్దం పెట్టుకుని మీసాలకేసి చూసుకుంటున్నాడు. కొసలు మెలేసి చిరునవ్వు నవ్వాడు. తర్వాత పళ్లు కనిపించేట్లు... అంతలోనే ముఖం గంభీరంగా అలవోకగా ప్రేమగా...

జుట్టు భుజాలమీదకు జారివుంది. చెవులకు ఆభరణాలు కనిపిస్తున్నాయి. ఓ పక్కన పెట్టిన చెప్పులు పాతగా పేదగా కనిపిస్తున్నా వాటిలోనూ రాజసవేదో వుంది.

తన భంగిమలకు పరాకాష్టగా వికటాట్ట హాసం చేయబోయి, పక్కకి తిరిగిన లిప్తలో భృకుటి ముడిచి 'ఎవరు మీరు' అన్నట్లు చూశాడు.

ముఖం దివ్యంగా వుంది. దానిలో అక్కడక్కడా చీకట్లు కమ్మినా గొప్ప తేజస్సు వుంది.

"భూషణంగారూ..."

"మేమే" అన్నాడతను.

"నమస్కారం"

"స్వీకరించాం తమరెవరు? " అన్నాడు.

"అదో పెద్ద హిస్టరీ... వంశవృక్షం చూస్తేగాని మేమెవరో తమరికి పూర్తిగా అర్థంకాదు. మేమున్నూ జమీందారులమే. మీకు దాయాదులం. వరసకు సోదరుల మౌతాం"

"మీలో ఎక్కడా జమీందారీ పోలికలు కనిపించుటలేదు. ముఖ్యముగా మీ శిరోజములు అంతగా కుంచించుకుపోవుట మాకు నచ్చలేదు. ఆ మీసములు చూసిన రోషమున్నట్లులేదు. చెంపలమీద సొంతం జుత్తుని నిర్మూలించినారు. జమీందార్ వంశమన్న కేశములతో కదా ఆరంభమగును" అన్నాడు భూషణం.

"ఫ్రాంక్‌గా చెబుతాను బ్రదర్. నేను మన భాషకూడా వదిలేశాను. మీరు చెప్పినట్లు కేశాల్ని పెంచితే నేను తినే తిండంతా వాటికే ఖర్చవుతుంది. మీ ఫిగర్ వేరు. ఏం చేసినా మీరే చేయాలి" అన్నాడతను.

"ఆ ఏమిటి చేయటం. దివాణం చూశారుగా పాడుబడిపోయింది. మమ్ములను మేము పోషించుకొనుటే దుర్భరముగా



నున్నది. సాధారణ ప్రజల్లా మేం బయట తిరగలేం. బయటివారు ఇచటికి వచ్చుటకు సాహసించరు. అందులోనూ చదరంగ మన్న మాకు ప్రీతి. ఈ వూరి జనులకు పత్తాలు అదే పేకముక్కలన్న పిచ్చి అది జూదం. మాది మేధ. అందుకే ఏకాం తంలో జీవిస్తున్నాం"

"పని మనుషులు ఎవరూ లేరా?"

"అది గతం. ఇప్పుడు పనిమనిషి మాత్రం వుంది. అదియునూ ఉదయము వచ్చి సాయంకాలం వెళ్లిపోవును"

"ఇంకా ఎవరెవరున్నారు?"

"మేము ఒక్కరమే"

"ఇంత పెద్ద ఇంటిలో ఒక్కరే వుండా లంటే మీకు భయం వేయదా?"

"అది మా వంశంలోలేదు"

"దెయ్యాలు..."

"అవి మనలనేం చేయగలవు. ఇంతకీ తమ నామధేయం. వచ్చిన కార్యం తెలుసు కోవచ్చునా!"

"అదేమిటి సోదరా! నా పేరు షార్ట్ ఫాంలో ఎ.ఎన్"

"అనగానేమి"

"ఆధునిక్. పాత పేరుని తలుచుకోవా లంటే నాకు చాలా చిరాకు. ఆ పేరులో వైభవం వుంది. రాచరికం వుంది. చరిత్ర వుంది. అవన్నీ పోయాక ఇంకెందుకు ఆ నామధేయమని విసర్జించి రానున్న కాలా నికి సింబల్‌గా ఈపేరు పెట్టుకున్నాను. గెజిట్‌లో వచ్చింది. తమరు చూడలేదా?"

చూపుడువేలు అడ్డంగా వూపాడు.

"మేం సాధారణ మానవులంకాదు. అలాంటివి చదవం. కన్నెత్తి చూడం.' వార్త లతో మాకు పనిలేదు. ఈ ప్రపంచానికి మేం చెప్పాలి తప్పించి వారినుండి నేర్చుకో నటమా... అహో..." అని బాధపడ్డాడు.

"సారీ బ్రదర్, మీ గురించి విని, మీతో కలసి కొన్ని దినాలు గడపటానికి కొన్ని వందల యోజనముల నుండి వచ్చాను. అన్నట్లు మీకు కానుకగా వీటిని తెచ్చినాను" అని బ్యాగ్ తెరిచాడు.

అందులోనుండి రెండు బాటిల్స్ తీశాడు.

"ఇది సంపెంగ నూనె. తమరి మీసము లకు. ఇది కేరళ రాష్ట్రమున మన పూర్వీ కుల గ్రంథములు తస్కరించి వాటిని మధించి తయారు చేసిన కేశ్‌మోర్".

"అనగా అర్థం"

"ఎక్కువ శిరోజములూ అని. బట్టతలల మీద కూడా వొత్తుగా జుట్టు మొలిపించు దివ్యమైన తైలం. వెంట్రుకలను తెల్లబడనీ యదు. మెదడుని చల్లబరుస్తుంది"

"చల్లబరచటమా?"

"అదే, చదరంగంలో ఎత్తులు వేసీ వేసీ హీటెక్కిన మీ మెదడుని చల్లబరిచి, మరింత ఉత్సాహాన్నిస్తుంది."

భూషణం వాటిని ఆప్యాయంగా అందుకు న్నాడు.

"ఇందాకటినుండి మిమ్ములను నిలబెట్టే మాట్లాడుతున్నాం. క్షమించు సోదరా! లోప లకు దయచేయండి. కాకుంటే ఒకేబాధ మమ్ములను తొలిచేస్తున్నది"

"ఏమిటి బ్రదర్"

"మీకు ఆతిథ్యం ఇవ్వలేనుకదాని!"

"యు డోంట్ వర్రీ బ్రదర్. మనం ఫైవ్ స్టార్ హోటళ్లనందు పడుకోగలం. పుట్ పాత్ మీద సైతం పడుకోగలం"

"అంత కర్మలేదు. మనకు మంచములకు కొదవా?"

"ఫుడ్ గురించా దిగులు. నో ప్రాబ్లమ్. కాకా హోటల్లో రెండు ఇడ్లీల్తో గడిపేస్తాను. కంట్రీక్లబ్‌లో బఫె డిన్నర్‌ని ఫోర్క్‌తో మాత్రమే తింటాను. మనం జమీందారులం





కదా కలో... గంజో... కలిసి తాగుదాం"

"మీరు మాకు నచ్చారు. లోపలకు విచ్చే యండి. మీ గదిని చూపిస్తాం"

ఎ.యస్ భూషణం వెనుక నడుస్తూ ఆ ఇంటి కప్పుకేసి చూశాడు.

"ఒకప్పుడు అచ్చట షాండిలియర్ వుండేది. దానిని అమ్మివేశాం"

"ఏమాత్రం ధర పలికింది"

"ఎంతయో గుర్తులేదు. అయిననూ ఇంత ఇవ్వమని బేరసారములు చేయుటకు మేము సామాన్య మానవులం కాదుకదా. అందులో దీపములు వెలిగించుట అసాధ్య ముగా వుండుట వలన దానిని ఇచటనుండి తరలించినాము" అని ఆగి-

"మనకు ఆదాయము వచ్చు మార్గముల న్నియూ మూసుకుపోయాయి. కొద్దిపాటి క్షేత్రంకలదుగాని, అది మేం తీసుకున్న అప్పులు చెల్లించుటకు మాత్రమే చాలును. మా సోదరులు కనుక చెప్పుచున్నాం. మిగిలి వున్న వస్తువులు అమ్ముకొని బతుకు చున్నాం. కడుహీనస్థితి" అని ఆ గది ముందుకు నడిచాడు.

అమ్మటానికి మనసు రాకనో లేక కుద రకో ఆ గోడలమీద వుంచిన తైలవర్ణ చిత్రాలు ఎ.ఎన్.ని ఆకర్షించాయి. అందులో వున్నవారిని చూస్తుంటే గతం తాలూకు చరిత్ర అంతా కళ్లముందు కదులు తున్నట్లుంది. వాటికి వేసిన దండలు దుమ్ముకొట్టుకుపోయున్నాయి. బూజు ఎవరూ దులిపే ప్రయత్నం చేస్తున్నట్లు లేదు. అందరి వ్రేళ్లకూ వజ్రపుటుంగరాలు కనిపిస్తున్నాయి.

ఒకరో అరో కొద్దిగా పెదవులు విచ్చుకు న్నట్లు చూశారుగానీ మిగతా వారందరూ ఎదురుగా వున్నవారిని కాల్చేసేలా చూస్తు న్నారు. దాన్నే గంభీరత్వం అనుకునే వాళ్ల నుకుంటా అనుకున్నాడు ఎ.యస్.

ఆ గదిలో ఓ మూల సూట్‌కేసూ, బ్యాగ్ పెట్టాక గదంతా పరిశీలించాడు. ఎందుకో దారిలో కనిపించిన మనిషి గుర్తొచ్చాడు. ఏ మూలన తాచులున్నాయో, కట్ల పాములు న్నాయో అని అటూ ఇటూ చూస్తుంటే

"ఏమి సోదరా" అన్నాడు భూషణం.

"పాములు ఇంట్లోకి వస్తుంటాయా? "

"వచ్చినా రావచ్చును" అన్నాడు తేలిగ్గా.

ఎ.యస్.కి ఏదో అందామనిపించే లోపు...

"కరిస్తే కరుస్తాయి సోదరా... అయినా మన దివాణంలో జంతువులూ, పురుగులూ, చెట్లూ అన్నీ వుంటాయి. గుర్తుంచుకోండి. మనిషి ఒకసారి మాత్రమే చావగలడు. వేయిసార్లు చచ్చుటకు అవకాశం లేదు"

"ఏం చెప్పావ్ బ్రదర్" అన్నాడు ఎ.యస్.

"ప్రయాణ బడలికలో వుండి వుంటారు. ముందు స్నానం చెయ్యండి" అని భూషణం అక్కడనుండి బయటకు వెళ్లిపోయాడు. అప్పుడు ఆ గదంతా పరిశీలించాడు. కొన్ని చోట్ల దుమ్ముదులిపాడు. మంచం మాత్రం అద్భుతంగా వుంది. దాని మీద పరుపులు వాసన వేస్తున్నాయి. అటూ ఇటూ చూశాడు కర్రలాంటిది దొరుకుతుందేమో నని.

విరిగిపోయిన చెక్కముక్క కనిపించ టంతో తీశాడు. చాలా బరువుగా అనిపిం చింది. అటూఇటూ తిప్పి చూశాడు. మంచి టేకు కర్ర. దానితో పరుపుమీద దుమ్ములే చేలా కొట్టాడు. కొద్దిసేపటికే తుమ్ములు మొదలయ్యాయి. భూషణం వస్తాడేమోనని కంగారుపడ్డాడు. దుప్పట్లు దులిపాడు. దిండు దులిపాక ఎందుకో వాసన చూశాడు.

రెండు మూడు శతాబ్దాల క్రితం వాడిన సంపెంగనూనె తాలూకు వాసన సోకినట్లని పించింది. గదంతా మూలనున్న చీపురు



తీసుకొని చిమ్మాడు. గది తళతళలాడింది. అనంతరం స్నానంచేసి వచ్చేటప్పటికి భూషణం ఆ గదిలో ఆశ్చర్యంగా నిలబడి చూస్తున్నాడు.

"మీ దగ్గర మంత్రదండమేమైనా వుందా? "

"అబ్బే అలాంటిదేం లేదు. ఈ దుమ్ములో పడుకుంటే అనారోగ్యం చేస్తుంది. మన గదుల్ని మనమే శుభ్రం చేసుకోవాలి. ఈ విషయంలో గాంధీజీ నాకు ఆదర్శం" అన్నాడు ఏ. యన్.

"వారు మాకంటే గొప్పవారా? "

"ఎంతమాత్రంకాదు. ఆయన సాధారణ జాతిపిత. మీరు చరిత్రకు వారసులు. పోలిక ఎలా. అది సరే ఈ మంచం మాత్రం గొప్పగా వుంది. ఎదురెదురుగా అద్దాలు పెట్టారు ఎందుకంటారు"

అప్పుడు అనుమానంగా చూశాడు భూషణం.

"మీరు ఇటువంటి మంచములనే చూడ లేదా? "

"ఎందుకు చూడలా? "

"ఇప్పుడు మాత్రమేనా? మీ జమీలో మంచాలకు అద్దాలుండేవికావా? "

"అందుకు కాదు. పర్పస్ ఏమిటాని? "

"లేవగానే ఎవరివో దరిద్రపు ముఖములు చూసుకోకుండా మన ముఖములు మనమే చూసుకొనుట శుభప్రదంకదా! అందుకే ఈ ఏర్పాటు"

"అదీ విషయం. అందుకే అడిగాను. మా దగ్గర కూడా మంచములూ, బల్లలూ, కుర్చీలూ, షైకప్పులూ వున్నాయిగానీ ఇటు వంటి పనితనం కలవిలేవు. అందుకు టేస్ట్ వుండాలి"

ఆ తర్వాత ఓ చోటకి తీసుకెళ్ళి చెప్పాడు.

"సోదరా! ఇంతకాలానికి నాకో అప్పుడు దొరికినాడు. ఇందాక మీరు అభిరుచి గురిం చేకదా మాట్లాడినారు. ఈ దొంగనా తాత లకూ, తండ్రులకూ బుద్ధీ, జ్ఞానం వుందా? ఛీ..." అని కొంచెంసేపు తన ముఖం కంద గడ్డ చేసుకున్నాడు.

అక్కడనుంచి భూషణంగారి భాష మారి పోయింది.

"ఏం తిన్నారు... ఏం తిన్నారు... కొడు కులకి రెండు కోళ్ళు చాలేవికాదు. భోజ నంలో ఏది తక్కువైనా చచ్చారే. ఎన్ని కూరలు, ఎన్ని పచ్చళ్లు... బంగారపు రేకుల్ని మింగే వాళ్లంట. మీగడలు, లోటాలకొద్దీ మజ్జిగలు... వాళ్ల బొందలు... అరగటానికి మందులు. సాయంకాలం అయ్యేసరికి గుర్ర పుబండి తయారు. ఆడూ ఆడి గుర్రం రెండూ దర్పంగా వుండాలి. అక్కడనుండి గానాబజానాలు మొదలు. ఏ అర్ధరాత్రికో కొంపలకి చేరుకోవటంలేదా సానుల కొంప ల్లోనే కాపురాలు. ఆ ముండలకి పరగణాలు రాయటం, వ్రేళ్లకున్న ఉంగరాలు చూశావా... ఇది బాగుంది అయ్యగారూ అంటే చాలు దానేలుకి తొడగటమే. ఏంటయ్యా మా దగ్గరికొచ్చేటప్పటికి ఏం మిగిల్చారు. అసలు నీకు తెలుసా గంజిలో ఉప్పేసుకు తాగిన రోజులున్నాయి. ఉల్లి పాయ, ఎండుమిరపకాయల్తో పచ్చిపులుసు చేసుకున్న రోజులున్నాయి. ఇవాళ మన పుడ్డు అదే" అన్నాడు.

ఇప్పుడు ఏ.ఎన్ ఆశ్చర్యంగా చూశాడు.

"మా తాత చచ్చేముందు దగ్గరికి పిలిచా డయ్యా! నాతో ఏదో చెబుతానంటే ఏవన్నా నిధులు దాచేడేవో, ఆ రహస్యం నాకు చెప్పి పోతాడనుకున్నా. అయినా నా పిచ్చిగాని అట్లాంటివి దొరికాయని చెబితేగాని మంచం మీద నుండి లేచేవాడు కాదు. అట్టాంటి రకాలు.

"మనవలుంగారూ... మనం సాధారణ మానవులంకాదు. దివ్య పురుషులం" అన్నాడు.





"పొంగిపోయా...

"మనకప్పుడు ఇయన్నీ ఎట్లా తెలుసు. మొత్తం వూడ్చేశారూ డొల్ల మాత్రం వుందని.

"ఆయన చేతిలో నా చెయ్యి వేయించు కొని ప్రమాణాలు చేయించుకోవటం...

"ప్రాణం పోయినాసరే మన వంశం పేరు నిలపాలి. ముఖ్యంగా మీసాలకెప్పుడూ సంపెంగనూనె రాయాల న్నాడు. తిన్నాతినకపోయినా అది మానొద్ద న్నాడు.

"అలాగే అన్నా...

"మన భాష చాలా గొప్పది. ఎప్పుడూ 'నేను' అనకూడదు. 'మేము' అనే మాట్లాడా లన్నాడు. చివరికి పెళ్లాన్ని కూడా 'మీరూ' అనే అనమన్నాడు. ఒక్క సేవకుల తాట మాత్రం తియ్యమని నాలుగు కొరడాలు చూపించాడు. మనం వేటకెళ్తే కుందేళ్లూ, జింకలూ కాదు. అయితే పులి లేకపోతే సింహం చావాలన్నాడు. అది కుదరకపోతే వాటి కాళ్లతో గుండెలు చీరించుకుని పోయినా గౌరవమేనన్నాడు.

"తప్పకుండా అన్నా.

"సంవత్సరానికోసారి ఆయన జన్మదినం. వర్థంతి జరపమన్నాడు.

"ఆయనకేగాక వంశవృక్షం ఇచ్చాడు.

"పుష్కరాలకి పిండాలెట్టమన్నాడు.

"మెల్లగా చెవిలో నోరెట్టి... 'గుళ్లకీ గోపు రాలకీ బోల్డంత డబ్బులిచ్చాం. పొలా లిచ్చాం. భోగం వాళ్లనిచ్చాం. ఈ చుట్టుప క్కల కన్నెరికం చేయాల్సొస్తే ముందది మన వంశమే చేయాలి మనవడా" అన్నాడు.

"ఏం పెట్టి? " అని అడిగానా?

"అలాగేనన్నా...

"చివరాఖరి మాటగా గంధపు చెక్కల్తో తగలబెట్టమన్నాడయ్యా"

అని జేబులు వెతుక్కుని చుట్ట తీశాడు.

"అగ్రజులు చుట్ట తాగవచ్చునా" అన్నాడు ఏ. యన్.

"ఇంకేం తాగాలి గోగుపుల్లలు"

"తప్పు సోదరా మా దివాణంలో ఇంత బారు గొట్టాలుండేవి. మా తాతలు వాటిల్లో ఏదో వుండేది దాన్ని పీల్చేవాళ్లు"

"తెలుసులే! మన్దగ్గరా వుండాలెక్కడో వాటిల్లోకి వూరికే పొగరాదు. సర్లే సడానరా బాక. ఇయన్నీ చెప్పి ఇదిగో ఈ కొంపని నాకు తగిలించి పోయారయ్యా! మనం ప్రమాణం చేశాం కదాని ఇక్కడినుంచి బయటకు పోలేకపోతున్నా. ఇంతకంటే కూలిపనులు చేసుకునేవాళ్లు హాయిగా బతు కుతున్నారయ్యా!"

"మీరేం దిగులు పడొద్దు. మనకి మంచి రోజులొస్తాయి. నా దగ్గర కొంత డబ్బుంది. అది అయిపోయేలోగా మన జీవితాలు మారిపోవాలి. మీరుమాత్రం చెయ్యాల్సిందొ కటే" అన్నాడు.

"ఏంటో చెప్పు"

"మీ తాతగారు చెప్పిందే చెబుతున్నానని కోప్పడకండి. మీరు మీ కేశ సంరక్షణ చూసుకోండి. నేను కొలతలు తీసుకుని కాస్ట్యూమ్స్ కుట్టిస్తాను. భాషలో ఇంకొంచెం గ్రాంధీకం వున్నా పర్లేదుగానీ పొరపాటున కూడా పామరుల భాష మాట్లాడకూడదు"

"నీ దగ్గరేదో మాట్లాడాంగానీ ఇతరుల ముందు మాట్లాడం"

"మనిద్దరం ఏకాంతంలో వున్నప్పుడు మాత్రం ఈ లాంగ్వేజ్ మాట్లాడండి. ఆ భాషలో అయితేనే మన గోలేంటో మనకి అర్థంకాదు"

"అది సరేనయ్యా... మనం ఎట్టా బాగు పడతాం!"

"అది నాకొదిలేయ్ బ్రదర్" అన్నాడు

ఏ.ఎన్.

"నాకెందుకో నువ్వు నచ్చావయ్యా... సంపెంగనూనెతో మనసు దోచుకున్నావ్. ఇకనుంచి నువ్వేం చేయమంటే అదే" అన్నాడు భూషణం.

"అట్లయితే ముందు మనం ఈ ఇంటికి పట్టిన దుమ్ము దులపాలి" అన్నాడు ఏ.ఎన్.

"మనమేనా? "

"అవును జన్మగృహం కార్యక్రమం" అన్నాడు.

"సరే కానియ్యండి"

ఆ తర్వాత ఒక్కోగదిని సంస్కరించటం మొదలుపెట్టారు. భూషణం ముక్కుకి అడ్డంగా గుడ్డకట్టుకుని ఓ గంట పనిచేసి అలసిపోయాడు.

ఇంకొక్క గది మాత్రం మిగిలుంది.

ఏ.ఎన్. ఆ గది దగ్గరికి వచ్చి దానికి తాళం వేసుండటం గమనించాడు.

"అగ్రజా ఈ గదికి తాళం వేశారెందుకు? " అన్నాడు.

భూషణం ముఖంలో నీలినీడలు తొంగి చూశాయి. కొంచెంసేపు మాట్లాడకుండా ఆలోచిస్తుండిపోయాడు.

"మీకు ఇష్టంలేకపోతే చెప్పొద్దులెండి"

"అదేంలేదు... చూద్దువుగాని. అవును తాళం చెవి ఎక్కడపెట్టాను" అని తన గదిలోకి వెళ్లి వెతికాడు. ఎక్కడా కనిపించలేదు.

"ఏమైందబ్బా" అని గుర్తు చేసుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాడు.

"పోనీలెండి వదిలేద్దాం"

"ముందు తాళం చెవి ఏమైందో తేలాలిగా. అంతగా అయితే రేపు పగలగొడదాం" అన్నాడు భూషణం.





"అలాగే" అన్నాడు.

ఆ ఇంటిని చూసుకునేసరికి భూషణం సంబరపడిపోయాడు.

"మంచిరోజులు వస్తున్నాయా" అనుకున్నాడు.



అకస్మాత్తుగా మెలకువ వచ్చింది ఏ.ఎన్‌కి.

చెవులు రిక్కించాడు. ఏవేవో శబ్దాలు వినిపిస్తున్నాయి.

ఇంటిని శుభ్రం చేశారు. దొడ్డి కూడా బాగుపడితే మంచి లుక్ వస్తుందనుకున్నాడు.

మొత్తం తను చూసిన వస్తువుల్ని అంచనా వేస్తున్నాడు. ముఖ్యంగా అతనికి నచ్చిన వాటిల్లో ముఖద్వారం ఒకటి. ఎంత చూసినా తనివి తీరటంలేదు. దానిమీద రకరకాల బొమ్మలున్నాయి.

భూషణం గదిలో పందిరిమంచం మీద సాలభంజికలు కొలువుతీరారా అనిపిస్తోంది.

ఓ గదిలో వినాయకుడి బొమ్మవుంది. ఇంతవరకూ ఎప్పుడూ చూడని భంగిమ అది. టేకుతో చేసిందో ఎన్ని సంవత్సరాల క్రితం చేయించారో ఇప్పుడు శ్రద్ధ తీసుకోకపోవటంతో మాసిపోయి కనిపిస్తోంది.

ఇంకా రాముడూ, సీతా, ఆంజనేయుడూ, లక్ష్మణుడూ వీరందరి బొమ్మలు చెక్కతో మలిచారు. అవన్నీ గదుల మూలల్లో పడున్నాయి.

వాటన్నింటికీ పాలిష్ చేయిస్తే పూర్వపు కళని_ సంతరించుకుంటాయనిపించింది.

తిరిగి నిద్రపోయే ప్రయత్నం చేశాడు.

అప్పుడు వినిపించిందా శబ్దం.

"ఘల్లు... ఘల్లు..."

ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు.

నిజంగానే లంకెల బిందెలున్నాయా? అవుంటే అలాంటి శబ్దాలొస్తాయంటారు. అయినా ఈ మనిషికి ఎలా నిద్రపడుతుంది? ఒక్కడే ఇంత పెద్ద ఇంటిలో పడుకున్నాడంటేనే ఎంత మూర్ఖుడో అర్థం చేసుకోవచ్చుననిపించింది.

శబ్దం ఆగిపోయింది.

'ఇదంతా భ్రమా' అనుకున్నాడు.

మొదటిరోజు కాబట్టి కొత్త ప్రాంతంలో నిద్రపట్టడం లేదేమో ననిపించింది. అలా మెలకువ రావటం. తిరిగి నిద్రరావటం, తెల్లవార్లూ అలానే గడిచింది.

ఉదయం భూషణం వచ్చి లేపాకగాని మెలకువ రాలేదు.

ఇద్దరూ కలసి బయటకొచ్చారు. గానుగ చెట్టు పుల్ల విరుచుకొచ్చాడు ఏ.ఎన్. వాటితో పళ్లు రుద్దారు.

ఇంకొంచెం సేపటికి పనిమనిషి వచ్చింది.

"టీ పెడతావా" అన్నాడు ఏ.ఎన్.

"నాకు రాదుకదయ్యా"

"ఈ ఊర్లో హోటలుందా?"

"ఉందయ్యా"

"ఫ్లాస్క్‌వుందా ఇంట్లో"

"ఉందయ్యా!"

"అయితే దాన్నిండా టీ పోయించుకొని ఇడ్లీలుంటే పట్టుకురా" అని డబ్బులిచ్చి పంపాడు.

పనిమనిషికి అతనెవరా అనే అనుమానం వున్నా ఏమీ అడగలేదు. హోటలు దగ్గర నలుగురైదుగురు తింటున్నారు. ఇడ్లీలు పార్శిల్ కట్టమనగానే "ఎవరికేంటి" అన్నారు.

"అయ్యగారి చుట్టవనుకుంటా" అంది.

"ఆడెవడు. తలమాసినోడు"

"మన సూరిగాడికి నిన్న కనిపించాడుట. తలకి వాసన నూనె రాశాడంట"

"సూరిగాడు చూశాడంటా?"

"వాసన చూత్తారేటీ... పర్లాంగు దూరం గుప్పుగుప్పున కొట్టిందంట"

"ఎవరో మరి"

"ఏమో ఈ డబ్బ భోసనడిగాడు" అన్నాడతను.

  

"ఇవన్నీ ఎందుకు సోదరా! మీకు చాలా శ్రమ ఇస్తున్నాం" అన్నాడు భూషణం ఇడ్లీలు చూసి.

"అలా అనకు సోదరా! గది తాళం చెవి దొరికిందా?"

"ఇదిగో ఆ గది తాళం చెవి ఎక్కడున్నది?" అనడిగాడు భూషణం.

ఆ అమ్మాయి ఏదో ఆలోచించి వంటగదిలోకి వెళ్లి ఓ గుత్తి తాళం చెవులు తెచ్చింది.

టిఫిన్ అయ్యాక వాటితో కుస్తీ మొదలయింది.

ఎప్పటికో తాళం వచ్చింది.

"అగ్రజా.. రండి"

భూషణం వచ్చాడు.

"మూసిన మా గది తలుపులు తెరుస్తున్నావ్" అన్నాడు.

ఏ.యన్ ఆ మాటల అర్థం ఏమిటన్నట్లు చూశాడు.

తలుపులు నెట్టాడు. ఏ.ఎన్ భూషణంతో ఆ గదిలోకి అడుగుపెట్టాడు.

అదోరకమైన వాసన. ముక్కు మూసుకున్నాడు భూషణం.

ఏ.ఎన్. కళ్ళముందు పెద్ద భోషాణం!

అప్రయత్నంగా వెళ్లి దాన్ని చేత్తో తాకాడు. అతని జీవితంలో ఎప్పుడూ అలాంటి భోషాణాన్ని చూసి వుండలేదేమో. ఎంతమంది పనివాళ్ళు ఎన్ని రోజులు కష్టపడి తయారుచేశారోగాని అపురూపంగా వుంది.

"చాలా బాగుంది" అన్నాడు.

"అవును. మేముపోతే తగల బెట్టడానికి అదే మిగిలివుంది." అన్నాడు భూషణం.

"అగ్రజా అలా అనకండి. మన జీవితమును మార్చివేయు భోషాణం ఇది" అన్నాడు ఏ.ఎన్.

"ఏమిటో మీమాటలు నాకు తమాషాగా వుంటున్నాయి. ఈ చెక్క పెట్టె మన జీవితాలను బూడిదగా తప్ప ఏ విధంగా మార్చును"

"ఆ సంగతి నాకు వదిలేయండి. దీని చరిత్ర చెప్పండి"

"దీనికి చరిత్ర ఏమున్నది సోదరా రాజులసొమ్ము రాళ్లపాలయినట్లుగా మా జమీందారుల సొమ్మంతా ఈ భోషాణాల పాలయ్యాయి. వీటిమీద నగిషీలు, వజ్రాలుంటే అవీ పెట్టేవాళ్లేమో. మామూలుగా భోషాణాలెందుకు. బట్టలు పెట్టుకుంటారు. చిన్న చిన్నవయితే భోజన సామగ్రి పెట్టుకుంటారు. ఈ మూత తెరిచి చూడండి. అందులో రెండు కుటుంబాలు కాపురం చెయ్యొచ్చు"

'ఏ.ఎన్' భోషాణం ఎక్కాడు. అరలు అరలుగా మూతలున్నాయి. ఓ మూత తీశాడు. లోపలంతా చీకటి. అందులోనుండి ఏదో వాసన.

"లోపలికి దిగు మిత్రమా" అన్నాడు భూషణం.

"వద్దులే అగ్రజా"

"ఏమి అందులో మండ్రగబ్బలూ, పాములూ వుంటాయని భయమా"

"అవును, అలాంటి వాటికి అవకాశం వుంది"

"సోదరా మన వంశముల గురించి మీకు తెలియందేముంది. ఈ భోషాణాల్లో అక్రమ సంబంధాలుండేవి. అంతఃపురాల్లో వీటిల్లో ఏం జరుగుతుందో బయటి ప్రపంచానికి తెలియదు. ఎవడన్నా దొరికినా చావగొట్టి చెవులు మూసి ఇందులో పడేసేవారు. ఆ రకంగా చూస్తే ఈ భోషాణం ఎన్నిసార్లు మైలపడిందో, ఎన్నెన్నిసార్లు రక్తసిక్తమయిందో మనం వూహించుకోవలసిందే తప్ప, నిజాలు తెలియాలంటే భోషాణానికి నోరుండాలి"

ఏ.ఎన్. తలూపాడు.

దాన్ని చూస్తుంటే అలాంటి భావమే కలిగింది. చాలా విశాలంగా వుంది. దానికోసం ఓ ప్రత్యేకమైన గది అవసరం అయింది. దాన్ని కదిలించాలంటే పదులకొద్దీ మనుషులు కావాలి. అక్కడక్కడా పేళ్ళు లేచినట్లనిపిస్తున్నా దిట్టంగా వుంది. ముందు ఇద్దరు మనుషుల్ని పెట్టి శుభ్రం చేయించాలి. ఆ గది తలుపులు తీసి గాలీ వెలుతురూ వచ్చేలా చూడాలి. ఆ తర్వాత మంచి పనివాళ్లను పిలిపించి చిన్నచిన్న మార్పులు చేయిస్తే బాగుంటుంది అనుకున్నాడు. అంతలోనే ఆ ఆలోచనని విరమించుకున్నాడు.





"ఎక్కడ ఎలావుందో అదే అందం. దీనిని బాగుచేయిస్తే అటు కొత్తదికాదు. పాతదీ కాదు. నావరకు నాబండి మీద దుమ్ము తుడవటం ఇష్టం వుండదు. ఐ ఎంజాయ్ ది డస్ట్. ఒక్క ఇంజిన్ మాత్రం పెరఫెక్ట్‌గా కండిషన్లో వుండాలి" అన్నాడు అతని మిత్రుడోసారి తన బండిగురించి మాట్లాడుతూ.

ఏమిట్రా ఇలా మాట్లాడుతున్నాడనిపించింది. కొంచెం క్రాకా అనికూడా అనుకున్నాడు. లోతుగా ఆలోచిస్తుంటే ఏదో విషయం అర్థమైనట్లుగా అనిపించింది.

ఆ గదిలోనుండి బయటకు వెళ్దాం అనుకుంటుండగా కనిపించిందది స్టాండ్‌కి బిగించివున్న ఓ అసంపూర్ణ చిత్రం.

"అగ్రజా ఎవరీమె"

భూషణం అటే చూస్తున్నాడు. మాట్లాడలేదు.

బొమ్మ మొత్తం పూర్తయింది గాని, ముఖం చిత్రించకుండా వదిలేశారు.

"ఇంతకూ దీన్ని గీసిన చిత్రకారుడెవరు? "

"మేమే"

ఏ.ఎన్. ఆశ్చర్యంగా చూశాడు.

భూషణంలో ఇంతటి చిత్రకళ దాగుందా అని.

"మాకు కేశపోషణ మించి కళాహృదయం లేదని మీరూ అనుకుంటున్నారా" అన్నాడు.

"లేదు. లేదు"

"రండి పోదాం" అంటూ బయటకు దారి తీశాడు.

ఏ.ఎన్ భూషణాన్ని అనుసరించాడు.

ఇంటి బయటకు నడిచాక రెండుచేతులూ వీపువెనక బెట్టి అటూ ఇటూ నడుస్తూ చెప్పాడు.

"మూసిన మా గది తలుపులు తీస్తున్నారని చెప్పాను. ఆ చిత్రం నా ఊహాసుందరి కాదు. కలల్లో మమ్మల్ని వెంటాడే పేరు తెలియని అప్సరస కాదు. మేం నూరు పాళ్ళూ ఆరాధించి, ప్రేమించి, హృదయం అంకితం చేసిన మా హృదయనేత్రి"

భూషణం జరిగిపోయిన సంఘటనలు చెబుతున్నంతసేపూ అటూ ఇటూ తిరుగుతూనే వున్నాడు.

ఆ అమ్మాయి 'అఖిలాదేవి'. తనకు వరసకు మరదలు అవుతుంది. చిన్నప్పటి నుండి 'మన' భూషణానికి అఖిలాదేవిని ఆభరణం చేస్తున్నాం అనేవారు వాళ్ళమనుషులు. భూషణానికి అఖిల చాలా నచ్చింది. అప్పటినుండీ ఆమె ఏ పనిచేసినా అపురూపం అనిపించేది.

ఏ రకంగా చూసినా భూషణం వంశంతో వారు సరితూగరు. 'మా భూషణంబాబు' అంటూ ఎంతో ఆనందంగా చెప్పుకునేవారు. మీతో వియ్యమందుకోవటం మా అదృష్టం అనేవాళ్ళు.

రోజులు గడుస్తున్నాయి.

భూషణానికి మీసాలు వచ్చాయి.

అఖిలలో ప్రతియేడూ సరికొత్త అందాలు వచ్చి చేరుతున్నాయి. ఆమెని చూస్తుంటే భూషణంలో ఏదో సంచలనం. అఖిలను తన దగ్గరకు తీసుకోవాలని, సాయం సమయాల్లో అఖిలా తను వ్యాహ్యాళికి వెళ్లాలనీ వుండేది.

కానీ ఆ అమ్మాయికి వయసు వస్తున్న కొద్దీ మనిషిలో మార్పు రావటం గమనిస్తున్నాడు భూషణం.

'బావా బావా' అంటూ తనచుట్టూ తిరిగే అఖిల అప్పటితీరే వేరుగా వుండేది. అసలు అఖిలను చదివించటానికి 'మద్రాసు' నగరం

పంపించటమే భూషణానికి ఇష్టం లేదు. ఆ వయసులోని ఆడపిల్లకు చదువు అవసరం లేదు. వారు చేయవలసిందల్లా తమ అందాలకు మెరుగులు దిద్దుకోవటమేననే అభిప్రాయం భూషణానికి వుండేది.

అఖిల మేనమామవన్నీ సీమ పద్ధతులు. అతను ఓడలమీద ఇతర దేశాలకు ఏవేవో వస్తువులు ఎగుమతి చేసేవాడనేవారు. వారికి కార్లూ, ఫోన్లూ, అందమైన కుక్కపిల్లలూ, రకరకాల డిన్నర్ సెట్లూ, అసలావంటకాలు పేర్లు ఏమిటో తెలియని రకాలు, హాలు మధ్యలో ఫౌంటెన్లూ. అప్పుడప్పుడూ పార్టీలూ. అక్కడకు వచ్చే ఆడా మగా నర్తించటాలూ ఇవన్నీ అట్టహాసంగా జరిగిపోతుండేవి.

"బావా ఎప్పుడూ ఈ పల్లెటూర్లో వుంటే ఏం తోస్తుంది. మా అంకుల్ ఇంటికొస్తే చూడాలి థ్రిల్ అయిపోవటమే. నేను షిప్స్ చూశాను. ఎంత పెద్దవో. అంకుల్ బిగ్ పార్టీస్ ఇస్తుంటారు. అన్ని దేశాలవాళ్ళూ వస్తారు. దే డాన్స్ వెల్. దైర్ మేనర్స్, మ్యూజిక్, కాస్ట్యూమ్స్ సింప్లీ మార్వెలెస్. ఐ లైక్ దెమ్. ముఖ్యంగా ఇంగ్లీష్ భాష చాలా గొప్పది. నువ్వు కూడ నేర్చుకుంటావా" అంటుంటే ఎవరీ అమ్మాయి. కొత్త లోకాల నుండి వచ్చి మాట్లాడుతోందనిపించేది.

ఆ మాటలు వింటానికి బావుండేవి. తనకసలు చాలా మాటలు అర్ధమయ్యేవికావు. అయినా కూడా నేర్చుకోవటం అనే విషయం మీద 'భూషణం' రాజీపడలేదు. ఆ మాటే చెప్పినప్పుడు అదోలా చూసింది- అఖిల.

అలాంటిచూపే 'అఖిల' అంకుల్ ఇంట్లో జరిగిన పెద్దపార్టీలో ఓ తెల్లవాడు చూశాడు. అతను ఏమన్నాడో తెలియదు. చుట్టుపక్కల అందరూ నవ్వారు. అఖిల కూడా నవ్వింది. ఆ మాటలకి అర్థం తెలియక విలవిలలాడిపోయేడు. అన్నింటికీ మించి ఎవరెవరో అఖిలను ముద్దులు పెట్టుకుంటుంటే ఏమాత్రం భరించలేకపోయాడు. వాళ్లమీద తిరగబడాలనుకున్నాడు గానీ అఖిల అంకుల్‌ని చూసి ఆగిపోయాడు.

తర్వాత బీచ్ ఒడ్డుకి తీసుకెళ్ళాక 'అఖిల'ని అడిగాడు భూషణం. "వాళ్ళందరూ అలా ముద్దుపెట్టుకుంటుంటే నువ్వెందుకు నవ్వుతున్నావు" అన్నాడు.

అదోలా చూసింది అఖిల.

"అందులో తప్పేంలేదు. వాళ్ళు మనని రిసీవ్ చేసుకునే పద్ధతి అది" అఖిల నవ్వి చెప్పింది.

"మనం గొప్ప వాళ్లం కదా వాళ్ళు మన పద్ధతుల్ని అనుసరించాలి"

"ప్రపంచానికి కల్చర్ నేర్పింది వాళ్ళు గొప్పవాళ్ళుకూడా వాళ్లే" అంది నిర్మొహమాటంగా.

భూషణం చిన్నబుచ్చుకున్నాడు.

అయినాకూడా అఖిల అంటే మరింత అభిమానం పెరిగింది. పెంచుకున్నాడు.

ముఖ్యంగా అఖిల దుస్తులు చూసి ఆకాశంలో విహరించే దేవతా వస్త్రాల్లా వున్నాయనుకున్నాడు. చాలా విషయాలు చెప్పింది అఖిల. అవేవీ భూషణం బుర్రకి ఎక్కటంలేదు.

ఇంగ్లీష్ సినిమాలూ అక్కడి డాన్స్‌లూ, మ్యూజిక్, ఇవన్నీ మనుషుల్ని ఎంత ప్రేరేపిస్తాయో చెప్పింది.

ఇంటికి వచ్చాక భూషణం చాలా ఆలోచించాడు. 'అఖిల' అందంగా వుంటుంది. అంతవరకు అంగీకరించవచ్చు కానీ ఆ అమ్మాయి మాటలూ, ఆ స్వేచ్ఛా, ఆ భాష ఇవేం నచ్చటంలేదు. తన తల్లిని చూశాడు. ఇంకా చాలామంది ఆడవాళ్ళని

చూశాడు. వాళ్లకీ అఖిలకీ పోలికే లేదు. ఇంతకూ 'అఖిల' తన భార్య అయితే ఈ దివాణంలో వుంటుందా అనే అనుమానం వచ్చింది.

అప్పటికే పరిస్థితులు అర్థం అవుతున్నాయి. ఒక్కొక్కరూ జారుకుంటున్నారు. 'దివాణం' కళ తగ్గిపోతోంది. బలవంతాన నెట్టుకురావటం చూస్తున్నాడు. తండ్రి మరణంతో మొత్తం 'డొల్ల' ఏమిటో తెలిసొచ్చింది. డబ్బుగా ఏమీ కనిపించటంలేదు. ఇంటినిండా సామాన్లు మాత్రం వున్నాయి. ఎక్కడెక్కడో చేసిన అప్పులవారందరూ కాగితాలు తీసుకొచ్చారు. అవన్నీ చూసి 'భూషణం' అమ్మ గుండెపోటుతో కూలిపోయింది.

'అత్తయ్య'ను చూడటానికి 'అఖిల' వచ్చింది. అంకుల్ కారులో దిగి నోట్లో పెద్ద పైపునుంచి గుప్పుగుప్పున పొగ వదిలేడు.

'నేను చచ్చిపోయేలాగా భూషణం పెళ్లి జరగాలి' అంది.

అఖిల మాట్లాడలేదు.

'ఇప్పుడవన్నీ ఎందుకు ముందు నీకు తగ్గనీ' అన్నాడాయన.

'నాకింక తగ్గదు. ఈ పతనం నేను చూడలేను' అందావిడ.

'సరే. మాట్లాడదాం' అన్నాడు.

భూషణంతోపాటు చెరువుదగ్గరకెళ్లింది అఖిల. చెరువు దగ్గరికి రావటం భూషణానికి ఇష్టంలేదు. గదిలోనో, తోటలోనో కూర్చుని మాట్లాడుకుందాం అని చెప్పినా వినలేదు.

"నాలుగు గోడల మధ్య మనం కొద్దిగంటలే బతకాలి. కొన్ని కాలాల్లో బతకాలి" అంది అఖిల.

ఎవరన్నా గమనిస్తున్నారేమో అన్నట్లు చూస్తున్నాడు. అఖిల కొంచెంసేపు చెరువులో నీళ్లని చూస్తూ, కొంచెంసేపు రాళ్లు విసురుతూ గడిపింది. భూషణం మాత్రం ఆమెనే చూస్తున్నాడు.

"పెళ్లి మీద నీ అభిప్రాయం ఏమిటి బావా" అంది అఖిల.

"ఇందులో అభిప్రాయాలకేముంది. పెద్దవాళ్ళు ఎవరిని కట్టుకోమంటే వారిని కట్టుకోవడమే"

"జీవితాంతం కలసి బతకాలిగా"

"అందుకేగా పెళ్లి"

"అలాంటప్పుడు సెలక్ట్ చేసుకోవాలి- మనకు నచ్చేవాళ్లని"

"నువ్వేం అంటున్నావో నాకు అర్థం కావటంలేదు"

అఖిల నవ్వేసి, సూటిగా భూషణం కళ్లలోకి చూసింది.

"అత్తయ్య పెళ్లి చూడాలనంది కదా"

"అయితే..."

"ఆమె చూడాలనుకుంటున్నది మన పెళ్లినే కదా"

"అవును"

"మనం పెళ్లయ్యాక 'హనీమూన్' ఎక్కడికెళ్దాం" ఓరగా చూస్తూ అడిగింది

"ఎక్కడికో వెళ్లటం ఏమిటి? "

"నాలుగు గోడల నడుమ వుందామనుకుంటున్నావ్. సరే బావా నాకు బోల్డన్ని కోరికలున్నాయి. అవి తీరాలంటే డబ్బులు కావాలి. వాటిని ఎలా సంపాదించగలవ్? "

"మనం సంపాదించటం ఏమిటి? "

"రోజులు చాలా మారిపోయాయి. జమీలు పోయాలి. భరణాలు రద్దయ్యాయి. మనలాంటి వాళ్లందరూ కొత్త రంగాల్ని వెతుక్కోకపోతే కొండలు కరిగిపోతాయి.



అంకుల్ ది చాలా ముందుచూపు. ఎక్స్‌పోర్ట్ బిజినెస్ మొదలుపెట్టింది అందుకే. ఆయన మీడియేటర్. కమీషన్ క్రోర్స్‌లో వుంటుంది. మెల్లగా ఫ్యాక్టరీలు పెట్టాలని ప్లాన్ చేసుకుంటున్నాడు. అలాంటి ఆలోచన నీకుందా? "

"ఖచ్చితంగా లేదు"

"ఓ.కె. బావా నువ్వు జీవితం చాలా చిన్నదనుకుంటున్నావ్. నేను సముద్ర మంత విశాలమైనదనుకుంటున్నాను. చిన్నప్పటి మాటలూ, సెంటిమెంట్లూ ట్రాష్. అంటే చెత్త. మన దారులు కలవ్వని నేననుకుంటాను" అంది.

"నువ్వు బాగా చదువుకున్నావని తెలుసు. ఇలాంటి మాటలు నాకు అర్థంకావు"

"నేను చెబుతున్నది కూడా అదే. నీకు అర్థం కావలసిన ప్రపంచం ఎంతోపెద్దది. నీ దగ్గర 'అహం' వుంది. ముందే ఏర్పరచుకున్న భావాలున్నాయి. నువ్వేమీ చెయ్యలేవు. నవ్వలేవు. ఏడవలేవు. ఎందుకంటే నువ్వు మామూలు మనిషివి కాదు. అంతేగా. అందుకే అత్తయ్యని ఎలా కన్విన్స్ చేసుకుంటావో నీ ఇష్టం. ఈ పెళ్లి జరగదు"

"అందుకోసం ఇన్ని మాటలనాలా అఖిలా"

"నేనేమన్నాను. నీగురించి నా అభిప్రాయం చెప్పాను. నన్ను ఎవరో కిస్ చేశారని అడిగావ్. నేను హర్ట్ కాలేదు. అంతెందుకు మన మగవాళ్ళు దివాణాల్లో ఏమేం పనులు చేస్తారో నీకు తెలియదా? వాటిని అంగీకరిస్తున్నావ్. జస్ట్ ఇదీ అంతే. నీ భావాలు వేరు. నా ఫీలింగ్స్ వేరు. అందుకే మనం స్నేహితులుగా వుందాం"

"నన్ను మాట్లాడనిస్తావా? " భూషణం అన్నాడు.

"మాట్లాడు"

"నేను పెళ్ళి చేసుకుంటే నిన్నే చేసుకుంటాను. లేకపోతే అసలు పెళ్ళే చేసుకోను"

"దాన్నే సెంటిమెంటల్ ఫూలిష్‌నెస్ అనేది"

"ఇంకెవరినన్నా ప్రేమించావా? "

"లేదు"

"నువ్వు రేపు బాధపడతావ్"

"నిజమే. నిన్ను కట్టుకుంటే అరిస్టోక్రసీకి, ఫ్యాషన్‌కి, ట్వంటీఫస్ట్ సెంచరీకి దూరమైపోయానని బాధపడతాను. నాకు ఏంకావాలో నాకు తెలుసు. నన్ను గైడ్ చేయటానికి 'అంకుల్' వున్నాడు. నిజం చెబుతున్నాను. నేను 'అంకుల్' దగ్గరికి వెళ్లకపోయుంటే నిన్నే నా సర్వస్వంగా భావించేదాన్ని. ఇప్పుడు నా జీవితం మారిపోయింది. ఫైనల్‌గా చెబుతున్నా... నువ్వు మారిపోవటానికి ప్రయత్నం చెయ్యి. నాకంటే మంచి అమ్మాయి దొరుకుతుంది"

భూషణం అఖిల కళ్లలోకి కోపంగా చూశాడు.

"నేను మద్రాసులో చూసిన సినిమాల్లో ఇలానే చెబుతారు. నువ్వూ నేనూ అందరం అనుకున్నది చెయ్యలేం. అది గుర్తుంచుకో నా వెడ్డింగ్ కార్డ్ పంపిస్తా. చూడాలనుకుంటే రా" అని లేచింది.

భూషణం అలానే కూర్చున్నాడు.

★ ★ ★

అటుపిమ్మట భూషణం అమ్మగారు పరమపదించారు. అప్పుడు చూడటానికి 'అఖిల'రాలేదు. అఖిల వస్తుందేమోనని ఎంతగానో ఎదురుచూశాడు. మనసు మార్చుకోకపోతుందా అనే ఆశ ఏదో మూలవుంది.

కర్మకాండ విషయంలో ఏమాత్రం రాజీపడలేదు. కాకపోతే తన తల్లిగారికి చెందిన బంగారు ఆభరణాలన్నీ కళ్లముందునుండే నడిచివెళ్లాయి. భూషణానికి విరక్తి కలిగింది. "ఇవన్నీ 'అఖిల'కి చెందాలి. ఆమె





తనని కాదనుకున్నప్పుడు 'అమ్మకే ఖర్చుచే యటం బాగుంటుంది. దాచుకోవటం చేత యితే ఈ జమీ ఇలావుండదు" అనుకు న్నాడు.

తర్వాత అఖిలకి పెళ్లయింది. శుభలేఖ పంపించారు. దానికేసి చూస్తుంటే మతిపో యిందనిపించింది. మెరిసిపోయే కార్డ్.. రక రకాలబొమ్మలు. ఇంగ్లీష్‌లో వారిద్దరి పేర్లు. చాలాకాలం దాకా ఆ కార్డ్ దాచుకున్నాడు. అందులోనుండి 'అఖిల' తనని వెక్కిరిస్తున్న ట్లనిపించినా దానినే చూసుకునేవాడు.

తర్వాత 'లండన్' వెళ్లిపోయిందన్నారు. వాళ్ళ 'అంకుల్' మద్రాసునుండి 'సింగపూర్' మారిపోయాడు. ఎప్పుడూ విమానాల్లోనే తిరుగుతాడనుకుంటారు.

అఖిలతో చివరిసారిగా మాట్లాడింది చెరు వుదగ్గర. ఆ తర్వాత చిత్రకళ మీద మనసు పోయింది. నేర్చుకోవటం ఆరంభించాడు. ఆ కళ అతనికి పట్టుబడింది. కొన్ని వందల బొమ్మలు గీసి చింపేశాక ఈ బొమ్మ నచ్చింది. అయితే అందులో అఖిల బొమ్మను పూర్తి చేయటం భూషణానికి ఇష్టం లేకపోయింది. దాన్ని ఆ గదిలో వది లేశాడు. అంతావిని,

"ఇంట్రెస్టింగ్‌గా వుందే" అన్నాడు ఏ.ఎన్.

"సోదరా. ఇంతవరకు తమ వివాహం జరగకపోటానికి కారణం ఆ ప్రతిజ్ఞ మాత్ర మేనా? " అనికూడా అడిగాడు.

"అవును. మనమిలా వంటరిగానే జీవిం చదలుచుకున్నాం"

"మరి మీ వంశమో"

"మాతోనే అంతం కావాలి. రేపు ఎవరైనా మావంశ చరిత్ర రాస్తే అందులో చివరి అధ్యాయం మాదే కదా" అన్నాడు.

"మీరు అనవసరమైన భ్రమల్లో పడుతు న్నారు. వంశ చరిత్రలు రాయాలన్నా, ఎవ రిచేతైనన్నా రాయించుకోవాలన్నా మీ దగ్గర డబ్బో, అధికారమో వుండాలి. లేదా ఏదైనా రంగంలో మీరు ప్రఖ్యాతులై వుండాలి"

"అటులనా... అయితే మేం ప్రఖ్యాతులం కాకపోయినా మీరు మమ్మల్ని వెతు క్కుంటూ వచ్చారు. మీకేమన్నా రుణపడి నామా? "

"అబ్బే అపార్థం చేసుకోవద్దు. మీ వంశాన్ని నిలబెట్టాలన్నదే నా తాపత్రయం" అన్నాడు ఏ.ఎన్.

"అది జరగని పని" అని లోపలికి వెళ్ళి పోయాడు.

ఏ.ఎన్. భూషణాన్ని చూస్తూ నిలబ డ్డాడు. వయసు ముదిరినట్లు భారంతో కృంగిన మనిషిలా కనిపించాడు.

ఓసారి ఆ వూరిని చుట్టి రావాలనిపిం చింది.

"అగ్రజా... మీరు పుట్టిన ఈ గ్రామాన్ని చూసి రావాలనుంది. మీరు బయటకు రారు కాబట్టి నాకు అనుమతివ్వండి"

"త్వరగా రండి. మాకు ఏమీ తోచదు" అన్నాడు భూషణం బయటికి నడిచివస్తూ. 'ఈయనకి తోచకపోవటం ఏమిటి? రెండు దినాలకే అంతమార్పా? ' అనుకున్నాడు.

గ్రామంలోకి వచ్చాడు. ముందుగా సూరి కనిపించాడు. అదే లుంగీ. అడ్డంగా చుట్టి దగ్గరకొచ్చాడు.

"ఇంకా వెళ్లలేదేంటండీ" అన్నాడు.

"ఇక్కడే వుండాలనుకుంటున్నా"

"మీకు పెళ్ళి కాలేదేంటండి"

"కాలేదు"

"నేనంటున్నానని కోపం తెచ్చుకోకాకండి. సన్నాసీ సన్నాసీ రాసుకుంటే బూడిద రాలు

ద్దంటారు. ఆయనగారికి పెళ్ళీ పెటాకులూ లేవు. మీక్కూడా పిల్లనిచ్చేవాళ్ళు లేరాండీ? "

"అంటే భూషణంగారికి పిల్లనివ్వరంటావ్"

"నేనంటమేంటండి. ఈ చుట్టుపక్కల పరగణాల్లో అడిగి చూడండి. ఒకేళ పిల్లనిచ్చారనుకోండి. దానికి కూడెట్టాలిగా. ఆ బోసడీ దగ్గర ఏంవుందనెడతాడండి? "

"అదేంటయ్యా వాళ్ళు ఇవ్వొచ్చుగా"

"మరి ఆయిల్ కండీ. భూవినుంచి పెట్రోలు తీసినట్టు ఈడికి సంపెంగనూనె బావులు కావాలండి. ముఖంనిండా జిడ్డూ ఆడూనూ"

"ఎందుకయ్యా తిడతావ్... నిన్నేమన్నా అన్నాడా? "

"అనాలేటండి. ఎనకటికి ఎలాంటి కుటుంబాలండి. ఏమీ పట్టకుండా కూచుంటే అవుద్దండీ. పలానాయన మావూర్లో వున్నారంటే పేరాండి. ఈ వూరికి దిస్టి బొమ్మలా పేరాండి. అస్సలు ఈడ్ని పెళ్లి చేసుకోనని ఆ ఆడకూతురు ఛీ కొట్టిందండి. మరేటి చూసుకునండి బతుకు. మీ దగ్గర సిగరెట్లు గానున్నాయేటండి"

"లేవు. దొరుకుతాయా? "

"చార్మినార్ దొరుకుతయ్యండి. ఓ పెట్టె అట్టుకురానా" అని డబ్బులు తీసుకెళ్ళి తెచ్చి ఓ సిగరెట్ మాత్రం తీసి పెట్టె ఇచ్చేయబోయాడు.

"అది మీకే. కాల్చుకోండి"

"అయ్యబాబోయ్" అని జేబులో పెట్టుకుని...

"నిజంగా మీరు ఆల్లసుట్టాలేనండీ"

"ఎందుకా అనుమానం"

"ఒక్కడొస్తే వొట్టండి. అయినా మనిషన్నాక నలుగుర్లోకి రావాలి కదండి. ఒక్కడే ఎట్టా చస్తాడండి. ఓ పేకాటుందా, ఓ సరదావుందా, ఓ మంచీ సెడుందా. ఏంటి ఆ మడిసి తత్వం. ఎనకటికి ఆ ఇంటికేసి చూడాలంటే దడ. గుర్రపు బళ్ళు కట్టుకొని వత్తన్నారంటే రెండుకళ్ళు చాలేయి కాదంట. నేను చెబుతున్నాకదా. శన్నాకొడుకండి. ఈడు పుట్టాడు. ఆడెవడో పోయాడు. గద్దలు గుంపులుగా వచ్చాయి. నక్కలు వూళ్లోకి వచ్చాయి. ఆ ఏడు పంటలమీద వొర్సం కురిత్తే రైతుల కళ్లలో రక్తం కురిసిందండి"

"మీరు భలే మాట్లాడతారే"

"పెద్దలు చెప్పుకుంటారు. ఈ పీడాకారం పోతేగాని ఈ వూరు బాగుపడదని బెమ్మంగారు రాశారండి. ఆడినిక్కడ్నుంచి కదిలియ్యాలంటే మానవమాత్రుడొల్ల కాదండి. కలికాలం చివర్లో ఏరాజుగారండి వచ్చేది. అట్టా గుర్రమెక్కి ఎవడో రావాలండి"

ఏ.ఎన్. తలూపాడు.

"మీరుమాత్రం ఏం చేస్తున్నారు? "

"యథారాజా తథాప్రజండి" అన్నాడు సూరి.

"సర్లే. అలావుండాలనేముంది. ఈ వూర్లో ఇంకా ప్రముఖులెవరూ లేరా? "

"అంటే జుట్టుపెంచుకునేవాళ్లా. ఇదివరకి శానా మందున్నారండి. పెద్దోల్లంతా భూషణంగాడికి మల్లే ఆ జుట్టేందిరా అనటం మొదలెట్టాక డిప్ప కటింగ్ చేయించుకోవటం మొదలెట్టారండి"

"అది కాదయ్యా... బాగా పొలాలూ, ఆస్థులూ వున్నవారు లేరా అని"

"ఎందుకుండరండి. కొత్తకొత్త షావుకార్లు పుట్టుకొస్తున్నారు కదండి" అన్నాడు.

"కొంచెం ఊరు చూడాలనుకున్నాను వస్తారేంటి? "

"మీకు పేకాడడం వచ్చాండి"

"పర్లేదనుకుంటా"

"రెండాటలు వేద్దామేటండి"

"ఎంత ఆడతారు"

"మాదేవుందండి పూల్ గేమ్. ఇరవై రూపాయలు"

"అది నాకు చాలదులే" అన్నాడు ఏ. ఎన్.

"అంటే..."

"నా స్టేక్ పెద్దది"

"అలాగాండి"

"అవును. సూట్ కేస్‌తో వెళ్తే పదిరోజులు ఇంటికొచ్చే పనుండదు. ముక్కలు పదేపదే చూడటం, చేత్తో పట్టుకు ఆడటం మన పద్ధతి కాదు"

"అంటే..."

"పదమూడు ముక్కలు కిందపరచి ఒక్కోటి తీసి డిస్కార్డ్ చేయటమే"

"అట్టయితే వద్దులెండి. పదండి పోదాం" అన్నాడు సూరి.



"అగ్రజా నేను కొద్దిరోజులు భాగ్యనగరం వెళ్ళి రావాలనుకుంటున్నాను" అన్నాడు ఏ. ఎన్.

"ఎందుకు? "

"చాలా పనులున్నాయి. వచ్చాక అన్ని విషయాలూ చెబుతాను. ముందుగా ఒక్క విషయం మాత్రం ఖచ్చితంగా చెప్పగలను. మన జీవితాల్లో పెనుమార్పులు రాబోతున్నాయి"

"నిజమేనా. నాకు నమ్మశక్యంగా లేదు"

"అలానే అనుకోండి. ఊహించనివి ఎదురైతేనే కదా ఆనందం"

"మీరు వెళ్లటం మాకు ఇబ్బందిగా అనిపిస్తోంది. ఈ కొద్ది దినములలోనే మీరు మాకు అత్యంత ఆత్మీయులైనారు"

"అగ్రజా మనబంధం దృఢమైనది. కొన్ని అర్జంట్ పనుల నిమిత్తం నేను వెళ్లితీరాలి. త్వరలోనే వస్తాను"

"అలాగే ఎదురుచూస్తుంటాం" అన్నాడు భూషణం.

సూట్ కేసు అక్కడ వదిలి బ్యాగ్ మాత్రం తీసుకుని వచ్చాడు.

"ఏంటి బాబూ వుంటానని ఎల్లిపోతున్నారు" అంటూ వచ్చాడు సూరి

"మళ్ళీ వస్తాను"

"అంటే క్లబ్బుకేనా? నాక్కూడా వచ్చి మీ ఆట చూడాలనుంది గానీండి... డబ్బులకిబ్బంది. పంటకోసం చూస్తన్నా"

"మంచిది. నేను క్లబ్బుకి వెళ్లటంలేదు"

"అలాగండయ్యా త్వరగా వచ్చేయండి" అని చేతులు నలుపుకుంటుంటే ఓ పదిరూపాయలిచ్చాడు.

"ఎందుకండి. పేకాటలో తగలెయ్యటమేగా. మన్ది రైజింగ్ హాండ్‌కాదు"

"పోనీ. దానిగురించి ఆలోచనెందుకు? "

బస్సు వచ్చింది. ఎక్కి కూర్చున్నాక అన్నాడు సూరి.

"మీతోగాని తప్పులు మాటాడుంటే మనసులో ఎట్టుకోకండి. బోసడిగాడు... అదే మీ భోషాణంగారంటే మాసెడ్డ చిరాకులో..."

"భోషాణం కాదు భూషణం"

"భూషణమో... భోషాణమో ఆడికీ, దానికీ తేడా ఏంవుందండి. ఇంకా భోషాణంలో ఏదన్నా దాపెట్టుకోవచ్చుండి. ఈడ్నేం చేసుకుందావండి"

"అలా అనకు అతను మా అగ్రజులు"

"కావచ్చునండి. కానీ..."

"ఏమో. రేపు ఆయన మీ ఊరికి గొప్ప కీర్తి తేవచ్చుకదా"

"తేవచ్చుండి. అప్పుకీర్తి. అదే అపకీర్తండి"

బస్ హారన్ మోగింది.

"మీరొచ్చేదెప్పుడండి. నేను ఇక్కడేవుంటా" అన్నాడు సూరి.

బస్సు ముందుకు కదిలింది.

★ ★ ★

పత్రికాఫీస్‌ముందు ఆటో ఆగింది.

ఏ.ఎన్ అందులోనుండి దిగాడు. ఓసారి ఆ బిల్డింగ్‌కేసి చూశాడు.

సెక్యూరిటీ ఆఫీసువారు "ఎవరు కావాలని" అడిగారు.

"'డైలీ' సెక్షన్ ఇన్‌ఛార్జి కావాలి"

"ఆయన లేరనుకుంటాను" అని ఫోన్‌చేసి కనుక్కున్నాడు.

"ఈపూట ఇంక రారు"

"పోనీ వీక్లీ ఎడిటర్ వున్నారా?"

"ఉన్నారనుకుంటా"

"వారిని కలవాలి"

"మీ పేరు చెప్పండి"

అతను రాసిచ్చిన స్లిప్ అందుకుని "ఎన్నో ఫ్లోర్" అనడిగి, బయలుదేరాడు. ఎడిటర్ దగ్గరికి వెళ్లేసరికి ఆయన ఏవో బొమ్మలు చూస్తున్నాడు.

"నమస్కారం" ఏ.ఎస్.

"కూర్చోండి... మీరూ..."

"నన్ను ఏ.ఎన్. అంటారు నా ప్రొఫెషన్..."

"రైటింగా? ఏమైనా నవల రాయాలనుకుంటున్నారా? సబ్జెక్ట్ గురించి డిస్కస్ చేయటానికా?"

"నవల గురించైనా కాకపోయినా, మీకో మంచి సీరియల్ ఆర్టికల్ ఇవ్వగలననుకుంటున్నాను"

"వెరీగుడ్"

"డైలీ సెక్షన్ ఇన్‌ఛార్జ్ లేరన్నారు"

"ఆయనెందుకు?"

"మన ముగ్గురం కలసి ఓ విషయాన్ని చర్చించాలి"

"ఏమిటో చెప్పండి"

"ఇలా కాదు. మీకెప్పుడు కుదురుతుంది?"

"ఆఫ్టర్ ఫైవ్"

"ఈలోగా ఆయన దొరుకుతారా?"

"అతనికి పేజర్ వుండాలి. ట్రై చేస్తాను" అని వెంటనే ఈ కింది నెంబర్‌ని కాంటాక్ట్ చేయమని నెంబర్ ఇచ్చాడు ఎడిటర్.

"మంచి ప్లేస్ చెప్పండి"

"అంటే..."

"సరదాగా మాట్లాడుకుంటూ డిస్కస్ చేయాలి. ఏ రెస్టారెంట్‌లోనో కూర్చుందాం. అందులో ఓపెన్ ఎయిర్‌లో బాగుంటుంది"

"ఓ.కే. నాకు మీరు ఓ గంట తర్వాత ఫోన్ చేస్తే ఎక్కడ కలుసుకోవచ్చో చెబుతాను"

"అలాగే... వారిని కూడా తీసుకురాగలి





గితే బాగుంటుంది"

"అలాగే"

"నైస్ మీటింగ్ యూ" అని చేయి కలిపి బయటకు వచ్చేశాడు.

గంట తర్వాత ఫోన్ చేశాడు.

ఎడిటర్ ఎక్కడ కలుసుకోవాలో చెప్పాడు.

"ఇద్దరం వస్తున్నాం" అన్నాడు ఫోన్ పెట్టేస్తూ.

ఏడు గంటల ముప్పై నిముషాలకు రెస్టారెంట్‌లో వాళ్ళిద్దరూ నిలబడ్డారు. అయిదు నిముషాలైంది.

"ఇంతకీ వస్తాడంటావా" అన్నాడు ఇన్‌ఛార్జి.

"తప్పకుండా వస్తాడు"

"పేరేంటన్నావ్"

"ఏ. యన్ అన్నాడనుకుంటా"

"అక్కినేని నాగేశ్వర్రావా"

ఇద్దరూ నవ్వుకున్నారు. "అంతగా రాలేదనుకో. మనం ఓ హాఫ్ తీసుకొని వెళ్దాం. ఏదో సీరియస్ ఆర్టికల్ అన్నాడు. వీక్లీని పిలిస్తే, డైలీ ఎందుకో నాకు అర్థంకాలేదు. నిజంగా అంత సీరియస్ ఆర్టికలా? "

"ఏమో ముందురానీ"

ఆ మాటలంటుండగా వచ్చేశాడు ఎ.ఎన్.

"సారీ సార్... ఆలస్యం అయింది"

"ఇట్సాల్‌రైట్. మేం వచ్చింది ఇంతకు ముందే"

"పదండి" అని లోపలకు నడిచి, ఓ టేబుల్ రిజర్వ్‌చేసుకున్నారు. అందరూ కూర్చున్నాక అడిగాడు.

"ఫీల్ ఫ్రీ... నేను మీ స్నేహితుడ్ని. మీకు ఏం కావాలన్నా నిర్మొహమాటంగా చెప్పండి. డ్రింక్స్ ఏం చెబుదాం. బ్రాందీ, విస్కీ, ఆర్ బీర్" అన్నాడు ఎ.ఎన్.

"విస్కీ" అన్నారు.

బేరర్ వచ్చి గ్లాసులుంచి వెళ్ళాడు.

ఎ.ఎన్. 'స్టివర్డ్'కి ఏ బ్రాండ్ కావాలో చెప్పి, 'చికెన్' ఐటమ్స్ చెప్పి, గోల్డ్ ఫ్లేక్ సిగరెట్ పెట్టె తెచ్చిపెట్టమన్నాడు. అవి వచ్చేలోపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు.

"రీడర్‌షిప్ తగ్గుతోందంటున్నారు. నిజమేనా? " అన్నాడు.

"నిజమేనండి. టోటల్‌గా ప్రపంచం మొత్తం ఇదే పరిస్థితి" అన్నారు.

"ఎప్పటి వార్తలు అప్పుడు కళ్ళముందు కనిపిస్తున్నాయి వెయిట్ చేయాల్సిన అవసరం లేదు కదా"

"అయినా కూడా ప్రింట్ మీడియా శక్తివంతమైంది"

"నిజమే. కానీ ఏదో గిమ్మిక్ చేయాలి లేకపోతే సర్క్యులేషన్ డ్రాపవుతుంది"

"పత్రిక ధర తగ్గించండి"

"అది సెకండరీ. నువ్వు ఫ్రీగా ఇస్తానన్నా మెటీరియల్ లేకపోతే తీసుకోరు. ప్లాస్టిక్ బ్యాగ్స్ వచ్చాక పాత పేపర్ ధర పడిపోయింది" అన్నారు.

ముగ్గురూ నవ్వుతుండగా డ్రింక్స్ వచ్చాయి.

బేరర్ గ్లాసుల్లోకి సుతారంగా వొంపాడు.

"ఛీర్స్" చెప్పుకున్నాక మరి కొంచెంసేపు పత్రికల ధరలమీద చర్చ నడిచింది.

పెద్దపెద్ద పత్రికలు ప్రకటనల కోసం అనుసరిస్తున్న పద్ధతులమీద మాట్లాడుకున్నారు.

"ఏదిఏమైనా మనం విదేశ పత్రికలనుండి నేర్చుకోవలసింది చాలా వుంది. ఆర్టికల్స్ కోసం మనం ఇతర పత్రికల మీద ఆధారపడతాం. వాటిని యాజిటీజ్‌గానో అటూ ఇటూ మార్చో మన పత్రికల్లో ప్రచురిస్తుంటాం. మన ఆంధ్రదేశంలో ప్రత్యేకమైన

విషయాలే లేవా? " అన్నాడు ఏ.ఎన్.

"ఎందుకుండవు" అన్నారు.

"మీలాంటి యంగ్ జనరేషన్ పాలిటిక్స్ మీద కూర్చుంటే చాలదు. అవి రొటీన్. రోజూ వుండేవే. వి హావ్‌టు కాన్‌సన్‌ట్రేట్ ఆన్ కల్చర్. మన ఇంటీరియర్‌లో చాలా అద్భుతాలున్నాయి. సో సిటీ డెస్క్‌లనుండి వాటిని కవర్ చేయటానికి ముందుకు రావాలి. ఆ రిపోర్టర్స్ ఎందాకానైనా వెళ్ళగ లుగుతున్నారు. ప్రాణాల్నిసైతం లెక్కచేయ టంలేదు. ఇంత ఉపోద్ఘాతం మీలాంటి సీని యర్స్‌కి అవసరం లేదనుకోండి. అయినా ప్రారంభానికిముందు చిన్న అధ్యక్ష ఉప న్యాసం" అన్నాడు ఏ.ఎన్.

ఇద్దరూ నవ్వారు.

"ఈ ఆంధ్రదేశంలోనే 'రామాపురం' అనే ఓ ఊరుంది. అందులో భూషణం అనే ఓ వ్యక్తి వున్నాడు. అది పెద్ద విశేషం కాదు. వాళ్ళకి పాతకాలం జమీందారుల కుండే పెద్ద ఇల్లుంది. దాంట్లో ఓ భోషాణం వుంది"

ఇంత పెద్ద బిల్డప్ ఇచ్చి ఆఖరికి 'భోషాణం' వుందనేసరికి ఆ ఇద్దరూ పెద్ద అటెంక్షన్ 'పే' చెయ్యలేదు.

"'భోషాణాలు' చాలామంది ఇళ్లల్లో వుంటాయి. అయితే భూషణంగారి భోషాణం వేరు. దానికో చరిత్ర వుంది" అన్నాడు ఎ.ఎన్.

అప్పటికీ వారు మాట్లాడలేదు.

"దాని వయసు తెలుసుకోవాలంటే మనకు సాధ్యం కాదు. మధ్యయుగాల నాటిదై వుంటుందని నా ప్రాథమిక అంచనా"

అప్పుడు వారిద్దరిలోనూ కదలిక ఆరంభం అయింది.

"మధ్యయుగాలనాటిదా!"

"అవును... ఇంకా పాతదైనా ఆశ్చర్యపోన వసరంలేదు. ఆ భోషాణాన్ని చూస్తే మీరు ఆశ్చర్యపోతారు. మామూలుగా రోజూ చూసే భోషాణం కాదు. వాటికీ వీటికీ పోలికే లేదు"

"భూషణం గారేంచేస్తున్నారు"

"ప్రస్తుతం ఆయన తీవ్రమైన ఆర్థిక ఇబ్బందుల్లో వున్నారు. అదే విదేశాల్లో అయితే భూషణంగారినీ, ఆ భోషాణాన్నీ జాతి సంపదగా చూసుకునేవారు" అన్నాడు ఏ.ఎన్.

అందుకు ఇద్దరూ ఆమోదించారు.

"మీ ఇద్దరినీ ఇప్పుడు పిలవటంలో నాది ఒకటే ఉద్దేశం. మీ మేగజైన్స్ నాకిష్టం. రెండోది కొత్త విషయాల్ని ప్రెజెంట్ చేయా లన్న తపన మీలో వుంది. కేవలం సంచ లనం కలిగించేవేకాక ట్రెడిషనల్ రూట్స్ లోకి వెళ్ళటానికి మీరు ప్రయత్నం చేస్తు న్నారు. అందుకని ఈ విశేషాన్ని ముందుగా మీరు కవర్‌చెయ్యాలి. ఇదీ నా కోరిక"

"బాగుంది" అన్నారిద్దరూ.

వెయిటర్ వచ్చాడు. ఏ.ఎన్. ఫుడ్ ఆర్డరి చ్చాడు.

"ఎలా చేస్తే బాగుంటుందో మీకేవన్నా ఐడియా వుంటే చెప్పండి"అన్నాడు వీక్లీ ఎడి టర్.

"నేను ఇలా చేస్తే బాగుంటుందని నా సజెషన్ మాత్రమే చెబుతాను. బాగా ప్రెజెంట్ చేయాల్సింది మీరే"

"అది నాకు వదిలేయండి"

"రెండు రకాలుగా ప్రెజెంట్ చేయగలిగితే బాగుంటుంది. దినపత్రికల్లో ఓ రకంగా, వీక్లీలో అయితే మరోరకంగా. ముందు దీనిని ఓ వార్తగా ప్రకటించాలి. వీక్లీలో దీని చరిత్రని చెప్పాలి. మార్కెట్లోకి వీక్లీ తరు వాత సంచిక వస్తుందనగా డైలీలో రావాలి. జస్ట్ నాలుగు రోజుల గ్యాప్ లేకపోతే మిగి





లిన పత్రికలు ప్రచురించే అవకాశం వుంది''

"నిజమే" అన్నాడు ఇన్‌ఛార్జి.

"చరిత్రంటే ఎలా చెప్పాలని"

"నేను రాయమంటోంది ఆ పర్టిక్యులర్ భోషాణాన్ని గురించి కాదు. అసలు 'భోషాణం' ఎప్పుడు పుట్టింది? ఎలా పుట్టింది? అది మన ఇండియన్ శైలా? దిగుమతి చేసుకున్నదా? తర్వాత అదెలా మారింది? నేటి 'భోషాణం' ఏ రూపంలో మార్పు చెందింది? ఇవన్నీ మామూలు ప్రశ్నలు కావు. జోల్డంత చరిత్ర వున్న సంగతులు స్టడీ చేయాల్సినవి"

వీక్లీ ఎడిటర్‌కి మందు పని చేయటం మొదలైంది.

"నీయమ్మ ఆఖరికి భోషాణానికి కూడా చరిత్ర. మేం చిన్నప్పటినుండీ బొంగూ భోషాణం అని తిట్టుకుంటుండే వాళ్ళం. ఒకప్పుడు ఆడపిల్లల్ని పెళ్ళిచేసి పంపిస్తూ కంపల్సరీగా భోషాణం పంపించేవారు. ఒక్కో భోషాణం గురించి తగాదాలు... కొట్లాటలు... అబ్బ అప్పట్లో మా బంధువులింట్లో అన్నీ వాటిల్లోనే దాచేవారు" అన్నాడు.

ఇన్‌ఛార్జ్‌కి కూడా అలాంటి జ్ఞాపకమే వుంది.

"అవునండి. వాటిని చాలామంది చెడగొట్టి ఇతర వస్తువులు చేయించుకున్నారు. ఆ కాలం కలప రావాలంటే ఇప్పుడు ఎలా వస్తుంది? "

"అది సార్ విషయం భోషాణం నుండి నేటి 'దివాన్'దాకా వాటి పరిణామ క్రమం ఎలా జరిగింది... ఇవన్నీ సేకరించి ఆర్టికల్‌గా ప్రచురించారనుకోండి. ఎంత బాగుంటుందో ఆలోచించండి"

"డెఫినెట్‌గా బాగుంటుంది" అన్నారు.

"అది సార్ విషయం. మీరు "రామాపురం" ఎప్పుడు వస్తారో మీ యిష్టం. నేను అక్కడ అన్ని ఏర్పాట్లూ చేసి తయారుగా వుంటాను. మంచి ఫొటోగ్రాఫర్ కావాలి. ఆ ఫొటోస్ చాలా బాగా రావాలి. ఈ ఆర్టికల్ చూసి ఇంగ్లీష్ మేగజైన్స్‌వారు కూడా లిఫ్ట్ చేసేవిధంగా వుండాలి"

"నాకైతే ఇంకో ఆలోచన వుంది. ఇదేదో మంచి సబ్జెక్ట్ అయ్యేలా వుంది. ఇంత పరిశోధన చేసేటప్పుడు కేవలం ఆర్టికల్‌గా వాడుకునేకంటే ఓ నవల రాయిస్తే బాగుంటుందా? "

"నవలా... బాగానే వుంటుంది"

"అవునండీ... దాని చుట్టూ థ్రిల్స్... ఆ భోషాణం ఎన్ని వందల సంవత్సరాలక్రితం రూపుదిద్దుకుంది. ఎవరెవరి చేతులు మారింది. దాని వెనక సెంటిమెంట్లు. ఇలా రాయించుకుంటూ ఇందాక మీరు చెప్పినట్లు "భోషాణం నిన్న- నేడు- రేపు" అనే ఆర్టికల్స్ ప్రచురిస్తాం" అన్నాడు వీక్లీ ఎడిటర్.

"అయితే రెండు విషయాలు. నవల థ్రిల్లర్‌గా అయితే బాగుంటుంది. రెండోది నవలని వెంటనే స్టార్ట్ చేయాలి. ఎక్కువ రోజులయితే 'టెంపో' పోతుంది. అయిపోయే సీరియల్స్ ఏవన్నా వున్నాయా? "

"ఒకటుంది. ఆ ప్రాబ్లమ్ ఏమీ లేదు. అంతగా అయితే మిగతా సీరియల్స్‌కి ఒక్కో పేజీ తగ్గిస్తాం. నా ప్రాబ్లమ్ నవల ఎవరితో రాయిస్తే బాగుంటుందా? అని"

"అంటే..."

"సీనియర్ రైటరా? ఫ్రెష్‌రైటరా? సీనియర్ రైటరయితే ఒక అడ్వాంటేజ్ వుంది. మనం మనకేం కావాలో చెబితే రాసుకుని వచ్చేస్తాడు. అయితే అతను కాజువల్‌గా రాస్తాడు తప్పించి ఫీల్ అయి రాయడు. కొత్త రైటరంటే మనకి ఎక్కువ పని. కాకపోతే లైఫ్ అండ్ డెత్ ప్రాబ్లమ్ కాబట్టి సిన్సియర్‌గా రాయటానికి ప్రయత్నం చేస్తాడు"

"అలానే చెయ్యండి. ఎటూ మీరు కష్టప డాల్సిందే. తప్పదు కదా కాకపోతే 'జెమ్' లాంటి కుర్రాడ్ని చూడండి"

"ఆ విషయం కూడా ఆలోచిస్తున్నా. రచయితా? రచయిత్రా? " అన్నాడు ఎడిటర్.

"అంటే రచయిత అయితే ఎక్కడెక్కడికో తిరిగి రమ్మన్నా సమస్య వుండదు. అదే రచయిత్రయితే ప్రాబ్లమ్. ఎవరన్నా ఉత్సాహపడితే మీ ఇష్టం" అన్నాడు ఇన్‌ఛార్జ్.

"సరే. ఆ విషయం తర్వాత డిసైడ్ చేద్దాం. అసలు రచయిత పేరు ప్రకటించకుండా మొదలుపెడదాం. అంతగా అయితే అయిదారు చాప్టర్లు చేసి తలొకరిచేత రాయిద్దాం. అదెలా అనేది వర్కవుట్ చేద్దాం. ముందు మనం రామాపురం ఎప్పుడు వెళ్లేది ఫిక్స్ చేసుకుంటే బాగుంటుంది"

"అదే... ఆలస్యం మంచిదికాదు. కాకపోతే నాకు రావటానికి కుదురుతుందా ఇంకెవరినన్నా పంపించాల్సుంటుందా అని ఆలోచిస్తున్నా" అన్నాడు ఇన్‌ఛార్జి.

"ఎవర్ని పంపించినా ముందు విషయం లీక్‌కాకుండా వుండాలి"

"ఓ. కే. మీరు ఎప్పటిదాకా వుంటున్నారు? "

"రెండురోజులుంటాను"

"రేపు సాయంకాలం ఫోన్‌చేస్తే మీకు ఎప్పుడొచ్చేది కన్‌ఫర్మ్ చేస్తాను"

"అలాగే"

"నైస్ మీటింగ్ యూ" అన్నారు ఇద్దరూ ఒకేసారి.

★ ★ ★

ఏ.ఎన్. క్లాత్ ఎంపోరియమ్‌కి వెళ్ళాడు. ఆ తర్వాత రెడీమెడ్ షాపుకి వెళ్ళాడు. 'ఖాదీ' భండార్‌కి వెళ్ళాడు. తనకు కావలసిన బట్టలన్నీ కొన్నాడు.

డిపార్ట్‌మెంటల్ స్టోర్‌కి వెళ్ళి బిస్కట్స్, బ్రెడ్, బట్టర్‌లాంటివి తీసుకున్నాడు. కొన్ని పెర్‌ఫ్యూమ్స్ సెలక్ట్ చేసుకున్నాడు.

షాపింగ్ అంతా పూర్తయ్యాక 'వీడియో కవరేజి' వాళ్ళ దగ్గరకు వెళ్ళి మాట్లాడాడు. వాళ్ళు ఏక్షణం కావాలంటే ఆ క్షణం బయలుదేరి రాగలమని చెప్పారు.

అప్పుడు ఓ బుక్‌షాప్‌కి వెళ్ళి, అందులో బుక్స్ పరిశీలించటం మొదలుపెట్టాడు.

అన్నీ రకరకాల ఆంగ్లపుస్తకాలు. చాలా ఖరీదు గలవి. కొన్ని బుక్స్‌ని తదేకంగా చదువుతూ నిలబడ్డాడు. అలా ఇంకో గంట సమయం గడిచాకా బయటికొస్తుండగా కొంతమంది తమ పిల్లల ఫొటోస్‌ని టీషర్టులమీద ప్రింట్‌చేయించుకోవటం చూసి అటు వెళ్ళాడు.

అక్కడ రకరకాల బొమ్మలున్నాయి. వాటి తలను కంప్యూటర్ ద్వారా తొలగించి, అక్కడ పిల్లల తలలు వచ్చేలా చేస్తున్నారు.

అలా చూస్తుంటే 'భూషణం' చిత్రించిన 'అఖిల' గుర్తొచ్చింది. ముఖ భాగమంతా ఖాళీగా వుంచాడు. అందులో ఏ అందమైన ఆడపిల్లయినా వొదిగిపోతుంది. అతనికలా చూస్తుంటే కొత్త ఆలోచనలు స్ఫురిస్తున్నాయి.

సైన్స్ చాలా ముందుకు వెళ్ళింది. వాటిని వూహించటానికే అసాధ్యంగా వుంది. ప్రతి క్షణమూ ప్రపంచంలో ఏదో మూల కొత్తదేదో ఆవిష్కరించ బడుతూనే వుంది. వాటిని ఉపయోగించుకోవడం చేతకావాలి" అనుకున్నాడు.

సాయంకాలం పత్రిక ఆఫీస్‌కి ఫోన్ చేశాడు. ఇద్దరూ వున్నారు. డేట్ కన్‌ఫర్మ్ చేశారు. ఏ.ఎన్. ఆ ఊరికి రావటం ఎలానో చెప్పాడు. అంతా నోట్ చేసుకున్నారు. మొత్తం ముగ్గురు మనుషులు వస్తున్నట్లు చెప్పారు.




"ఫొటోగ్రాఫర్ని తీసుకువస్తున్నారా? "

"అరే మర్చిపోయాం"

"అతను చాలా ఇంపార్టెంట్ మర్చిపోకుండా తీసుకురండి" అన్నాడు.

"అలాగే" అన్నారు.

"నేను కూడా మీతోపాటు వచ్చేవాడ్నే. అక్కడ మీకెలాంటి ఇబ్బంది కలగకుండా ఏర్పాట్లు చేయాలి కదా. అందుకని వెళ్తున్నాను"

"అలాగే... మనందరం అక్కడ కలుసుకుందాం"

"రెండురోజులు వుండేలా రాగలిగితే ఇంకా చాలా బాగుంటుంది"

"తప్పకుండా" అన్నారు.

★ ★ ★

'ఏ.ఎన్' రామాపురం బస్సెక్కాడు. కిటికీ దగ్గర కూర్చుని ఆలోచిస్తున్నాడు. అతన్ని చూస్తుంటే ఈ వ్యక్తి ఖచ్చితంగా ఏదో సంచలనం సృష్టించి తీరతాడు అనిపించేలా వున్నాడు. అతని మనసులో ఏదో పథకం రూపుదిద్దుకుంటోంది. అలా ఆలోచిస్తూనే నిద్రపోయాడు.

బస్ దిగేసరికి 'సూరి' కాచుకునే వున్నాడు.

"అదిట్లా ఇవ్వండి నేను తీసుకొస్తా"నని పాకెట్లు అందుకున్నాడు.

"మనకి అతిథులొస్తున్నారు సూరి"

"ఎంతమందండి"

"నలుగురైదుగురు దాకా వుంటారు"

"ఎప్పుడండి"

"నాలుగు రోజుల్లో... ఏంచేద్దామంటావ్"

"దేని గురించి అడుగుతున్నారు"

"వాళ్ళకి భోజనాలవీ కావాలి. ముందు ఆ దొడ్డంతా భయంకరంగా వుంది. ఇల్లు కూడా బూజు పట్టిపోయింది. నలుగురైదుగురు రెండురోజులపాటు శ్రమపడితేగాని ఓ షేప్‌కి రాదు"

సూరి మాట్లాడలేదు.

"ఏమిటీ బోసడీగాడి దగ్గరికి మనం వచ్చేదేంటని ఆలోచిస్తున్నావా... మీ ఊరికి గొప్ప పేరు తెచ్చిపెడతాడయ్యా బాబూ"

"అది కాదండి. లోపలకి రావాలంటే ఆలోచిస్తున్నానండి"

"దెయ్యాలుంటాయనా? "

"అబ్బే అదేం కాదండి. ఇప్పటిదాకా తెగ తిట్టేసేం కదండి. నేనయితే ఇంకా రెచ్చిపోయేవాడ్నండి. మరి ఆరి ముఖం చూడాలంటే సిగ్గుగా వుందండి"

"అలాంటివేం పెట్టుకోవద్దు. నేనున్నా కదా రేపు సాయంకాలంకల్లా నలుగురు మనుషుల్తో ఆ ఇంటిని శుభ్రం చేయించాలి. కుదురుతుందా? "

"ఎంత మాటండి. చూసుకోండి మన తడాఖా"

"ఇంకో పని చేయించాలయ్యా"

ఏంటండి అది"

"భూషణంగారికి తలంటించాలి"

"ముందోరోజు నానేస్తేగాని ఆ జిడ్డు వదలదండి. తలమాసిన రకం కదండి" అన్నాడు.

"నువ్వట్లా మాట్లాడగూడదయ్యా... రేపు పెద్దపెద్ద వాళ్ళు వస్తున్నారు. వాళ్ళందరి ముందూ ఇలానే మాట్లాడతావా? "

"అలవాటయిపోయిన నోరుకదండి. ఇంకెందుకు ఆ పనులన్నీ నాకు వదిలేయండి. మనుషుల్ని తీసుకొస్తా. అయ్యాగారికి నేను తలంటుతా... వీపు రుద్దుతా ఆ తర్వాత నిగనిగలాడకపోతే చూడండి"

"మరి వంటల సంగతేంటి... బాగా వండేవాళ్ళు దొరుకుతారా అని ఆలోచిస్తున్నా"

"ఏం వంటలు కావాలేటండి... కోళ్ళు

తెగాలా"

"అవును... అందులోనూ సిటీనుంచి వస్తున్నారు"

"వందమంది రానీండి. మన కోడికూర తింటే మనని మర్చిపోరండి"

"అంతేనంటావా? "

"ఈలోపు ఓ కోడిని వండుకు తీసుకొస్తా చూడండి మరి" అన్నాడు.

భూషణంగారిల్లు వచ్చేసింది. తలుపు తీసుకుని లోపలకు వెళ్ళాడు. ఏ.ఎన్.ని చూడగానే భూషణం కళ్ళు మెరిశాయి. అంతలోనే వెనకాల 'సూరి'ని చూసి గంభీరంగా మారిపోయాడు.

"దండాలండి భూషణం దొరగారూ"

భూషణం గంభీరంగా తలూపాడు.

"ఈ పాకెట్లు ఎక్కడ పెట్టమంటారండి"

"రా... లోపల పెడుదువుగానీ అగ్రజా ఇప్పుడే వస్తా" అని సూరిని తన గదికి తీసుకుపోయి వాటిని సర్దించి ఓ ఏభై కాగితం యిచ్చాడు.

"రేపు మనుషుల్ని తీసుకురా డబ్బులిద్దాం"

"మనుషుల్నేంటండి. రాత్రికి కోడికూర తిని ఎట్టుందో చెప్పాలి. చిన్నదొరగారూ నన్నోకంటితో చూసుకోవాలి మీరు" అన్నాడు.

ఇద్దరూ బయటకొచ్చాక "బాబూగారూ ఉదయమే వచ్చేత్తానండి" అని చెప్పి వెళ్ళాడు.

"ఉదయమే వస్తానంటున్నాడు ఎందుకు? " అనడిగాడు.

"చిన్న పని చెప్పాను"

"సోదరా...మీరు లేకపోవటంతో మాకు చాలా విసుగ్గా అనిపించింది. అందులోనూ గాయం చేసి మరీ వెళ్ళారు కదా"

"నేనా? "

"అదే సోదరా... అఖిలను గుర్తుచేసి వెళ్ళారు. ఎందుకో ఆమె గుర్తుకు వచ్చుచున్నది. నేను చనిపోవు లోపల ఆమెను ఒక్కసారైనా చూడగలనా? " అన్నాడు దిగులుగా.

"అగ్రజా. మీరెందుకంత నిరాశపడుతున్నారో నాకు తెలియదు. మీరేమిటి. మీ వంశమేమిటి. ఆఫ్టాల్ ఓ ఆడపిల్ల విషయంలో ఇంత బేలతనమా? ఏమో ఎవరు చూడొచ్చారు 'అఖిలాదేవి' మిమ్మల్ని వెతుక్కుంటూ రావచ్చునేమో"

"నిజంగానా" అన్నాడు భూషణం అంతలోనే.

"మావంశ చరిత్ర పరిశీలించిన మా తాతముత్తాతలందరూ తమ జీవిత చరమాంకమున స్త్రీల విషయములోనే బలహీనతకు గురయినారు. అది ఏమి ఖర్మమోగాని అది మాకు యుక్తవయసునందే దాపురించినది. అంతేకాదు, కోరిన స్త్రీని పొందుట మాత్రమే వారికి తెలిసిన విద్య. ఈ విషయములోనూ మేము దురదృష్టవంతులమే" అన్నాడు.

"ఎవ్విరి డాగ్ హేవిట్స్‌డే అన్నారు పెద్దలు. కొన్ని సంవత్సరాలు అజ్ఞాతంలో వున్నంత మాత్రమున పాండవులు ఎందుకూ పనికిరారని ఎవరైనా అనుకుని వుంటే ఎంత పొరపాటో, మీ విషయములోనూ అంతే. మీవల్ల జరగవలసిన కార్యమేదో వుండి వుంటుంది"

"ఇదివరకే చెప్పాం కదా. మాతోనే 'భూషణ' వంశ సమాధి" ఆ మాటలు అంటున్నప్పుడు భూషణంలో ఎలాంటి దిగులు కనిపించలేదు.

"కానున్నది కాక మానదు. మీ కోసం కొన్ని వస్తువులు తెచ్చాను. చూద్దురుగాని రండి" అన్నాడు.

ఇద్దరూ ఏ.ఎన్. గదికి వెళ్ళారు.





"ఇవి మీ బట్టలు... ఇవి మీ పాదరక్షలు... ఇవి మీ కేశసంపదను వృద్ధిచేసుకొనుటకు తైలములు. ఇవి స్నానానంతరం మీ శరీరంపై చల్లుకొను సుగంధ ద్రవ్యములు. వాటిని 'స్ప్రే'లంటారు. ఇవి కార్న్ ఫ్లేక్స్.. ఈ డబ్బాలలోనివి శీతల పానీయాలు. రండి, రుచి చూడండి" అన్నాడు.

భూషణం కళ్లలో నీళ్ళు తిరిగాయి.

"సోదరా మిమ్మల్ని భగవంతుడు మాకోసమే పంపించాడు. గతంలో తినటానికి రకరకాల తినుబండారాలుండేవి. తినటానికి ఆకలే వుండేది కాదు. ఇప్పుడు జిహ్వ కొత్త రుచులకోసం అల్లాడిపోతోంది. అయిననూ అవకాశాలు లేవు. కోరికలను జయించి జీవిస్తున్న మాకు తిరిగి ఈ రుచులను చూపిస్తున్నారు. ఈరోజు బాగానే వుంటుంది. రేపు బాగుండదేమో"

"అగ్రజా... అలాంటి ఫీలింగ్స్ రానీయొద్దు. మీకెందుకు నేను చెప్పినట్లు చేయండి. మిగతా కార్యక్రమం నేను చూసుకుంటాను కదా" అన్నాడు.

మరుసటి రోజు సూరి వచ్చాడు. పనివాళ్ళను తీసుకొచ్చాడు. సంస్కరణ కార్యక్రమాలు మొదలయ్యాయి. కంపలన్నీ నరికి పోగులుపెట్టి నిప్పుపెట్టారు. పొగసుడులు తిరుగూ పైకి వెళ్ళింది. ఒకటి రెండు పాముల్ని కొట్టేశారు. సాయంకాలం అయ్యేటప్పటికి ఆ ప్రాంతమంతా కొత్త అందాలు సంతరించుకొంది.

సూరి భూషణానికి నలుగుపెట్టాడు. ఆ తర్వాత తలంటాడు.

శుభ్రంగా తలంతా తుడిచి సాంబ్రాణి పొగపట్టాడు. భూషణానికి పడుకొని నిద్ర పోవాలనిపించింది. అదేమాట అంటే "ఆగండిబాబూ, భోంచేసి పడుకుందురుగాని' ' అని ఆ ఏర్పాట్లు చేశాడు.

ఏ.ఎన్.కి తన ప్లేట్లో కోడికూర వేయగానే నోటిలో లాలాజలం వూరింది. ఇదేదో బాగానే వుందనిపించింది. నోట్లో ముద్దపెట్టుకుంటే గొప్ప రుచి అనిపించింది. ముక్కలు వెన్నలా కరిగిపోతున్నాయా అనిపించింది. 'భూషణం' కూడా మహదానందంగా భోజనం చేసి, ఇంకా మేలుకొని వుండటం నావల్ల కాదని నిద్రపోయాడు.

"నువ్వేనా కోడికూర వండింది" అన్నాడు ఏ.ఎన్.

"అవును... బాగుందాండి"

"ఇంత టాలెంట్ పెట్టుకొని ఈ వూర్లో పోసుకోలు కబుర్లెందుకయ్యా"

"మరేం చెయ్యమంటారండి. పుట్టిన ఊరు విడిచిపెట్టి బయటకి వెళ్ళలేం కదండి"

"వెళ్ళకపోతే పైకెట్లావస్తారు. అది సరే కోడికూర మాత్రమేనా ఇంకేమైనా వండటం చేతవుతుందా? "

"అదేంటండి. వేట ఏపుడు, రొయ్యల పులుసూ, చేప ఫ్రై, పీతలు ఏదన్నా చేయగలనండి. ముఖ్యంగా చేపపులుసు అదిరిపోద్దండి. పెద్దచేపని తెచ్చి వండేస్తే మూడురోజులు తినొచ్చు"

"వెజిటేరియన్ ఐటమ్స్ చేతవుతాయా"

"ఎందుకు చేతకాదండి. వంకాయ మషాళా, వంకాయ గుత్తికూర, సాంబారు, అరటి కాయ వేపుడూ, పాలకూర పప్పు తిని చూడండి. వెజిటేరియన్ బాగుందంటారు"

"అంతేనా, ఇంకేమన్నానా? "

"స్వీట్లు మాత్రం రావేటండి. అన్నీ సూరిబాబు స్పెషలండి. ఉల్లిపాయ పకోడి ఏశాననుకోండి. రెండు కేజీలు లాగించేస్తారు. నోట్లోపెట్టుకుంటే వెన్నపూసలా కరిగిపోవాలి"

"నీ మాటలు వింటుంటేనే నోరూరిపోతోంది ఇవన్నీ ఎక్కడ నేర్చుకున్నావయ్యా స్వామి"



"అసలు మా పూర్వీకులంతా దివాణంలో వంటలు చేసేవారండి. అయ్యగారి హయాం వచ్చేటప్పటికి తలోదిక్కు అయ్యారు. ఇప్పుడు పెళ్ళిళ్లకి వంటలు చేసుకుంటున్నారు. కొంతమందయితే హోటళ్లకి వెళ్ళిపోయారండి"

"నీకు పెళ్ళయిందా?"

"అయిందిగాని..." అని ఆగాడు.

"ఏమిటో చెప్పు"

"పెళ్ళాం విడిచిపెట్టి వెళ్ళిపోయిందండి"

"ఎందుకయ్యా... ఏమన్నా అన్నావా?"

"అబ్బే అలాంటిదేం లేదండి. అయ్యగారు చదరంగం ఆడుకుంటే మనం పత్రాలాడతాం గదండి అందుకు"

"సిటీ రమ్మంటే వస్తావా?"

"ఏం చేయనండి"

"అదంతా తర్వాత చెబుతా. నాతోపాటు రాగలవా? లేదా?"

"వచ్చేత్తానండి. ఇక్కడుండి దమ్మిడీ సంపాదించేది లేదండి. మీ పుణ్యావా అని నాలుగురాళ్ళు సంపాదించుకుంటానేమో చూస్తాను"

"రేపు పొద్దున్నే ఇంకో పనిచేయాలి"

"చెప్పండి"

"భోషాణంలోకి వెళ్లి లోపల పూర్తిగా శుభ్రం చేయాలి"

"అదెంతపనండి" అన్నాడు.

"నువ్వుకూడా భోంచెయ్" అన్నాడు ఏ.ఎన్.

"ఒపని చేత్తానండి. అన్నం తిని ఇక్కడే పడుకుంటా"

"అలాగే చెయ్యి" అన్నాడు ఏ.ఎన్.

★ ★ ★

ఉదయమే మనుషులు వచ్చేశాకా అందరూ భోషాణం తలుపులు తీశారు.

"జాగ్రత్తర్రో... ఇందులో ఏముందో చూసుకుని దిగండి" అన్నాడు సూరి.

ముందు వాళ్ళూ వెనకాల తనూ దిగాడు. లోపలనుండి దుమ్ము.. రెక్కలపురుగులు, బొద్దింకలు, ఇంకేవేవో తీసి బయటపడేశారు. ఓ గంటకుపైగా దాన్ని శుభ్రం చేయటానికి శ్రమించారు. తర్వాత ఏ.ఎన్. కలరావుండలిచ్చి అందులో వెయ్యమన్నాడు. వేశాక అందరూ బయటికొచ్చారుగానీ, సూరి మాత్రం లోపల వుండిపోయాడు.

"నువ్వు బయటకురావా?"

"రావాలనిపించటం లేదండి. చల్లగా వుంది"

"అప్పుడు నిన్నుకూడా ఇందాక బయట పారేసినట్లే పారేయాల్సి వుంటుంది"

"పనిలోపని రంగులు వేసేద్దావేటండి" అన్నాడు.

"అవసరంలేదు. నువ్వు బయటికిరా" అన్నాడు ఏ.ఎన్.

ఆరోజంతా పనులు చేస్తూనే వున్నారు. రాత్రికి భూషణం, సూరి, ఏ.ఎన్. కూర్చున్నారు.

"అయ్యగారూ... కలోగంజో ఇంక మీ దగ్గరే వుండిపోతాను" అన్నాడు సూరి.

భూషణం ఏ.ఎన్.కేసి చూశాడు. ఏ.ఎన్. తలూపగానే భూషణం గంభీరంగా నవ్వాడు.

"రేపు మన మిత్రులు వస్తారు. వారికి ఏమేం చేస్తే బాగుంటుందో సూరిబాబు చూసుకుంటాడు వంటలన్నీ అదిరిపోవాలి" అన్నాడు.

"చూస్తారుగా నాపనితనం"

"మీరు మాత్రం నీట్‌గా డ్రెసప్ చేసుకొని కుర్చీలో కూర్చోవటమే" అన్నాడు భూష




ణాన్ని.



సూరి, ఏ.ఎన్. బస్‌కోసం నిరీక్షిస్తూ కూర్చున్నారు. అరగంట దాకా బస్సు రానే లేదు. ఎందుకు రాలేదా అనే అనుమానం వస్తోంది.

"ఇదంతా ఇక్కడ మామూలేనండి. మధ్యలో ఎక్కడో చెడిపోయుంటుంది. బాగుచేసుకుని తాపీగా వస్తాడు. మీకు విసుగ్గా వుంటే వెళ్లండి. నేను తీసుకొస్తాగా" అన్నాడు.

"నేనూ వుంటాను" అన్నాడు.

మరో పావుగంటకి బస్ వచ్చింది. మొత్తం అయిదుగురు దిగారు. ఏ.ఎన్.వారిని సాదరంగా ఆహ్వానించాడు.

"ఇతను రోహిత్. నా బెస్ట్ ఫ్రెండ్. ఫ్రీలాన్స్ జర్నలిస్ట్ ప్లస్ అద్భుతమైన ఫొటోగ్రాఫర్. 'ట్రెడిషన్' అనే క్వార్టర్లీ వస్తోంది. ఆ పత్రిక్కి అప్పుడప్పుడు ఆర్టికల్స్ రాస్తున్నారు" అంటూ పరిచయం చేశాడు ఎడిటర్.

"గ్లాడ్ టు మీట్ యూ" అన్నాడు ఏ.ఎన్. చేయందిస్తూ.

అతను ఆప్యాయంగా చేతిని నొక్కి వదిలేశాడు.

"అలాంటి పత్రిక ఉందని నాకు తెలియదు" అన్నాడు ఏ.ఎన్.

"ఓన్లీ ఫర్ మెంబర్స్. విదేశాలకు వెళ్తుంటుంది. అసలు ఆ పత్రిక ఓనర్‌గారి గురించి తెలుసా! ఇది అతని డ్రీమ్ ప్రాజెక్ట్. ఆయనే పబ్లిషర్, ఎడిటర్, ప్రూఫ్ రీడర్ అన్నీ" ఆనందంగా చెబుతున్నాడు వీక్లీ ఎడిటర్.

"నడుస్తూ మాట్లాడుకుందాం" అన్నాడు ఏ.ఎన్.

డైలీ ఇన్‌ఛార్జ్, ఓ రచయిత, ఫొటోగ్రాఫర్, రోహిత్, నడుస్తున్నారో పక్క "అన్నట్లు అందర్నీ పరిచయం చేయలేదుగా. ఈయన రచయిత సూర్యం"

"నైస్ మీటింగ్ యూ"

"మీగురించి ఎడిటర్ చెప్పారు. మిమ్మల్ని కలవటం చాలా ఆనందంగా ఫీలౌతున్నాను"

"నవల్స్ రాస్తారా... కథలా? "

"ఎప్పుడన్నా కథలు... రెగ్యులర్‌గా నవలలు. నేను కొంచెం 'స్లో' రైటర్ని. సంవత్సరానికి రెండు నవలలు కంటే రాయలేను"

" 'స్లో' మాత్రమే కాదు. ఇన్వెస్టిగేటివ్ రైటర్ ఆల్సో. ఈ విషయం చెప్పగానే ఎగిరిగంతేశాడు. అతను విజయ్ ఫొటోగ్రాఫర్" అని పరిచయం చేశాడు.

"ఇంతకూ 'రోహిత్'ని తీసుకురావటానికి ముఖ్యమైన కారణం 'ట్రెడిషన్'లో ఈ ఆర్టికల్ వస్తే మొత్తం దేశంలోనూ, ఎబ్రాడ్‌లోనూ ఆర్ట్ లవర్స్ చూస్తారు. పర్పస్ నెరవేరుతుంది. అంతకంటే ముఖ్యంగా నాకు అతని ఫొటోలు కావాలి" పక్కకి తీసుకువెళ్ళి చెప్పాడు ఎడిటర్.

"దాందేముంది. మీ ఇష్టం"

"అంటే విజయ్ బాగా తీయడని కాదు. అతను ఇంకా చాలా డెవలప్ కావాలి. అదో కారణం అయితే రోహిత్ దగ్గర కెమెరా చాలా కాస్లీది. ఎవ్విరి మైన్యూట్ డిటైల్స్ అందులో వస్తాయి. ఇంకోటేమిటంటే రేప యినా పత్రికల్లో ఈ వార్త వస్తుంది. మన వాడంటూ ఇది ప్రెజంట్ చేస్తే బాగుం టుంది కదాని తీసుకొచ్చాను"

"చాలామంచి పనిచేశారు. ఇంకా పది మంది వచ్చినా మనకు ఎలాంటి ఇబ్బంది లేదు. అతను 'సూరి' అని మా ఫ్రెండ్. అలా కనిపిస్తున్నాడు గానీ ఏ వైట్‌హౌస్‌లో 'చెఫ్'గానో వుండాల్సిన వాడు"

"నిజమా..."

"భోజనాలు ఎలా వుంటాయో చూస్తా రుగా. ఇతనికి కొంత ట్రైనింగ్ ఇప్పిద్దామను కుంటున్నాను"

"హైదరాబాద్ పంపించండి"

"లేదు. బెంగుళూరు, బొంబాయిల్లో అయితే బాగుంటుంది"

రోహిత్ ఆ ప్రాంతాల్ని నిశితంగా గమని స్తున్నాడు. వారందరూ నడుస్తుంటే ఆ ఊరికే కళ వచ్చినట్లుంది.

" 'ట్రెడిషన్' గురించి చెప్పటం ఆపాను కదా. రోహిత్ రెండు మూడు పాత కాపీలు తెచ్చాడు. వాటిని చూస్తే ఆ క్వాలిటీ అదీ తెలిసిపోతుంది. అందులో ఎవరినీ ప్రకటన లడగరు. చందాలు పంపించమనరు. ఒకటి రెండుచోట్ల తప్పించి స్టాండ్స్‌లో పెట్టరు. అందులో ఆర్టికల్స్ చాలా పేరు పొందిన వారే రాస్తారు. ఆషామాషీగా రాయటం కాదు. చాలా లోతుగా పరిశోధించి రాస్తారు. 'ట్రెడిషన్'లో ఆర్టికల్ అచ్చయిం దంటే దానికి స్పెషల్ . ఐడెంటిఫికేషన్ వుంటుంది"

"అలాగా" అన్నాడు తలూపుతూ.

గేటు దగ్గర ఆగారు. వాళ్లంతా ఆ గేటుని చూడగానే ఓ నిముషం ఆగి పరీ క్షగా చూశారు. పక్కకి వెళ్లి శిధిలమౌతున్న గోడను చూశారు. రోహిత్ కెమెరాని తీశాడు. గోడమీద మొలకెత్తిన రావి మొక్కని స్నాప్ తీసుకున్నాడు. ఆగోడ, ఆ తలుపు... అన్నిటినీ తీసుకున్నాడు.

సూరిబాబు బలంగా తలుపు నెట్టాడు. అందరూ లోపలికి నడిచారు.

"మొన్నటిదాకా చెట్లూ, తుప్పల్తో భయం పుట్టేలా వుండేది. సూరి వాళ్ళు శుభ్రంచే శారు" అన్నాడు ఏ.ఎన్.

వారు లోపలకు వెళ్లగానే ముఖద్వారం బయట వాతావరణం, హాల్లోకి అడుగుపెట్ట గానే కనిపించిన పటాలు వారిని ఆకర్షిం చాయి.

"అగ్రజా" అని పిలుస్తూ వెళ్లాడు ఏ.ఎన్.

"వస్తున్నాం" అని వినిపించింది.

ఆ తర్వాత భూషణం నడిచివస్తుంటే 'సూరి' ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

మిగతా వారందరికీ పాత సినిమాల్లో జమీందార్లని చూస్తున్నట్లనిపించింది. ఎడిట రయితే ఇతన్ని ఎన్ని భంగిమల్లో ప్రెజెంట్ చేస్తే బాగుంటుంది అనే ఆలోచనకి వచ్చాడు.

అలా వచ్చి పెద్ద కుర్చీలో కూర్చున్నాడు. ఏ.ఎన్! అందరినీ పరిచయం చేశాడు. చిరు నవ్వుతోనే వారిని గ్రీట్ చేశాడు.

"ముందు మీరందరూ వేడివేడి నీళ్లతో స్నానాలు చేస్తే ఆ తర్వాత మనం కార్య క్రమం ఆరంభించుదాం" అన్నాడు ఏ.ఎన్.

వారి వస్తువులు రెండు గదుల్లో సర్దుకు న్నారు. విశాలమైన స్నానాల గదులు చూసి నవ్వుకున్నారు.




"ఇదే ఓ 'జిల్లా' అంతవుంది." అన్నాడు ఇన్‌ఛార్జ్. అంతలోనే "జిల్లా ఏమిటి? రాష్ట్ర మంత కట్టుకుంటారు. దేశంమీద బతికేయ టమేగా" అన్నాడు.

సూర్య, విజయ్ కూడా ఆ గదిలో వున్నారు.

"అంతా అయిపోయినట్లుంది. అయ్యగారి 'ప్రభ' వెలిగిపోతున్న రోజుల్లో చూస్తే కళ్లు తిరిగి కిందపడటమే"

"అప్పుడు మనల్నెందుకు చూడనిస్తారు"

"అది సరే. గురుడి డ్రస్సు అదిరిపో యింది. ఏమాటకామాటే చెప్పుకోవాలి. ఆ రక్తం రక్తమే. సరైన పోషణలేకగాని అదర గొడతాడు. నువ్వు మట్టుకు గురుడి మీసాలు క్లోజప్‌లో తియ్యాలి"

"నాకో అనుమానం" అన్నాడు సూర్య.

"ఏమిటది? "

"ఈ ఏ.ఎన్. ఎవరు? క్యారక్టర్ బాగుంది గాని మధ్యలో తీసుకువస్తే బాగుంటుందా? అతన్తోనే మొదలుపెట్ట డమా? "

"దేని గురించి స్వామీ"

"అదే నవల గురించి"

"అయ్... ఎవడి గోలవాడిది. ఇంకేదో పెద్ద అనుమానం అనుకున్నా"

"అదీవుంది"

ఉండు. గోడకి చెవులుంటాయి. మెల్లగా మాట్లాడు" అంటూ విజయ్ తలుపు మూసి వచ్చాడు.

"ఇంతకూ భూషణంగారి చుట్టమా... ఘోస్టా? ఎవరితను? "

"అంటే..."

"అదేనండి భూషణం పోలికలు ఇతన్లో కనిపించటం లేదు. కనీసం ఆ దర్పంగానీ, భాషగానీ..."

"భాషదేముందిలే ఎలా కావాలంటే అలా మాట్లాడొచ్చు. పోలికలూ అంతే. జమీం దారు వంశమంటే అందరూ గంభీరంగా, అందంగా పుట్టాలనుందా? నీచంగా పుట్ట కూడదా? "

"అతను నీచంగా లేడులెండి"

"విషయం చెబుతున్నానయ్యా... రూపం, భాష ఇవికాదు లెక్కలోకి తీసుకొనేది..."

"అంటే ఈ కార్యక్రమం ఏర్పాటు చేయటం వెనక మోటివ్ ఏమిటి? మీ అందర్నీ పిలిచి ఈ ఆర్టికల్ రాయించి పత్రి కల్లో పబ్లిష్ చేయటం వెనక పెద్ద ప్లానుంది"

"భోషాణానికి ప్లానేంటయ్యా. నిజం చెబు తున్నా. ఆఫీస్‌కి వెతుక్కుంటూ వచ్చాడు. పార్టీ ఇస్తున్నా రమ్మన్నాడు. ఓ.కె. అను కున్నాం. పత్రికల గురించి చెప్పాడు. విన్నాం. రోజూ లీడర్స్ చెప్పే లక్షరకాల చెత్తని పత్రికల్లో రాస్తున్నాం. భూషణం, భోషాణం అన్నాడు. రెండురోజులు కాల క్షేపం చేయొచ్చని వచ్చాం. మంచి ఒరిజి నల్ కల్లుకొడతాం. అంతే... ఇంతకంటే ప్లానుంటే వుండనీ..." అన్నాడు ఇన్‌ఛార్జ్.

"విజయ్ నవ్వాడు"

"మీరు వినండి సార్. ఏంలాభం లేనిది ఎందుకు ఇంత ఖర్చుపెడుతున్నాడు. ఇది ఆలోచించరే..."

"ఇదోగుల"

"కాదండిబాబూ"

"మరేంటి. లాభంలేందే మనం రాయ కూడదా? మీరు లాభం లేకపోతే రాయరా? "

"సమస్యే లేదు. సాహిత్యం వుందే అమ్ముకోవటానికి. మేం అమ్ముకునేటప్పుడు రకరకాల స్ట్రేటజీలు. ఏది క్లిక్ అయితే అదే

రాస్తాం. మేమే ప్రశ్నలూ-జవాబులూ రాసుకుంటాం. గిమ్మిక్స్ చేస్తాం. అందుకే ఇదో పెద్ద కుంభకోణం అని అభిప్రాయం"

"నిజమేనయ్యా... ఇంతపెద్ద కుంభకోణం కాబట్టే మీ ఎడిటర్ నిన్ను తీసుకువచ్చాడు. ముందువెళ్ళి స్నానం చేసిరా"

"థాంక్యూ" అంటూ లోపలకు వెళ్తుంటే...

" 'స్నానం' మాత్రమే చెయ్యండి. రీజనింగ్లూ, డేట్లూ ఆలోచిస్తుంటే 'మెగానవల'కి పెరిగిపోతుంది. ఈ రాత్రికి మనం ఇక్కడే వుంటున్నాం. అప్పుడు మాట్లాడుకోవచ్చు"

సూర్య గదిలోకి వెళ్ళాడు.

"ఎంతైనా క్రిమినల్ బుర్ర. మాకు ఆలోచన వచ్చిందేమో చూడు. 'ట్రెడిషన్' పత్రికుంది. ఆయనకూడా ఏలాభం లేంది ఆ పత్రిక ఎందుకు తెస్తాడంటారు. ఎవడి లహరి వాడిది"

"లహరా? " అన్నాడు విజయ్.

"ఔమల్లా"

విజయ్ బిగ్గరగా నవ్వాడు.

"సూర్యంగాడొస్తాడు. లాభంలేందే ఎందుకు నవ్వావని"

విజయ్ కడుపు పట్టుకున్నాడు...

"ఓ. కె. ఆపేస్తున్నా. ఈ డ్రెస్ 'సూరి'గాడికి... అమ్మనీ చూశావా ఇక్కడి 'ఛెఫ్'పేరు కూడా అదే. మండిస్తాడనుకుంటా? "

"ఏంటి? "

"కారం"

"అబ్బ...చంపుతున్నారు సార్" అన్నాడు విజయ్...

ఆ గదినుండి రోహిత్ స్నానం చేసి బయటకొచ్చాడు. 'ఏ.ఎన్.' అప్పుడే గదిలోకి వచ్చాడు. తన బ్యాగ్నుండి 'ట్రెడిషన్' కాపీలు తీసిచ్చాడు. వాటిని నిశితంగా పరిశీలించాడు. పాతకాలం నాటి పింగాణి పాత్రలు, ఇంటీరియర్ డెకరేషన్స్, విగ్రహాలు, భవంతులు, సాహిత్యం, కళలు, నృత్యరీతులు. ఒకటికాదు అన్నికోణాలని ప్రతిబింబించే ఆర్టికల్స్ వున్నాయి.

పేపర్, ప్రింటింగ్, అన్నీ పెర్ఫెక్షన్తో నిండి వున్నట్లనిపించింది.

"చాలామంచి ప్రయత్నం" అన్నాడు ఏ.ఎన్.

"అవును"

"కానీ ఈ వయసులో మీరు ఈ పత్రికకు ఆర్టికల్స్ రాయటం నాకు ఆశ్చర్యంగా వుంది"

"నాకీ సబ్జెక్ట్ అంటే ఇష్టం. ఈ ప్రపంచంలో ఏం జరుగుతుందోననే జిజ్ఞాస నాకెక్కువ. ఫారిన్ మేగజైన్స్... బ్రిటిష్ లైబ్రరీ, ఇవన్నీ ఫాలో అవుతున్నాను. "

"చూశారా. అనుకోకుండా మీతో పరిచయం కావటం మా అదృష్టం అనుకుంటాను"

"అంత పెద్దమాట ఎందుకులెండి" అన్నాడు టవలందుకుని

"తయారై రండి. లైట్గా టిఫిన్ చేద్దాం"

"అలాగే"

అప్పుడు తల తుడుచుకుంటూ బయటికొచ్చాడు ఎడిటర్.

"ఇలాంటి చోటుకి రావటం నా జీవితంలో ఇదే మొదటిసారి. చాలా థ్రిల్లింగ్గా వుంది" అన్నాడు.

ఏ.ఎన్. నవ్వుతూ నిష్క్రమించాడు.

పాతకాలంనాటి డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నారు.

'సూరి' టిఫిన్ ఏర్పాట్లు చూస్తున్నాడు. పెద్ద సామాన్లు లేవుగానీ, అందరికీ ప్లేట్లలో వడ్డించారు.





అనుమానంగా నోట్లో పెట్టుకున్న ఇన్ ఛార్జ్ ఆ తర్వాత సిగ్గుపడలేదు.

సూర్యమాత్రం తింటూ భూషణాన్నే గమనించాడు.

"చట్నీ అదరగొట్టేశాడు" అన్నారెవరో...

"కారమా? " విజయ్.

"కాదు టేస్ట్"

"ఎవరూ మొహమాట పడొద్దు. ఇది మీ స్వంత ఇల్లనుకోండి" అన్నాడు ఏ.ఎన్.

"నేను స్వంత ఇల్లనుకోను. స్వంత బాత్ రూమ్ అనుకుని స్నానంచేశా. నాకది చాలు మలేసియా అంతుంది."

అందరూ నవ్వుకుంటుంటే సూరిబాబు 'కాఫీలు' పెద్దగ్లాసుల్లో తెచ్చిచ్చాడు.

"చాలవేమో... చెంబులు లేవా? " అంటున్న ఇన్ ఛార్జ్‌ని చూసి భూషణం మీసం మీద చెయ్యివేశాడు.

"భోజనమంటే భూషణం తాతగారిని చెప్పుకోవాలి. పొద్దున పూట ఈ లావుదో సెల్లో రెండు మూడు కోళ్లని నంజుకునే వారు. లోటాలుకాదు... చిన్నబిందె ఎత్తుకుని పచ్చిపాలు తాగేవారు"

"అరిగేవేనా? "

"అరగటమా... బ్రేవుమని తేన్చాడంటే సగం ఫినిష్. మధ్యాహ్నం భోజనం చిన్న 'మెనూ'. ఓ పెద్ద గిన్నె మీగడలో తేనె పోసుకుని జుర్రుతుంటే ఆ శబ్దానికి కంది రీగలు గాల్లోకి లేచేవంటారు"

"అంతమీగడా... ఫ్యాట్ కదండి"

"ఫ్యాటా రేటా... ఈ రకంగా ఎనభై ఏళ్లు తిన్నాడు. చీదెరగడు. రోజూ షికారుకు పోయేవాడు"

"అసలు జబ్బేలేకుండా పోయారా? "

"మరి... ఇంకొకాయన మాత్రం జబ్బుతోనే పోయారు"

"అదేం జబ్బు" అన్నాడు విజయ్

"రాచకురుపు"

"దాన్నే కాన్సర్ అంటున్నాం"

"అలాగా. అవును మరి. అంతపెద్ద వంశంలో పుట్టి రాచకురుపుతో పోతేనే మర్యాదగాని, తుమ్ముముల్లిరిగి ధనుర్వాతంతో పోతే ఎట్లా? " అన్నాడు ఇన్ ఛార్జ్.

ఆ మాటలంటున్నప్పుడు ముఖం సీరియస్‌గా వుంది. మిగతావారికి నవ్వొచ్చినా భూషణంగారిని చూసి నవ్వాపుకున్నారు.

"సార్. ఈ ఇంట్లో భోషాణమేనా వుంది? తుపాకులూ, హంటర్లూ, ఇలాంటివేంలేవా? "

"ఒకప్పుడుండేవి. అన్నీ పోయాయి. చివరికి కొన్నాళ్లకి ఈ ఇల్లుకూడా శిథిలమైపోతుంది" అన్నాడు ఏ.ఎన్.

"ఇంక భోషాణం చూద్దామా" అన్నారు.

అందరూ లేచారు. భోషాణమున్న గదిలోకి ఎంటరవగానే 'సూర్య' చూపులు ఆ గదిచుట్టూ తిరిగాయి. తలోమూలకి వెళ్లి తాకి చూస్తున్నారు. ఒకరిద్దరు దానిని వేళ్ళతో కొట్టి చూశారు. ఆ శబ్దం వింతగా వుంది. మరికొన్ని చోట్ల తట్టినా అదే శబ్దం...

రోహిత్ కెమెరా తీశాడు. ఫొటోలు తీసుకోవటం మొదలుపెట్టాడు.

"ఇది ఎప్పటిదో మీకు తెలుసా భూషణం గారూ"

"ఏమో... మా తాతగారు పంపించారో, లేక మా ముత్తాతలు ఎక్కడినుంచైనా తెప్పించారో మాకు తెలియదు" అన్నాడు.

"ఇందులో ఏం దాచేవారండీ..."

"బహుశా మొహిరీలు, బంగారు నగలు... డబ్బు.. ఏమైనా కావచ్చు.."

అన్నాడు ఏ.ఎన్.

"అది నిజమేలెండి. నా అంచనా ప్రకారం అయితే, గుర్రాల్నీ, ఏనుగుల్నీ కూడా ఇందులోనే దాచుంటారేమో"

"మీరు మంచి జోక్స్ వేస్తారే" అన్నాడు ఏ.ఎన్.

"నాకంటే 'సూర్య' బాగా పేల్చుతాడు"

"అది నిజమే.ఆయన నవలల్లో పిస్టల్ పేలనిచాప్టర్ లేకుండా ఒకటీ లేదు. అందుకేగా 'న్యూవేవ్' నవలకోసం వచ్చాడు"

రోహిత్ ఫొటోలు తీసుకున్నాక అడిగాడు.

"ఓసారి ఇల్లంతా చూడాలనుంది"

"వైనాట్" అంటూ దారితీశాడు...

వరసగా గదులన్నీ చూశారు. మిగిలిన వస్తువులు కొన్నే అయినా అపురూపంగా వున్నాయి. ఫ్రేముల్లో బిగించిన భూషణం తాత ఫొటోలు తీసుకున్నారు.

భూషణం గదిలో అసంపూర్ణ చిత్రం చూశాక

"ఇదెవరి చిత్రంసార్" అన్నారు.

"అది... " అని ఆగిపోయాడు భూషణం.

"ముఖం కూడా పూర్తి చేసుంటే బాగుండేది"

"దీనికి 'అముఖ' అని పేరు పెడితే బాగుంటుంది"

భూషణం నొసలు చిట్లించాడు.

"రండి కూర్చుందాం" అని వాళ్లని బయలుదేర దీశాడు ఏ.ఎన్. అందరూ కూర్చున్నాక ఇంక ప్రశ్నలు ఆరంభం అయ్యాయి.

"మీ దివాణం ఇలా అయిపోవటానికి కారణం ఏమిటి? "





" మీ ఆస్తులు ఏం మిగిలున్నాయి? "

"ఇందులో భోషాణానికి ఏమైనా చరిత్రుందా? "

"మీరింకా అవివాహితులుగా వుండటానికి కారణం ఏమిటి? "

"ఇది మధ్యయుగాల్లో చేసినదైతే ఎవరెవరి చేతులు మారింది? "

భూషణం ఏమీ మాట్లాడకుండా చూస్తున్నాడు... ఏ.ఎన్. చిరునవ్వుతో వారందరినీ చూశాడు.

"అగ్రజుల తరపున మీ ప్రశ్నలకి నేను సమాధానం చెబుతాను. ఈనాటి పరిస్థితికి రకరకాల కారణాలు. ఆస్తులంటూ మిగిలినవేం లేవు. ఇంక భోషాణం చరిత్ర గురించి, నా అంచనా ప్రకారం దీనికి ఒక చరిత్ర కాదు నాలుగు లేదా పది చరిత్రలుండవచ్చు చరిత్ర మనకు వారసత్వంగా యిచ్చిన ఓ మాస్టర్ పీస్. ఆ షేప్ చూడండి. పనితనం చూడండి. వాడిన కర్ర చూడండి. ఈ మధ్యకాలంలో మనం ఎరగనివి... ప్రాచీన కాలంలోని పుస్తకాలు తెరిస్తే ఎక్కడైనా ఈ భోషాణం ప్రసక్తి రావచ్చు.."

"దీన్నిలా వదిలేస్తే ఏమౌతుంది"

"ఏముంది. నాశనమైపోతుంది"

"మరి మ్యూజియమ్‌లో పెట్టొచ్చుకదా"

"ఎవరు పెట్టాలి? చేస్తే ఆపని ప్రభుత్వం చేయాలి. ముందుగా చెప్పాను. నిష్ణాతులుంటే ఈ భోషాణం ఎన్ని సంవత్సరాల క్రితం తయారైందో చెబుతారు"

"మరా బొమ్మ"

"అది అగ్రజుల వ్యక్తిగత విషయం"

"దాని గురించి మేము అడగంగానీ, ఆయన రంగులు అద్దిన తీరునీ, ఆ రేఖల్ని అభినందించవచ్చా? "

"అందులో ఏముంది? "

"రియల్లీ హేట్సాఫ్" అన్నారు.

"ఇప్పుడు ఇలాంటివి దొరుకుతాయా? ఐ మీన్ భోషాణాలు"

"అంటే రెండు రకాలు. మిగతా ఎక్కడన్నా దీనికంటే పెద్దది దొరకొచ్చు కానీ అది కొత్తది కావచ్చు ఈ భోషాణం మాత్రం పెద్ద సెన్సేషన్ అవుతుంది. అది ఎన్ని వందల సంవత్సరాల నాటిదో మరి..."

"నాకింకో ఐడియా వస్తోంది. ఈ ఇంటిని ప్రభుత్వం స్వాధీనం చేసుకొని, యాత్రాస్థలంగా చేయొచ్చు"

"నిజమేగాని ఇందులో వస్తువులు లేవు. అవన్నీ ఉంటే అది వేరే విషయం"

రోహిత్ భూషణాన్ని ఫొటోలు తీయటం మొదలుపెట్టాడు. భూషణానికి మాత్రం ఇవన్నీ వింతగా వున్నాయి. ఇంతకుముందు అఖిల ఇంట్లో కెమేరాలు చూసినా ఇప్పటివ రకూ వస్తున్న మార్పులు అతనికి తెలియవు.

'విజయ్' తనకు కావలసిన ఫొటోలు తీసుకున్నాడు. అలా భోజన సమయందాకా గడిచింది.

"అబ్బో... వాసనలు గొప్పగా వున్నాయి. 'సూరి' బాబుగారు మనకి మంచి విందు ఇస్తున్నారు" అన్నాడు ఇన్‌ఛార్జ్.

"నిజంగానే బాగాచేశాడు. రకరకాలు చెత్త తిని కడుపు చెడిపోయిందేమో... ఈ తిండి చాలా బాగుంది" అన్నాడు ఎడిటర్.

అందరూ భోజనాల దగ్గర కూర్చున్నారు.

ఇంక ఆ తర్వాత లొట్టలేసుకుంటూ తినటమే. సూరిని అభినందిస్తుంటే అతను ఉక్కిరిబిక్కిరైపోయాడు. అన్ని ఐటమ్స్ అంత బాగా కుదిరాయి.

"మీరు ఇతనికి ట్రైనింగ్ ఇప్పించాలనుకుంటున్నారుగానీ, వాళ్లనే తీసుకొచ్చి ఇతన్తో ట్రైనింగ్ ఇప్పించాలి. నాకైతే మా వీక్లీలో కొత్తగా ఈ వంటకాల మీద ఆర్టికల్ రాయించాలనిపిస్తోంది" అన్నాడు ఎడిటర్.

"అయ్యా... రెండు గంటలు నిద్ర వెయ్యకపోతే ఈ భోజనం సర్దుకోదు" అన్నారు.

సూరి అందరికీ పాన్ అందించాడు.

'ఆఖరికి ఇది కూడా అదిరిపోయింది' అని నములుతూ తమ గదుల్లోకి వెళ్లారు. అమాంతం మంచాల మీద పడిపోయారు.

"ఇన్‌ఛార్జిగారూ వెధవ భోషాణం అనుకోకుండా తీసుకువచ్చారు. అన్ని ఫొటోలు అయ్యాక అందరం ఆ భూషణంగారితో ఓ ఫొటో దిగుదాం"

"అవును. రోహిత్‌తో తీయించుకుందాం" అన్నాడు ఇన్‌ఛార్జ్

★ ★ ★

రాత్రి....

'సూరి' మందుబాటిల్స్, గ్లాసులు అన్నీ అరేంజ్ చేశాడు. 'భూషణం' మాత్రం వారి దగ్గర కూర్చోలేదు. మీరందరూ సరదాగా కాలక్షేపం చెయ్యండి అనేసి తన గదికి వెళ్లిపోయాడు.

వారందరూ కొంతసేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు.

వీక్లీ ఎడిటర్ ఏ.ఎన్‌తో అన్నాడు.

"భూషణంగారి ఫ్యామిలీ వివరాలుంటే బాగుంటుంది. వాళ్లకి ఎంత లాండ్‌వుండేది.. భూషణంగారి బాల్యం. ఆయన జ్ఞాపకాలు. ఇవన్నీ మనకు చెబితే ఆ ఆర్టికల్‌కి నిండుదనం వస్తుంది"

"ఆయన కొంచెం మితభాషిలా వున్నారు" అన్నాడు ఇన్‌ఛార్జ్

"అదేం లేదులెండి. రేపు డిటైల్డ్‌గా మాట్లాడుకుందాం. ముందుగా మీకు కావలసిన వివరాలేమిటో తెలియచేస్తే ఆయన్ని

నేను ప్రిపేర్ చేస్తాను" అన్నాడు ఏ.ఎన్.

"అలాగే. ఎక్కువగా గతానికి చెందిన కస్టమ్స్ ఎలా వుండేవో తెలుసుకోవాలి. అంతఃపురాల్లో స్త్రీల పరిస్థితులు, వారి చదువు, పిల్లల్తో పెద్దవాళ్ళు ఎలా ప్రవర్తించే వారు, చిన్నపిల్లల భావాలు ఎలా వుండేవి, వారి సరదాలు, ఐ మీన్ నృత్యం, గానం, వేట ఇలా. వారి ఇళ్లల్లో జరిగే పెళ్ళిళ్ళూ, పెళ్లిచూపులు, పెట్టుపోతలు, తమ దగ్గర పనిచేసేవారిని ఎలా ట్రీట్ చేసేవారు ఇలా దాదాపు అన్ని విషయాలు అడుగుదాం. అందులో ఏది బాగుంటే అది పబ్లిష్ చేద్దాం. లేకపోతే పక్కనపెడదాం. టోటల్‌గా అప్పటి పద్ధతులమీద మనం రీడర్‌కి ఓ అవగాహన నివ్వాలి"

"ఖచ్చితంగా" అన్నాడు ఏ.ఎన్.

పార్టీ అయిపోయాక 'సూర్య' ఏ.ఎన్‌ని కలిసి "సార్ మీతో పర్సనల్‌గా ఓ అర గంట మాట్లాడాలనుకుంటున్నాను" అన్నాడు.

"అలాగే"

"అయితే నేను మీగది దగ్గరకొస్తాను"

"రండి" అన్నాడు.

'ఇన్‌ఛార్జ్'కి మందుకొంచెం ఎక్కువైంది. మంచంమీద వాలిపోయాడు.

"గురూ నేను కొంచెంసేపు ఏ.ఎన్.గారితో మాట్లాడి వస్తా" అని విజయ్‌కి చెప్పి 'సూర్య' వచ్చాడు.

'వెల్‌కమ్' అంటూ ఆహ్వానించాడు.

సూర్య మంచంమీద కూర్చున్నాడు.

"ఇప్పుడు చెప్పండి. ఏ విషయం గురించి మాట్లాడాలనుకుంటున్నారు? "

"మీరు కమర్షియల్ నవలలు చదువుతారా? "




"కొన్ని పుస్తకాలు చదివాను"

"ఏంలేదు. మీరు రచయితలా? "

"ఎందుకలా అడిగారు? " నవ్వుతూ అన్నాడు ఏ.ఎన్.

"జస్ట్ తెలుసుకుందామని"

"కాదు"

"కానీ నాకెందుకో మీరు మంచి రచయిత అయుంటారనిపించింది. మీ దగ్గర మంచి సబ్జెక్ట్స్ వుండుంటాయని కూడా నాకనిపిస్తోంది. మీరు ఏమనుకోనంటే నాకు మంచి థీమ్స్ చెప్పగలరా? "

"నేనా? " అన్నాడు నవ్వుతూ.

"అవును సార్! మీకు ఎప్పుడు తీరిక దొరుకుతుందో చెబితే నేనో వారం రోజుల పాటు వచ్చేస్తాను. మీ దగ్గర కూర్చుంటే ఓ రెండు సంవత్సరాలపాటు నేను రాసుకుంటూ పోవటమే"

"నానుంచి ఓవర్‌గా ఎక్స్‌పెక్ట్ చేస్తున్నారు"

"లేదండి... కన్యాశుల్కంలో గిరీశంగారు చెప్పినట్లు మీతో మాట్లాడటమే ఓ ఎడ్యుకేషన్. ఇంతకూ 'భోషాణం' మీద ప్లాన్ చేస్తున్న నవల ఎలా రాస్తే బాగుంటుందో చెబుతారా? "

"మీరు సీరియస్‌గానే అడుగుతున్నారా"

"అవును"

"అయితే నేనూ చెబుతున్నాను. నా దగ్గర అంత తెలివిలేదు. ముందు మీరు స్టార్ట్ చేయండి. చదివాక ఇలా అయితే బాగుంటుందని చెబుతాను. లేదా నా అభిప్రాయం చెబుతాను. ఏమంటారు? "

"చాలండి... అంతవరకు సంతోషం. ఈ నవలని ఫాంటసీగా రాయాలా లేక మోడ్రన్‌గానా అని ఆలోచిస్తున్నాను. రెండు వెర్షన్లూ రాసి చూపిస్తా. మీరు ఈ వెర్షన్ బాగుంది అని చెప్తే అదే కంటిన్యూ చేస్తాను"

"అలాగే"

"ఈ విషయం మాట్లాడదామనే మీ దగ్గరకొచ్చాను"

"సంతోషం... గుడ్‌నైట్!"

"గుడ్‌నైట్" అని వచ్చేశాడు సూర్య. అతనికి ఏ.ఎస్ కళ్లు మరీ మరీ గుర్తుకొస్తున్నాయి.

అవి డేగకళ్లు... ఆ చూపులో అంత పవరుంది. ఆకాశంలో ఎక్కడో చక్కెర్లు కొడుతూ భూమ్మీద కనిపించే చిన్నచిన్న కోడి పిల్లల్ని కూడా చూడగల దృష్టి అతనిలో వుంది.

కళ్లకింద అగాధంలావుంది. నల్లటి చారలున్నాయి. మాటలు కూడా ఆచి తూచి మాట్లాడుతున్నాడు. ఇతను రాజకీయాల్లోకి వచ్చుంటే ముఖ్యమంత్రి స్థానానికి ఎగబాకే వాడేననిపించింది.

ఇప్పుడైనా పోయిందేంలేదు. ఏదో సంచలనం సృష్టించి తీరతాడు...

'హీ ఈజే కింగ్ మేకర్' అనుకున్నాడు.

"పడుకోగురువా" అన్నాడు విజయ్.

★ ★ ★

ఉదయం-

అందరూ లేచి కాలకృత్యాలు తీర్చుకున్నాక ఊరిమీద పడ్డారు. సూర్య, ఎడిటర్ కొంతమంది మనుషుల్ని కలుసుకొని ఏవేవో ప్రశ్నలు అడిగారు. ఆ ఊరి చెరువునీ, గుడినీ, పెద్దపెద్ద వృక్షాలనీ చూశారు. రోహిత్‌కి ఆ ప్రాంతం బాగా నచ్చింది. అందమైన ప్రాంతాలూ, దృశ్యాలూ అతని కెమేరాలో రికార్డయ్యాయి.

తిరిగి వచ్చాక భూషణంతో కూర్చున్నారు. అతను ఉల్లాసంగా ఉన్నాడు. వాళ్ల అడిగిన అనేక ప్రశ్నలకు నవ్వుతూ జవాబులు చెప్పాడు.

"మేం ఎందుకు మారాలి. ఈ ప్రపంచం మా వెంట నడవాలి" అని పునరుద్ఘాటించాడు.

"కొత్తంతా రోత" అన్నాడు.

ఇంత పెద్ద భవంతిలో ఏకాంతంలో జీవిస్తున్నానంటే అందుకు కారణం తన పూర్వీకుల రక్తం తనలో వుండటమే అన్నాడు. వారందరూ తనతో మాట్లాడుతుంటారన్నాడు. మానవమాత్రులంటూ లేని ఎడారి ప్రాంతంలోగాని సముద్ర తీరాల్లోగాని జీవించటం నాకేం కష్టం కాదన్నాడు.

ఈ ప్రపంచంలో ప్రేమనేది లేదు. అదంతా మోసం అని మేం భావిస్తున్నాం అన్నాడు.

భగవంతుడిలో తనకు విశ్వాసం వుందన్నాడు. జమిందార్లలో దుర్మార్గులున్నా అందులో బ్యూటీ వుంది. అది అర్థం చేసుకోవటానికి శక్తి కావాలన్నాడు.

"మీరు కథలు చదువుతారా" అన్నాడు సూర్య.

"మేం చదవం. అందులో ఏముంటాయని చదవాలి. అప్పటి గురువులు వేరు. వారు రాజనీతిని బోధించేవారు. ఇప్పటి చదువులు మనిషిని మాటమీదకాక, మమకారాలమీదకాక కేవలం డబ్బు మీద మాత్రమే నిలబెడతాయ"న్నాడు.

"మీరు పొరపాట్లకు అతీతులా" అన్నారెవరో.

"కాదుకానీ మా పొరపాట్లను మేం గుర్తించాలి. అంగీకరించాలి. అది పొరపాటే అయినా మేం చేస్తే అందులో అందం వుంటుంది. అవి చరిత్ర పుస్తకాలకు ఎక్కుతాయి. మేం ఎవరితోనైనా సరససల్లాపములు జరిపినా, ప్రేమించినా, భంగపడినా అది పఠించి తీరవలసిన చరిత్రేకదా" అని నవ్వాడు.

"మీ ఆత్మకథ రాయవచ్చునుకదా" అన్నప్పుడు.

"అది మాకు సాధ్యం కానిది. అనంత వైవిధ్యంగల మా జీవితాలను మాటలలో బంధించుటకెవరికి సాధ్యం. అయిననూ మా గుండెలోతుల్ని తట్టగల కవి పుంగవుడు దొరకవలెను. వారు మాతోపాటు వుండవలెను. మాకు ఉత్సాహం వచ్చినపుడు మేం చెప్పు విషయములు రాసుకొనవలెను.

అంతటి ఓపిక ఎవరికి కలదు. అంతకుముందు మా తాతగారి జీవితకథను రాస్తానని ఓ వృద్ధుడు వచ్చెను. మా తాతగారు తెల్లవారు ఝాము మూడు గంటలకి నిద్ర లేచి వ్యాయామం చేయుదురు. బ్రహ్మముహూర్తంలో నిర్ణయములు తీసుకొందురు. ఆ ఘడియలలో వారు అనేకానేక విషయములు చెప్పుదురు. రెండు రోజులు మాత్రం ముక్కుతూ, మూలుగుతూ లేచినారట. మూడో దినమున మా తాతగారి మంచంపక్కన నిద్రించుచున్న ఆ కవి పుంగవుని నడుముమీద తాతగారి కాలుపడి పుల్ల విరిగిన శబ్దం అయినది. ఇంక అతనెప్పుడూ జీవిత చరిత్రలుగానీ కవిత్వంగానీ రాయనేలేదు"

అందరూ బిగ్గరగా పొట్టచెక్కలయ్యేట్లు నవ్వారు.

"ఇంకొక్క ప్రశ్న అడగాలనుకుంటున్నాను. మీరు ఒకప్పుడు అంతులేని వైభోగాలు అనుభవించారుకదా. మీ కళ్లముందే అవన్నీ కరిగిపోయాయి. ఇప్పుడు బహుశా లేమిలోనే జీవిస్తున్నారని మేము భావిస్తున్నాం. ఈ మార్పులు మిమ్ములను బాధించుటలేదా? "

భూషణం ఓసారి తలెత్తి ఆకాశంలోకి చూశాడు.

అనంతరం భుజాలెగరేశాడు.

"లేదు... ఆనందమును కలిగించుచున్నవి" అన్నాడు.

అందరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"అవును సోదరులారా! బాధ వచ్చినపుడు ఆనందించుట, ఆనందంలో చింతించుట మేము చేయవలసిన పనులు. అప్పుడే కదా సామాన్యులకూ మాకూ తేడా తెలియును. ఇంక నిజం చెప్పవలెనంటే ఒక్కానొక సమయములో తనువు చాలించి మా వంశమున చరిత్ర సృష్టించవలెననుకున్నాను. చివరి క్షణమున మనసు మారిపోయింది. మా అంతరాత్మ అది తప్పు అంది...

అది నిజమేకదా! మా పెద్దలందరూ జీవితములోని ఒక పార్శ్యం మాత్రమే చూసినారు. అయినా ఆ వైభవములు మేము మాకోసం అనుభవించలేదు. అటులనే ఈ దరిద్రం కూడా మాదికాదు. ఇదో గొప్ప అనుభవం. మాకు మాత్రమే సాధ్యపడే అంశం. అందుకే ఎప్పుడైనా ఈ లేమి బాధించినా అధిగమించి జీవించగలుగుతున్నాం"

"చాలా సంతోషం భూషణంగారూ! చాలా ఓపిగ్గా నిర్మొహమాటంగా జవాబులు చెప్పారు. మీ జీవితంలో మంచి మార్పులు రావాలని కోరుకుంటున్నాం. ఇంక మేం బయలుదేరతాం"

భూషణం మీసం సవరించుకున్నాడు.

"ధన్యవాదాలు సోదరులారా! ఇదిగో మా సోదరుల ఆగమనంతోనే మాకు వసంతం వచ్చింది. మీ రాకతో మా ఇంట సంగీత, సాహిత్యాలు అడుగుపెట్టాయి. మమ్మల్ని గతంలోకి తీసుకుపోయినారు. మీ పాఠకులకు మా శుభాశీస్సులు అందజేయండి. మరి శెలవా..!" అన్నాడు చిత్రమైన భంగిమలో.

అందరూ నడుస్తున్నారు.

"ఇట్లాంటి పిచ్చినా కొడుకులు దేశంలో ఇంకెక్కడైనా వుంటారా? " అన్నాడు సూర్య.




"మెల్లగా అనరా మగడా. బస్సు ఎక్కేదా కన్నా ఆగలేవా? "

"అది కాదండి! పేదరికం అనుభవించటం పెద్ద గొప్ప విషయంగా మాట్లాడతాదేమిటి? అసలు డబ్బు సంపాదించటానికి ముందుకు రాకపోతే అతనేం మనిషండి"

"తను మానవమాత్రుడ్ని కాదని అతనే చెప్పాడుగా"

"అది నిజమే... ఇలాంటి క్యారక్టర్లని చూస్తే నాకు భలే తిక్క. నాకీ గంజిచాలు, పచ్చిపులుసు చాలు, వెన్నెలచాలు, కవిత్వం చాలు... అరెకరం పొలం చాలు అంటారు. సరిపోవటం ఏంటండి. రేపు నీకు సోషలిజం వచ్చినా చాలు చాలు అంటావు. సరి పోద్ది, ఎప్పుడో పోదామనుకున్నాడంట. పోతే దరిద్రం వదిలిపోయేది"

"అలానే మాట్లాడకూడదనేది. ఆయనలా వుండబట్టే ఈ రోజు ఆర్టికలయ్యాడు. మంచి కారక్టర్ దొరికింది. మంచి నవల రాసుకో"

"ఛ... ఇట్టాంటి కేరక్టరా? ఏం చెప్పమంటావ్. రూపాయితో కోట్లు సంపాదించేవాడి గురించి రాయటంలో అర్థంవుంది. వంద మర్డర్లు చేసేవాడి గురించి రాయటంలో అర్థముంది. పనీపాటా లేకుండా కూర్చున్న మనిషి గురించి ఏం రాస్తాం"

"అదే రాయండి. రాత్రి నాకు నిద్రపట్టలా. మీ అందరూ గురకలు పెడుతున్నారు. ఏదో శబ్దం. గాజుల గలగలో, గజ్జెల శబ్దమో తెలియదు. చల్లగా గాలి మీదకు పాకింది. కెవ్వునకేకవేద్దామనుకున్నా. నీ మీద కాళ్లేసి గట్టిగా వాటేసుకుంటేగాని ధైర్యం రాలేదు"

"నిజమా" అన్నాడు సూర్య.

"అవును"

"అట్లయితే ఆ ఇంట్లో లంకెల బిందెలేవో వుండుంటాయి" అన్నాడు.

"నీకెట్టా తెలుసు? "

"ఎక్కడో గోడల్లో పాతిపెట్టుంటారు. ఆగు కొత్త ఐడియా చెప్పావ్. ఈ రూట్లో నరుక్కొస్తా"

"వస్తారా... ఇక్కడ వుంటారా? " అన్న పిలుపుకి ఉలిక్కిపడ్డారు. మిగతా వారంతా వెళ్లిపోయారు. ఇద్దరూ పరుగున వెళ్లారు.

"ఏంటయ్యా సోది" అన్నాడు ఇన్‌ఛార్జ్.

ఇద్దరూ నవ్వారు.

ఏ.ఎన్ కేసి చూస్తూ చెప్పాడు.

"తివిరి ఇసుమున తైలం తీయవచ్చు అంటారే మా సూర్య అలాంటివాడే. విత వుట్ ప్రాఫిట్ ఏమీ చెయ్యడు"

ఏ.ఎన్ చిరునవ్వుతో సూర్యని చూశాడు.

బస్సుకోసం చూస్తుంటే వీళ్లందరికేసి ఆ గ్రామ ప్రజలు... ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"ఇదిగో సూరి" అంటూ పిలిచారెవరో. సూరి వాళ్ల దగ్గరకెళ్లాడు.

"ఏందిరో అచ్చంగా బోసడీగాడింట్లో వుంటన్నావంటగా"

"మెల్లగా మాట్లాడవయ్యా బాబూ"

"ఏంటిరా కొత్తకొత్త మనుషులు ఊర్లోకొస్తున్నారు కుంభకోణమేవన్నా జరుగుతోందా?"

"కుంభకోణవా ఇంకేమన్నానా? "

"అవున్లే నీకు ఎవడు నాలుగు చుక్కలు పోయిస్తే ఆడెనక తయారు. ఈ ఊరిని ఎవడికన్నా అమ్ముకు దొబ్బుతున్నారా? "

"అమ్ముకు దొబ్బటానికి ఈ వూర్లో ఏవుంది భోషాణం" అన్నాడు సూరి.

"భోషాణాలు బోసడీ దగ్గరేకాదు మా దగ్గరా వున్నాయి" అన్నాడతను.

"అయితే నన్నేం చేయమంటావ్" అన్నాడు.

ఏం చేయమనేవాడోగాని బస్సు వచ్చింది.

అందరూ ఎక్కి కూర్చున్నారు. "ఇంతకూ ఈ వార్త ఎప్పుడు వస్తుంది" అన్నాడు ఏ.ఎన్.

"మూడు రోజుల తర్వాత"

"మా వీక్లీలో ముందు భూషణంగారి ఫొటోవేసి త్వరలో ఇంటర్వ్యూ అని యాడ్ ఇస్తాను. వచ్చే ఇష్యూనుండి ఆంధ్రదేశాన్ని మీ భూషణం వారి భోషాణం ఓ వూపు వూపుతారు. చూస్తారుగా"

"చిన్న విషయం అనుకోకుండా వచ్చారు. ధన్యవాదాలు"

"మీరెప్పుడొస్తున్నారు? "

"నాలుగు రోజుల్లో వస్తాను" అన్నాడు ఏ.ఎన్.

రోహిత్ చేతినందిస్తూ చెప్పాడు.

"మీకు ఓ సెట్ ఫొటోస్ పంపిస్తాను. అవసరమైతే మీరు వాటిని ఎన్‌లార్జ్ చేయించుకోవచ్చు నా కార్డ్ ఇది" అని అందించాడు.

బస్ హారన్ మోగింది.

అందరూ చేతులూపుతుండగా బస్ కదిలింది.



ఏ.ఎన్, సూరి నడుస్తున్నారు.

"ఏంటయ్యా ఆయనెవరో ఏదో అంటున్నారు"

"అబ్బే ఏం లేదండి"

"నేను విన్నానుగాని చెప్పవయ్యా"

"అదండి.. మామూలేనండి. మన భూషణంగారిని ఈ వూర్లో ఏదొకటి అంటారండి"

"నువ్వు కూడా అన్నావుగా"

"పొరపాటేనండి"

"దాందేముందిలే చరిత్రలో ప్రతి గొప్పవాడూ కొంతకాలం పొగిడించుకుంటే మరి కొంతకాలం తిట్లు తిన్నాడు. నువ్వో పని చేయగలవా? "

"అదేంటండి... అట్టడిగారు. ఈ పని నువ్వు చెయ్యాల సూరీ అంటే చేసి పారేయటమే. అంతేగాని మరొక్కమాట ఎదురు చెప్పనండి"

"ఈ చుట్టుపక్కల గ్రామాలన్నీ నీకు తెలుసుగా? "

"ఎందుకు తెలవదండి. పుట్టి పెరిగింది ఇక్కడేకదండి"

"ఈ విషయాలు ఎవరితో ఎక్కువ మాట్లాడకూడదు. ఎందుకూ ఏమిటని అడిగినా ఏదొకటి చెప్పాలి తప్పించి మిగతా అనవసర విషయాలు మాట్లాడకూడదు"

"అవసరం వున్నా మాట్లాడనండి"

"దీన్నే ఎగ్‌స్ట్రా అంటారు. అవసరమైనపుడు తప్పకుండా మాట్లాడాలి"

"అయ్యో పొరపాటయిపోయిందండి. మీరెట్టా చెబితే అట్టానే. ఇంతకీ విషయం చెప్పండి"

"ఏం లేదయ్యా ఈ చుట్టుపక్కల గ్రామాల్లో మనకి పాత సామాన్లు దొరుకుతాయా అనేదే చూడాలి"

"ఏ సామాన్లయ్యా"

"కీశా మంచాలు, భోషాణాలు, బట్టల స్టాండులు, కుర్చీలూ, తలుపులూ, ద్వారాలు,





ఏమైనా కావచ్చు ఆడవాళ్ల గాజుల పెట్టెలు, నగలు పెట్టుకునేవి, పాతకాలపు ఫ్రేములూ, ఫొటోలు ఏమైనా ఫర్లేదు"

"ఎందుకు దొరకవుగాని అమ్ముతారో లేదో"

"అందుకేగా నిన్ను పెట్టుకునేది. ఎలా ఒప్పిస్తావో నాకు తెలియదు. ఏదైనా సరే కొనుక్కుంటాం"

"ఎందుకండి బాబూ! ఆ దరిద్రమంతా ఆ మంచాలూ అవీ చెడిపోయుంటాయి. ఎక్కడ పెట్టుకుంటాం ఇవన్నీ. ఇంతకూ ఈ పాత సరుకెందుకండి పాత పేపర్లు అమ్ము కునేవాళ్లలా"

ఏ.ఎన్ నవ్వాడు.

"అవన్నీ ఎందుకో తర్వాత చెబుతాను. ఇప్పటినుంచి నువ్వు అన్ని విషయాలూ తెలుసుకోనవసరంలేదు. ఇప్పుడు రోడ్డు పక్కన మిఠాయిలు అమ్ముకున్నావనుకో నిన్నేమంటారు. అదే తిరుపతిలో లడ్లు అమ్మితే భక్తి అంటారు. ఇదే మిఠాయిని ఫైవ్‌స్టార్ హోటల్లో అడిగితే స్పెషల్ స్వీట వుతుంది. అందుకని పేపర్లు అమ్మటం, కొనటం చేసేది పెద్దవాళ్లే. ఏరుకొచ్చేది మాత్రమే చిన్నవాళ్లు"

"అవుననుకోండి. ఈ వూర్లో ఇదే గొడ వండి. మాట్లాడటం చేతకాదండి. ఏదో చెప్పబోయి ఇంకోటి చెప్పేస్తామండి" అన్నాడు చేతులు నలుపుకుంటూ.

"మెల్లగా నేర్చుకుందువుగానీ. నేను చెప్పింది చేస్తావా? "

"అలాగేనండి"

"మాట్లాడి పెట్టు. ఎప్పుడు కొనేది తర్వాత నీకు చెబుతా" అన్నాడు.

★ ★ ★

వీక్లీ ఎడిటర్ ఎదురుగా సూర్య కూర్చు న్నాడు.

"వచ్చిందగ్గర్నుంచి ఆలోచిస్తున్నాను బాస్. దీని వెనుక చాలా పెద్ద ప్లానుంది. గవర్నమెంటునుండి భారీ ఎత్తున డబ్బు లాగే ప్రయత్నం అనుకుంటాను"

"అది సరే నవల ఎంతవరకు వచ్చింది? ''

"ఇంకా మొదలు పెట్టలేదు"

"బహుశా మొదలు పెట్టలేవేమో అను కుంటా"

"అదేంటి అలా అన్నారు"

"అవును వాళ్లు ఏదో చేస్తారనేదే నీ ఆలో చన. పోనీ ఓ పని చెయ్యరాదూ... వాళ్ల భూషణాన్నీ, భోషాణాన్నీ మాకు చూపిం చారు. నువ్వు కూడా ఓ బొంగునీ భోగేశ్వ రావునీ చూపించు ఆర్టికల్ రాస్తాం"

"అది కాదు..."

"చూడు సూర్యా! ప్రతి రంగంలో ఏదో విశేషముంటుంది. మన జర్నలిజంలో విశే షాలు లేవా? నువ్వు ఏం చేస్తున్నావనేది కావాలిగాని, అది విడిచిపెట్టి పక్కవాడికి ఎంత లాభం వచ్చింది అని చూస్తున్నా వంటే నువ్వెక్కడా స్థిరపడలేవు. చాలా బ్యాడ్ హాబిట్ అది. నువ్వు ఇంకో నవల రాద్దువుగాని. ఈ నవల వేరే వాళ్లతో రాయించుకుంటా"

"భలేవారే! నేనే రాస్తాను"

"నాకు ఇన్‌వాల్వ్‌మెంట్ కావాలయ్యా! రేపీ నవల సక్సెస్ అయితే నీకెంత పేరూ, డబ్బూ వస్తుందో అనుకుంటే ఆ ఛాన్స్ నీకెందుకివ్వాలి"

సూర్య ఆశ్చర్యంగా చూశాడు.

"ఇది లైటర్‌వీన్‌గా కనిపిస్తున్న సీరియస్ మేటర్. నా వరకు అంతే. దానివల్ల వచ్చే లాభనష్టాల విషయం నాకనవసరం అని నేననుకుంటున్నా. ఓకే నాకు పనుంది" అన్నాడు.



"సారీ బాస్. నన్ను క్షమించు. నా తల చెడిపోయింది. ఎంతసేపటికీ ఆ రూట్లోనే ఆలోచించాను. ఇంతకీ వార్త ఎప్పుడు రాబోతోంది"

"రేపు ఉదయం"

"మనం ఈ సాయంకాలం కూర్చుందాం. మొదటివారం మేటర్‌ని తయారుచేసుకొస్తాను" అన్నాడు.

"అలాగే"

సూర్య వెళ్లిపోయాక సిగరెట్ వెలిగించాడు.

"నా కొడుకా... రేపు నా ఆదాయం ఎంతొస్తుందా అని ఆరాతీసే రకంరా నువ్వు" అనుకున్నాడు.

అంతకుముందే భూషణం ఫొటో వచ్చింది.

ఏం కాప్షన్ పెడితే బాగుంటుందా అని ఆలోచిస్తున్నాడు.

డైలీలో మాటర్ రెడీ అయింది...

"ఈ భోషాణం ఎన్ని వందల సంవత్సరాల నాటిదో మీరు చెప్పగలరా? "

ఇదీ మకుటం.. ఓ పక్క భూషణం ఫొటో వేశారు. అయిదారు కోణాల్లో భోషాణం ఫొటోని ముద్రించారు.

పత్రిక విడుదలైందో లేదో ఇన్‌ఛార్జ్ ఇంట్లో ఫోన్ మోగింది.

"ఏం గురూ ఆర్టికల్స్ రాసుకునేది నువ్వొక్కడివేనా? " అన్నాడు వేరే పత్రిక జర్నలిస్ట్.

"లేదు భయ్. ఇదేమంత గొప్ప విషయం కాదుకదా! అందుకని చెప్పలేదు"

"అయినా కూడా మేమూ వచ్చేవాళ్లం కదా బాబూ. కోడ్ ఆఫ్ కాండక్ట్ మరిచిపోతే ఎట్లా? "





"ఇప్పుడు మాత్రం పోయిందేముంది. ఇదేం హాట్ హాట్ స్కూపేంకాదు"

"అర్థమైందిలే. అయినా వార్తలేం లేవా? ఇలాంటివి మొదలుపెట్టావ్"

"సిటీ బోర్‌కొట్టి రెండు రోజులు బయట కెళ్లొచ్చాను. అయినా మీరు పెద్ద జర్నలిస్టులు. ఇలాంటి చిన్నచిన్న వార్తల్ని విశేషాల్ని గుర్తించరుగా"

"కానీ ఏదో ఒకటి చెప్పు. ఏ వార్త ఎప్పుడు పేలుతుందో ఎవడికి తెలుసు. ఓకే నాక్కూడా ఆ భోషాణం ఎన్ని వందల సంవత్సరాల నాటిదో తెలుసుకోవాలనుంది" అన్నాడతను.

"ఆర్టికల్ ఇంట్రెస్ట్‌గా చదవాలని అలా రాశాం"

"ఏమి రాయటమో ఏమిటో ఇకనుంచి ఆ భూషణంగారిని ప్రశాంతంగా వుండనియ్యవనిపిస్తోంది"

"అదేంటలా అన్నారు"

"అవునుమరి... దేశంలో ఎన్నికల హడావుడి లేదు. బొంబాయి నగరంనుండి అన్ని చోట్లా లాండ్ ధరపడిపోయింది. రౌడీలందరూ పనిలేక ఖాళీగా కూర్చున్నారు. భూషణంగారి ఇంట్లో లంకెలబిందెలున్నాయని ఓ స్కూప్ వదిలితే నాలుగు నెలలు అక్కడే కాపురం పెడతారు"

ఇన్‌ఛార్జ్ బిగ్గరగా నవ్వాడు.

"ఓకే మొత్తంమీద చేయి తిరిగిన జర్నలిస్ట్‌వి. కాదేదీ వార్తకనర్హం అని ఇంకోసారి నిరూపించావ్. కాకపోతే ఇంక మనాళ్లంతా ఇలాంటి ఆర్టికల్స్‌మీద పడతారేమోనని భయంగావుంది"

"కానీండి.. అయినా మన రాజకీయ నాయకులు దేశాన్ని ప్రశాంతంగా వుండనిస్తారా.. వుంటాను" అని ఫోన్ పెట్టేశాడు.

"ఎవరండీ" అంటూ వచ్చింది వాళ్లావిడ.

"జర్నలిస్ట్. ఈ భోషాణం ఆర్టికల్ గురించి మాకెందుకు చెప్పలేదంటాడు.

మామూలుగా అయితే అందరం కలసి వెళ్తాం. చాలామంది జర్నలిస్టులు నవ్వుకుంటారు"

"దేనికి నవ్వుకోవటం"

"వార్తలేం దొరకనప్పుడు మున్సిపాలిటీల మీద, పెరుగుతున్న దోమల మీద రాస్తుంటారు"

"మీ దృష్టిలో అవి సమస్యలు కాదా" అందామె.

"వార్త అంటే సంచలనం కలిగించాలి"

"అలాగా.. ఇదికూడా కలిగిస్తుందేమో! చూద్దాం" అందామె.

★ ★ ★

ఏ.ఎన్ దినపత్రికలో విషయం చదువుతుంటే భూషణం గంభీరంగా వింటున్నాడు. మధ్యలో చిరునవ్వులు చిందిస్తున్నాడు.

"ఏమాటకామాట చెప్పుకోవాలి ఫొటోలు అదిరిపోయాయి" అన్నాడు సూరి.

"ఇప్పుడేం చూశారు. మన తాతల కాలంలో వైభోగాలు చూడాలి. ఆ రోజులు మళ్లీరావు... ఆ వైభోగాలు వాళ్లతోనే పోయాయి" అన్నాడు.

"లేదు అగ్రజా! ఆధునిక కాలంలో వాళ్లను మించిన వాళ్లెందరో వున్నారు. మీరెప్పుడైనా సుల్తాన్ ఆఫ్ బ్రూనై పేరు విన్నారా? "

"లేదు" అన్నాడు భూషణం.

"బ్రూనైలో సుల్తాన్‌కి విశాలమైన భవంతి వుంది. అందులో వెయ్యా, ఏడు వందల ఎనభయ్యొనిమిది గదులున్నాయి. ఇంక తోటలూ రకరకాల ఫర్నిచర్, కళాఖండాలు ఒకటికాదు అదో విచిత్ర ప్రపంచం. ఆయనకి ఇద్దరు భార్యలున్నారు. అయితే ప్రపంచంలో అందాలు ఎక్కడున్నాయా అని ఎందరో ఏజెంట్లు వెతుకుతుంటారు. అలాంటి వారిని నయానో భయాన్నో ఆయన దగ్గరికి తరలిస్తారు. ఆయన దగ్గర ఓ నెల రోజులుంటే చాలు కోటీశ్వరులయిపోతారు"

సూరి నోటిమీద వేలువేసుకొని వింటున్నాడు.

భూషణం కళ్లల్లో కూడా ఆశ్చర్యం.

మన పెద్దవాళ్లు మహా అయితే ఈ పరగణాలో రాజ్యం చేసేవారు. ఆయనలా కాదు. మొత్తం ప్రపంచదేశాల్లో ఎక్కడ అందాలున్నా అతని దృష్టి అటువెళ్తుంది"

"అబ్బా. ఏమాత్రం ఆదాయం వుంటుందేమిటి? " అన్నాడు

"నెలకు నలభై బిలియన్ డాలర్లు"

"అంటే"

"కొన్ని కోట్ల రూపాయలు"

"ఎట్లా వస్తాయండి'

"వాళ్లకి ఆయిల్ బావులున్నాయి. ఇంకా ఖషోగ్గి అనే ఆయుధాల వ్యాపారున్నాడు. ఎన్ని విమానాలున్నాయో, బంగారం, వజ్రాలు ఇంకా విశాలమైన భవంతులు, వాళ్లకే తెలియనంత డబ్బు. వీళ్లందరూ అందాల్ని అనుభవించటానికి పోటీ పడుతుంటారు"

"అవును మరి. ఏం చేస్తారు. డబ్బులు విరజిమ్మేస్తారు. అయ్యా ఆయనగారినోసారి చూడచ్చా? "

"ఎందుకు చూడకూడదు. పత్రికల్లో ఆయన గురించి రాసినప్పుడు ఫొటోలు వేస్తారు. అప్పుడు చూడొచ్చు"

"అవునులెండి. దున్నపోతులాంటి మగాడ్నయిపోయాను. లేకపోతే సుల్తాన్‌గారి దగ్గరకెళ్లేంత అందమైన ఆడపిల్లనయితే రెండు బస్తాల బంగారం, ఓ బస్తాడు వజ్రాలూ తెచ్చుకునేవాడ్ని"

"ఏం చేసుకుంటావయ్యా" అన్నాడు భూషణం.

"అదేంటండి అట్టా అంటారు. కిరీటం చేయించుకుని తలమీద పెట్టుకుంటానండి" అన్నాడు.

అందరూ నవ్వుకున్నారు.

నాలుగు రోజులు గడిచిపోయాయి. ఏ.ఎన్ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. సిటీకెళ్లి వద్దామా అనుకున్నాడు. ఈ భోషాణాన్ని వీడియో తీయించి కేబుల్ నెట్ వర్క్ ద్వారా రాష్ట్రమంతా ప్రసారం చేయించుదాం అనుకున్నాడు.

ఆ ఉదయం మొదలైంది సంబరం.

ఓ బస్సు వచ్చి ఆగింది. అందులో నల భైమంది యువతీ యువకులు ఉన్నారు. గోలగోలగా కబుర్లు చెప్పుకుంటూ వచ్చారు.

"సార్ భూషణంగారిల్లు ఎక్కడ"న్నారు.

ఆ గ్రామంలోకి ఈ వార్త పాకిపోయింది.

అందరూ భూషణం గారింటి దగ్గరికి చేరి ఏం జరుగుతుందా అని చూడటం మొదలు పెట్టారు. ఏఎన్ ఆ స్టూడెంట్స్ అడిగిన ప్రశ్నలకి ఓపికతో జవాబు లివ్వటం మొద లుపెట్టాడు.

సూరిబాబు నాలుగు లీటర్ల పాలు తెచ్చు కుని ఇంటిముందు టీస్టాల్ తెరిచాడు.

భూషణం గారితో వచ్చిన వారందరూ ఫొటోలు దిగారు.

వారందరూ వెళ్లిపోయాక... "ఇదేంటి బాబూ తిరనాళ్లలాగుంది" అన్నాడు సూరి.

"పత్రికలో వార్త వచ్చిందికదా చూడటా నికి వచ్చారు"

"ఆళ్లుసరే ఊరి జనమంతా అదిరిపోయా రండి. నేను టీ బంకు పెట్టేస్తానండి. ఇడ్లీలూ, బజ్జీలు కూడా ఏసుకుంటానండి"

"రోజూ అంతమంది ఎందుకొస్తారయ్యా"

"పాతిక మందొచ్చినా చాలుకదండి" అన్నాడు.

"అదిసర్లే. నువ్వు చేయాల్సిన పనులు చాలావున్నాయి" అన్నాడు ఏ.ఎన్.

మరుసటి రోజునుంచి కొన్ని ఉత్తరాలు రావటం, కొంతమంది వ్యక్తులు రావటం జరిగింది.

పది రోజుల తర్వాత ఓ ఛానల్ వారి వాహనం వచ్చి ఆగింది. అందులోనుండి కెమేరాలు దిగాయి. లైట్స్ దించారు. ఇంక అక్కడినుండి సూరిబాబు హడావిడికి అంతులేకుండా పోయింది.

"మనూర్లో సిన్మా తీస్తున్నారు" అని చెప్పేడు.

చాలామంది పనులు మానేసుకుని ఆ చుట్టుపక్కల చేరి వింతగా చూస్తుండిపో యారు.

రోజంతా వాళ్లు అక్కడే వుండి మొత్తం కార్యక్రమాన్నంతా షూట్ చేసుకున్నారు.

నాలుగు రోజుల తర్వాత దాన్ని టెలికాస్ట్ చేశారు.

ఇంక అక్కడినుండి రద్దీ మొదలైంది.

"సోదరా మాకు చాలా ఆశ్చర్యంగా వుంది. కేవలం పేపర్లో ప్రకటించటంవలన ఇంత సంచలనం కలుగుతుందా? " అన్నాడు భూషణం ఆశ్చర్యపోతూ.

"అవును అగ్రజా. పత్రికలవారు తలుచు కుంటే ఏ అద్భుతాన్నయినా చేయగలరు. అట్లానే ఎవరినైననూ పీకి పాకం పెట్టగ లరు. ప్రస్తుతకాలంలో అత్యంత శక్తివంత మైన ఆయుధం ఇదే"

"ఏమిటో మాకునూ వినోదముగా వున్నది. అదేమిటో ప్రజలు తండోపతండ ములుగా వచ్చుట బాగుగానే వున్నది గాని, పత్రికలవారున్నూ, ఆకాశవాణివారూ, దూర దర్శనులవారూ వచ్చిన బాగుండుననిపి స్తోంది. ప్రతి దినమూ వార్తలలో కనిపించ వలెనన్న కోరిక తాజాగా మమ్ములను పీడిం చుచున్నది. దానికి మార్గం చెప్పండి"

ఏ.ఎన్.కి నవ్వు వచ్చింది.




"మీరు రాజకీయాల్లో దిగి ముఖ్యమంత్రి వర్యులో, కనీసం ప్రతిపక్ష నాయకులో అయితే వార్తలలో వుండుటకు అవకాశం వుంది"

"రాజకీయములు మన శరీరమునకు సరి పడవుకదా"

"అవును. అయినా మన వంశం ఏమిటి? ప్రతిదినమూ పత్రికలలో కనిపించుటకు మనము అధములం కాదుగదా. పెద్దపెద్ద పత్రికలలో, ఛానల్స్‌లో అలా మెరుపులా అప్పుడప్పుడు మెరిస్తేనే బాగుంటుంది"

"అవును సోదరా... కించిత్ చిత్త చాంచల్యం"

"మనిషికది అవశ్యం అగ్రజా..." అన్నాడు. ఏ.ఎన్. భూషణం దగ్గర "ఇప్పుడే వస్తానని" చెప్పి సూరిని కలిశాడు.

"నేను చెప్పింది ఎంతవరకు చేశావ్"

"మనాడికి చెప్పానండి" అన్నాడు.

"మనాడా... ఆడెవడు? "

"అదే నా ఫ్రెండండి. ఎక్కడ ఏ మూల్లో ఏవున్నా సిటికెలో ఆడికి తెలిసిపోద్దండి"

"అది కాదయ్యా ఇలాంటి విషయాలు బయటి వాళ్లకి తెలియకూడదని చెప్పాను కదా"

"చెప్పారండి. ఆడు నా బామ్మర్దిగాడండి"

"అంటే విడిచిపెట్టి వెళ్ళిన"

"అవునండి"

"ఇంతకు ముందు ఫ్రెండన్నావ్"

"అవునండి. ఆళ్ళక్క నన్ను వదిలేసినా, ఈడు మాత్రం నన్ను వదల్లేదండి"

"అట్లయితే నేను విడిచేస్తున్నా"

"అంత మాటనకండి. కాళ్ళట్టేసుకుంటన్నా"

"లేకపోతే ఏంటయ్యా... ఆడు ఆడి బావమరిదికి చెబుతాడు. ఇట్లా వూర్లన్నీ పాకితే ఎట్లా? "

"తప్పేనండి" అన్నాడు సూరి.

"చూడు సూరీ నీకు నేను చాలా చేయాలనుకుంటున్నా. ఏం చేస్తానో నువ్వు చూడు. అందుకు కొంచెం టైం పడుతుంది. ఈలోపు నువ్వు ఇలాంటి పనులు చేశావనుకో నేను ఇంకొకరిని చూసుకోవాల్సి వస్తుంది"

"అయ్యయ్యో... ఇంక అంత మాట అనొద్దు"

"సరే... నువ్వు సిటీకి వెళ్ళి రాగలవా? "

"వెళ్లొస్తానండి"

"అయితే నీకు చీటీ రాసిస్తాను. ఆ పుస్తకం వస్తే నువ్వు తీసుకురావాలి"

"తప్పకుండానండి"

"ఇంకా కొన్ని వస్తువులు కూడా తీసుకురావాలి. అన్నీ లిస్ట్ రాసిస్తాను" అన్నాడు ఏ.ఎన్.

'సూరి'ని హైదరాబాద్ పంపించాడు.

పైకి బాగానే మాట్లాడుతున్నా ఎందుకో అతనికి డౌట్‌గా వుంది. ఇదంతా అనుకున్నట్లుగా జరుగుతుందా? జరగదా? దీని పరిణామాలు ఏవిధంగా వుంటాయి?

ఆ రాత్రి తన గదిలో కూర్చుని అప్పటివరకూ జరిగిన ఖర్చులన్నీ లెక్కచూసుకున్నాడు. తనదగ్గర మిగిలిన డబ్బును లెక్క పెట్టుకున్నాడు.

"లెటజ్ వెయిట్ అండ్ సీ" అని నవ్వుకున్నాడు.

ఉదయం ఇంకా నిద్రపోతుంటే భూషణం లేపుతున్నాడు.

"సోదరా... నిద్రలేవండి"

ఉలిక్కిపడిలేచాడు ఏ.ఎన్.

"మనకోసం ఎవరో స్వాములవారు వచ్చారు"

"స్వాములవారా? " అన్నాడు ఆశ్చర్యంగా.

"అగ్రజా... పది నిముషాల్లో వచ్చేస్తున్నా" అంటూ లేచి బాత్‌రూమ్‌కి వెళ్ళాడు. కాల కృత్యాలన్నీ పూర్తిచేసుకొని వచ్చేసరికి ఓ. నడి వయసు వ్యక్తి కనిపించాడు. గడ్డం బాగా పెరిగివుంది. నుదుట బొట్లుపెట్టాడు. దబ్బ పండులాంటి శరీరం. చూపు చాలా నిశి తంగా వుంది. దగ్గరకు వెళ్ళగానే,

"వీరు మా సోదరులు... నామధేయం 'ఆధునిక్'. క్లుప్తంగా 'ఏ.ఎన్' అనే పొడి అక్షరాల్ని సంభోదిస్తే పలుకుతారు"

ఆయన చిరునవ్వు నవ్వారు.

ఏ.ఎన్. ఆయనకి నమస్కరించాడు.

"పేరు బాగుంది నాయనా" అన్నాడు.

"థాంక్యూ సర్" అన్నాడు ఏ.ఎన్.

"మాకున్నూ మీ భోషాణమును తిలకించ వలెనన్న కోరికగా వున్నది"

"దాందేముంది. రండి" అన్నాడు.

భూషణం ముందు నడవగా స్వామిజీ ఆ గదిలోకి వెళ్ళి భోషాణాన్ని చూశాడు. నాలు గుదిక్కుల నుండి పరికించి చూశాడు. ఏవేవో లెక్కలు గుణించుకున్నాడు. అటుపి మ్మట చిరునవ్వు నవ్వాడు.

"పదండి నాయనా" అన్నాడు.

అందరూ వచ్చి కూర్చున్నాక చెప్పాడు.

"మీ పూర్వవైభవములన్నీ తరిగిపోవుటకు కారణం ఈ భోషాణమే" అన్నాడు. భూషణం షాక్ తిన్నాడు.

"అదేమి స్వామీ అట్లా అన్నారు"

"అవును నాయనా... ఏ ముహూర్తంలో దీనిని తయారుచేయించారో అది దుర్ము హూర్తం. అందుకే ఇది ఏ ఇంట వుంటుందో ఆ ఇంట వినాశములూ, విపరీ తములూ జరుగును. ఈ 'భూషణ' నామ ధేయం కూడా అటువంటిదే. తక్షణము మీ పేరును మార్చుకొనిన బాగుంటుంది. అంతి యేకాదు. మొత్తంగా ఈ గృహమే వాస్తువి రుద్ధముగా నిర్మించినారు. దీనిని పూర్తిగా నిర్మూలనం చేసి కట్టించుకుంటే బాగుం టుంది. అధమం కొన్ని రిపేర్లూ లేదా చిన్న చిన్న మార్పులు చేయిస్తే చాలా బాగుం టుంది. కొన్ని గ్రహశాంతులు కూడా చేయించాలి" అన్నాడు స్వామి.

"అదేమిటి భోషాణమునకు ఇంత పవ రుంటుందా" అన్నాడు భూషణం.

"ఎంతమాట. ఇటువంటి వాటిని 'యాంటిక్స్' అంటారు. నువ్వు చరిత్ర చదు వుకుంటివా నాయనా"

"చదువుకున్నాం. మా వంశచరిత్రని"

"మీ వంశమేకాక ప్రపంచమున అనేకా నేక గొప్ప వంశములున్నాయి నాయనా. ముఖ్యంగా వజ్రములు, కత్తులు, కొన్ని చిత్ర ములు ఇవి బలికోరును. అవి ఎవరి దగ్గ రుండిన వారికేకాక ఆ చుట్టుపక్కలవారికి, ఆ దేశమునకు కూడా అరిష్టమే. దేశము లకు దేశములే ఇలాంటి 'యాంటిక్స్' కొరకు యుద్ధములు చేసుకున్న సందర్భములు న్నవి. అంటే యుద్ధములకు కేవలం ఆడు వారే కారణం కాదు. ఇలాంటి వస్తువు లున్నూ కారణమే" అని చిరునవ్వు నవ్వాడు.

"అట్లయిన ఈ భోషాణమును తక్షణమే నాశనం చేయుమందురా? "

అతను గంభీరంగా తలవూపాడు.

ఏ.ఎన్. మాత్రం ఆయన్ని సునిశితంగా గమనిస్తున్నాడు.

"ఒక్క భోషాణము ఏమిటి సోదరా... స్వామివారి మాటల ప్రకారం మొత్తం ఇంటినే కూల్చివేయవలెను. అవునుకదా స్వామి"

"కూల్చిన బాగుండును... లేదా రిపేర్లు"

"ఒక్క నిముషం స్వామిజీ... అగ్రజా ఇటురండి. మన గదికి వెళ్ళివచ్చేదం" అన్నాడు ఏ.ఎన్.





గదిలోపలకు వెళ్ళగానే భూషణం అడి గాడు.

"ఇదేమి సోదరా ఇంతటి ధర్మసంకటం తెచ్చినాడు"

"ఇలాంటి హర్డిల్స్ వస్తుంటాయి"

"అనగానేమి? "

"పరుగుపందెంలో అడ్డంగా పెడుతుం టారు వేగాన్ని నిరోధించటం కోసం. మొత్తంగా ఈ ఇంటిని కూల్చినచో ఏమ గును అగ్రజా"

"మనకు నిల్వనీడవుండదు"

"అంతియేకాదు. మనంసైతం స్వామివారి వలె మీసములూ, గడ్డములూ పెంచి వాస్తు శాస్త్రమును అభ్యసించవలసివచ్చును"

"నాకు బోధపడుటలేదు సోదరా"

"చూడండి అగ్రజా... మీరు నిమిత్తమా త్రులు. మీరు సాధారణ మానవులు కాదు. మిమ్ములను వైభోగములుగానీ, కడు దరి ద్రంగానీ లోబరుచుకోలేవు. ఈ విషయ మును సదా మీ దృష్టిలో వుంచుకోండి. కొన్నివందల సంవత్సరాలక్రితం కట్టిన ఈ ఇంటిలో సమస్త వైభవాలు ఒకనాడు చోటు చేసుకున్నాయి. ఆనాడు లేని వాస్తుదోషము ఇప్పుడు ఎలా వస్తుంది. స్వామివారితో నేను మాట్లాడి పంపిస్తాను. మీరు మాత్రం ఈ గదిలో విశ్రాంతి తీసుకోండి" అన్నాడు ఏ.ఎన్.

"అంతేనంటారా సోదరా? "

"అగ్రజా మీకు అలంకారం మీ నామధే యమే. ఈ దేశానికే మీరు 'మణిభూషణం' లాంటివారు. అతని మాటల్ని పట్టించుకో వద్దు"

"అలాగే... మేం మిమ్మల్నే విశ్వాసంలోకి తీసుకుంటున్నాం"

"ధన్యుడ్ని" అని వంగి అభివాదం చేశాడు.

అక్కడనుండి వచ్చేటప్పటికి స్వామి ఆ ప్రాంతాన్ని మింగేసేటట్టుగా చూస్తున్నాడు

"భూషణంవారేరీ" అన్నాడు స్వామి.

"శిరోభారం"

"ఇంతకుముందు బాగుగానే వున్నారు కదా"

"అవును... భోషాణం దెబ్బ... గుండెకి పాకునేమోనని భయం"

"నిజమే ఆధునిక్. ఈ భవంతిని విడిచి పెట్టి వెళ్ళవచ్చునే"

"చూడండి స్వామిగారూ. మా అగ్రజుడికి వుందే ఈ ఇల్లు. ఇది విడిచిపెడితే రోడ్డు మీద కాలక్షేపం చెయ్యాలి. అందుకని అది జరగదు. కూల్చాలన్నా కనీసం 'వాస్తు' ప్రకారం ఎడ్జస్ట్‌మెంట్లు చేయాలన్నా చేతిలో నయాపైసా లేదు కాబట్టి అవీ సాధ్యంకావు. ప్రస్తుతం మా 'సూరి'బాబు కూడాలేడు"

"అతనెవరు నాయనా"

"ఈ వూరివాడే. కోడి బిరియానీ బాగా తయారుచేస్తాడు"

"అలాగా" అని ఆలోచించాడు.

"ఆ భోషాణము గురించి ఆలోచిస్తుంటే దిగులుగా వున్నది"

"దాని గురించి మరిచిపొండి... మేము ప్రభుత్వానికి అందచేస్తాం"

"అది కూలిపోతుందే"

"పోనీ సెంట్రల్ గవర్నమెంట్‌కిస్తాం"

"అది మాత్రం నిలుస్తుందా నాయనా? "

"పక్కదేశములకు పంపిస్తాను"

"మిలటరీ పాలన వస్తుందే"

"అట్లయిన ఏమి చేయుదము స్వామి"

"దాని గురించి ఆలోచించవలెనంటే మేము యోగసమాధిలోకి వెళ్ళాలి. గతం అప్పుడు మా కళ్ళముందు 'సినిమా' రీలులా తిరుగుతుంది"

"నిజమా... మీకు అన్ని అద్భుత శక్తులు

న్నాయా? "

"నాకు కాదు. యోగమునకున్నది. మేము కళ్ళు మూసుకుంటే పూర్వాశ్రమంలో మీరు ఎవరో తెలిసిపోతుంది"

"పూర్వాశ్రమంలోనా? "

"అదే పూర్వజన్మలో. అలాగే ఈ భోషాణమునకు వాడిన కలప ఏ వృక్షమునుండి గ్రహించబడిందో చూస్తాం. ఆ వృక్ష చరిత్ర ఏమిటి? దానిమీద పక్షులు నివసించినవా? బ్రహ్మరాక్షసులు నివసించినారా? ఎవరైననూ ఆ చెట్టుకి ఉరిపోసుకున్నారా? లేదా ఆ చెట్టునకు కట్టేసి ఎవరినన్నా హత్య చేసినారా? ఈ విషయములు తెలిస్తే భోషాణములోని సర్వదోషములు మన కళ్లముందుంటాయి"

"ఆహా! ఇంకెందుకు ఆలస్యం కళ్ళు మూసుకుని యోగసమాధి'లోకి వెళ్ళండి"

"దానికి ముందు చాలా తతంగం జరగాలి నాయనా. యజ్ఞం చేయాలి"

"చూడండి స్వామిగారూ, లోక కల్యాణం కోసం ఈ పనులన్నీ మీరు చేస్తే చేయండి. మా భూషణాన్నిగానీ, నన్నుగానీ, అడ్డంగానూ, నిలువుగానూ లేదా మూలగానూ కోసినా ఎటువంటి ఉపయోగంలేదు. చిల్లిగవ్వ రాలదుగాక రాలదు" అన్నాడు ఏ.ఎన్.

"అయితే దరిద్రం భరించటానికే సిద్ధపడుతున్నారా? "

"అంతకంటే ఏం చేయమంటారు? "

"పోనీ ఆ భోషాణం మాకు దానం చెయ్యండి"

"అదెందుకు స్వామీ. అనర్థములు వాటిల్లును. మీరు చక్కగా జ్యోతిష్యమూ, వాస్తు శాస్త్రమూ, పురాణపఠనమూ చేసుకోక ఈ దరిద్రాన్ని ఎందుకు కోరుకుంటారు? "

"అలా అనకు సోదరా... శివుడు గరళాన్ని ఎందుకు మింగాడు. లోక కళ్యాణం కోసం. అటులనే మేం కూడా"

"మీకంత కష్టం రాకూడదు"

ఆయన కొంచెంసేపు ఆలోచించాడు.

"అంత బిల్డప్ ఇచ్చారు. నేను చాలా ఆశించివచ్చాను" అన్నాడు డైరెక్ట్‌గా విషయంలోకి వస్తూ.

"స్వామిగారూ మీకు చెప్పదగిన వాడిని కాదు. ఆ మాత్రం బిల్డప్ ఇవ్వందే మీ దృష్టి ఇటుపడదుగా. పూర్వాశ్రమంలో మీరు ఉద్యోగస్థులని నాకు తెలుసు. అది ఏమాత్రం గిట్టుబాటుకాక నూతన అవతారందాల్చారు. ఇది మీకు బాగుగానే వున్నదని మేమెరుగుదుం. సూటిగా చెప్పాలంటే ఏ ఇండస్ట్రియలిస్టుల్నో పొలిటికల్ లీడర్లనో పట్టుకో... డబ్బు అక్కడ వుంది? "

"మనం కొత్తగా దిగాంకదా"

"లాంగ్వేజ్ బానేవుంది. మంచి ఫ్యూచరుంది"

"మీతోనే ఆరంభించనీండి'' అన్నాడు స్వామి.

"తంతే పైసా రాలదని చెప్పాను కదా"

"మీరూ, భూషణం, భోషాణం అరిష్టమని ఈ గ్రామానికి చెప్పాననుకోండి. మాట వరసకంటున్నా"

"నేను కూడా మాటవరసకే చెబుతున్నా. 'సూరి'బాబు అయిదు మర్డర్లు చేశాడు. నేను చెయ్యను. నిమిత్తమాత్రుడ్ని కదా"

"భూషణంగారితో మాట్లాడాలి"

"ఇంకేం మాట్లాడతావ్. ఆయనమాట పడిపోయేట్టు చేశావ్‌గా" అన్నాడు ఏ.ఎన్.

"చాలా ఖర్చులయిపోయాయి"

"ఈ ముక్క అన్నావని భూషణంగారికి చెబితే శిరోజాల్తో నిన్ను ఉరితీస్తాడు. ఆయనకి పోయేదేం లేదు నాలుగువెంట్రుకలు తప్పించి"

"అంతా ఒన్ సైడ్" అన్నాడతను.





"ఉన్నదాంతో సుఖపడటం నేర్చుకో. నీకు నేనిచ్చే సలహా యిదే"

అతను ఏ.ఎన్‌కేసి కోపంగా చూశాడు.

"ఓ వందన్నా కొట్టండి"

"కొరడాతోనా? చెర్నాకోలతోనా? "

"అంత హీనమైపోయామా? "

"నీక్కావాలంటే ఇంకో సహాయం చేయగలను భాయ్. భాగ్యనగరంలో 'సూర్య' అనే రచయిత వున్నాడు. అతని అడ్రస్ ఇస్తాను. పది రోజులు కూర్చుని ఆయన్తో మాట్లాడావంటే వందేం కర్మ పదివేలు కొడతాడు"

"ఆ అడ్రసిలా తగలేయండి" అన్నాడు స్వామీజీ.

అతను వెళ్ళగానే భూషణం గదికి వెళ్ళాడు.

"ఏమంటున్నారు స్వామీజీ" అన్నాడు భూషణం.

"ఇంకెక్కడస్వామి. పారిపోయాడు"

"నిజంగానా? "

"అవును అగ్రజా. మనదగ్గర ఏమైనా రాల్చుకోవాలనొచ్చాడు. అది వీలుకాదని చెప్పాను. బెదిరించబోయాడు. మనకి జైలు కొత్తకాదని చెప్పా"

"అదేమి సోదరా, ఆ అనుభవం కూడా వున్నదా? "

"ఇన్ని సంవత్సరాలుగా మీరు ఈ ఇంటిలో ఏకాంతంగా జీవించలేదా? జైలు అన్న ఇదికాక మరేమిటి? మేమూ అలాంటివాళ్ళమే"

"అవునవును. బాగా చెప్పారు. బహుశా మాకు చెడ్డదినములు ప్రాప్తించుటకు కారణం ఇటువంటి దుష్టస్వాముల సలహాలను మా పెద్దలు ఆచరించుట కావచ్చును'' అని బాధపడ్డాడు.

"అగ్రజా... ఇంతకు ముందు చెప్పినట్లుగా మీరు నిమిత్తమాత్రులు" అన్నాడు.

"అవును" అన్నాడు భూషణం.



'ట్రెడిషన్' పత్రికను తీసి చూశాడు ఏ.ఎన్.

'RARE ANTIQUE'

రోహిత్ పెట్టిన శీర్షిక అది.

ఆర్టికల్‌ని ప్రెజెంట్ చేసిన తీరు చాలా అద్భుతంగా వుంది.

ముఖ్యంగా ఆ రంగుల ఫొటోలు, సైజు, భూషణం. ఇవన్నీ ఓ ఎత్తయితే ఆర్టికల్ పూర్తయ్యాక సహకరించినవారిలో తన పేరుండటం మరింత ఆశ్చర్యాన్నీ కించిత్ గర్వాన్ని కూడా కలిగించింది.

ముఖ్యంగా అంత సింపుల్ ఇంగ్లీష్‌లో భావయుక్తంగా చెప్పటంలో ఎంతో నేర్పు చూపించాడు రోహిత్. మళ్ళీ చదువుతున్నాడు.

"రామాపురం ఆంధ్రప్రదేశ్‌లో ఓ మారుమూలగ్రామం. మొత్తం వందపై చిలుకు కుటుంబాలు నివశిస్తున్న ఆ ప్రాంతం ఒకనాటి వైభవానికి గుర్తుగా, రేపటికి విచ్ఛిన్నం కాబోతున్న జ్ఞాపకంగా మిగిలి

వుంది. గత వైభవాలకు చిట్టచివరి గుర్తుగా 'భూషణం' వున్నారు. ఆయన్తో మాట్లాడటం ఓ చిత్రమైన అనుభూతి.

ఒకానొక కాలంలో 'కులీన' వంశాల అల వాట్లు, అభిజాత్యం, అలంకరణ పద్ధతులు ఇవన్నీ ఆయనలో చూడవచ్చు వారి గోడ లమీద మొలుస్తున్న రావిచెట్లనుండి వారి ప్రధాన ద్వారం తెరుచుకొని లోపలకి అడు గుపెట్టి విశాలమైన గదిలో మౌనంగా నిల బడ్డ 'భోషాణం'దాకా గతం తాలూకు అనేక విషయాల్ని మౌనంగా చెబుతున్నట్లనిపిం చింది.

ఖచ్చితంగా ఆ భోషాణం ఓ అరుదైన పురాతన సంపద. దాని రూపం, దానికి వాడిన కలప, దానిమీద చెక్కిన బొమ్మలూ వీటన్నింటినీ పరిశీలిస్తే ఆయా కాలాల పద్ధ తులు అర్థంచేసుకోవచ్చు చరిత్రమీద టార్చ్ ఫోకస్ చెయ్యటానికి ఇలాంటివి ప్రాథమి కంగా మారినా ఆశ్చర్యంలేదు. మొత్తం సమాజమంతా క్షణక్షణమూ అభిరుచులూ, ఫ్యాషన్స్ మార్చుకుంటున్న సందర్భం ఇది.

ఫ్రాంక్‌గా చెప్పాలంటే 'భూషణం' సైతం ఓ 'రేర్ యాంటిక్' అతనిలా వుండగల గటం బహుశా అతనొక్కడికే సాధ్యం అను కోవచ్చు. అతని మాటల్లో తొంగిచూసే అంశాలూ, అతని భావాలు తరతరాలుగా వస్తున్న ఆచారాల ప్రతీకలు. భూషణం మంచి చిత్రకారులు కూడా. అతని ఫిలా సఫీ, అతని ఫ్యూడల్ భావుకత, ఇవన్నీ అత నికో వింత అందాన్నిచ్చాయనటంలో సందే హంలేదు.

ఇలాంటి 'యాంటిక్స్'ని భద్రపరచగల స్థితికి ప్రభుత్వం ఇంకా రాలేదు. కానీ గతం పట్ల జిజ్ఞాసకలవారూ, మన ట్రెడిషన్‌ని ఆరాధించే వ్యక్తులు మాత్రం ఇలాంటివాటిని భద్రపరిచే అవకాశాల గురించి అన్వేషిం చాలి. లేకుంటే అవన్నీ చిన్నచిన్న మంచా లుగా, దివాన్‌లుగా, లేదా వంటచెరుకుగా మారిపోయినా ఆశ్చర్యంలేదు.

అభిరుచిగల వారు ఎంత త్వరగా ఈ భోషాణాన్ని చూడగలిగితే అంతమంచిది. ఎందుకంటే బహుశా అది నిన్నటి జ్ఞాపకం కావచ్చు"

ఈ ఆర్టికల్‌తోపాటు ఇంకొన్ని క్లిప్పింగ్స్ ఎక్కడనుంచి సేకరించారోగాని వాటినీ ప్రచురించారు.

భూషణాన్ని కూర్చోపెట్టుకుని చదివి విని పించాడు. తనకు వచ్చినమేరకు అనువ దించి ఇంకొంచెం భావుకతని జోడించి చెప్పాడు.

భూషణం ముఖంలో సంతోషం వెల్లివిరి సింది.

"సోదరా! ఈ ఆర్టికల్‌తో మీరు ఆంధ్ర దేశం, భారతదేశ పరిధులు దాటి విశాల ప్రపంచానికి చేరువయ్యారు. అత్యంత ఆధు నికులనుండి, మల్టీ మిలియనీర్స్ ఇండస్ట్రియ లిస్టులు ఈ ఆర్టికల్ చూస్తారు. వారి పర్స నల్ లైబ్రరీలలో, ఇంటర్‌నెట్‌లో మీరూ, మీ భోషాణం నిక్షిప్తమై వుంటారు. మనకు కనీసం ఫోన్‌గానీ, ఫాక్స్‌గానీ లేవు. అవన్నా వుంటే ఈ ఆర్టికల్‌మీద వచ్చే ప్రతిస్పంద నని మనం తెలుసుకునేవాళ్ళం" అన్నాడు.

భూషణం కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

అది ఆనందమా, దుఃఖమా మరేదైనా భావమో అర్థంకాలేదు ఏ.ఎన్.కి. తనని తాను కంట్రోల్ చేసుకున్నాక అడిగాడు.

"అగ్రజా... నాతోనే మా వంశం అంత మైపోతుందనుకున్నాను. అత్యంత దయనీ యమైన స్థితిలో ఈ ప్రపంచంనుండి నేను నిష్క్రమించగలననుకున్నాను. ఇదంతా నేను ఊహించనిది. ఇది అద్భుతం. ఇన్ని సంవత్సరాలుగా నాతో వుంటూ చీకటిగ దిలో పడున్న భోషాణం సైతం ప్రపంచ ప్రసిద్ధి చెందటం నాకు ఎనలేని ఆనందాన్ని కలిగించింది. మీరు మాకంటే చిన్నవారు అయిపోయారు. లేకున్న చేతులెత్తి నమస్క





రించవలెను"

"అగ్రజా... నేను నిమిత్తమాత్రుడ్ని"

"కాదు... ఇప్పటివరకూ మీరు మా వంశ మువారా అని అనుమానం వుండేది. ఇంతటి దూరదృష్టి, తెలివితేటలు మన వంశములవారికి తప్పించి అన్యులకు వుండవు" అన్నాడు మహోత్సాహంగా.

అతన్ని మరికొంతసేపు ఆ ఆనందంలోనే వుండనిచ్చాడు. అకస్మాత్తుగా భూషణానికి ఏదో గుర్తొచ్చింది.

"సోదరా ఈ పుస్తక ప్రతులు లండన్ వెళ్లునా? "

"తప్పకుండా వెళ్తాయి"

"అట్లయిన 'అఖిల' మమ్ములను చూసే అవకాశము కలదా? "

"ఎందుకుండదు. అటువంటి కుటుం బాలు తప్పనిసరిగా ఇటువంటి పుస్తక ములను చూసి తీరవలయును" అన్నాడు ఏ. ఎన్.

సంతోషముతో వెలిగిన భూషణం ముఖంలో అంతలోనే విషాదం పలికింది.

"లేదు సోదరా. అఖిల మనసు మాకు బాగా తెలుసును. ఆమె దృష్టిలో కొత్తొక వింత. పాత ఒక రోత. వారు ఇలాంటి పుస్తకములను తెప్పించరు. తెప్పించినా చూడరు. ఒకవేళ చూసిననూ మమ్మల్ని చూసి నవ్వుకొనెదరేమో"

"బాధపడకు సోదరా... నవ్విన వారి పళ్లే బయటపడును" అన్నాడు ఏ. ఎన్.

★ ★ ★

రెండువారాలు గడిచిపోయాయి.

చెప్పుకోతగ్గ పరిణామాలు సంభవించ లేదు. చెదురుమదురుగా ఒకరిద్దరు మాత్రం వస్తున్నారు. సూరిబాబు మాత్రం నిరుత్సాహపడిపోయాడు.

"ఇదేంటండి. కొత్తలో జనం అట్టా వచ్చారు. ఇప్పుడు మళ్ళీ ఒక్కళ్ళు కూడా రావటంలేదు. ఎందుకనంటారు? " అనడి గాడు ఏ. ఎన్. ని.

"ఎంత గొప్ప విషయమైనా రోజులు గడి చేకొద్ది పాతబడిపోతుంది. ఇది కూడా అలాంటిదే" అన్నాడు.

"ఇంతకీ ఇదంతా చేసినందుకు మనకొ చ్చిన లాభం ఏమిటండి? "

ఏ. ఎన్. మాట్లాడకుండా తల వూపాడు.

తిరిగి ఆ రాత్రి తన గదిలో ఒక్కడే కూర్చుని ఆలోచించుకుంటున్నాడు. అతిగా అంచనావేశానా అనుకున్నాడు. ఎందుకో ఓటమిని అంగీకరించలేకపోతున్నాడు.

భూషణం దగ్గరకు వెళ్ళి అన్నివిష యాలూ చెప్పేద్దామా అనుకున్నాడు. లేచి గుమ్మందాకా వచ్చాడు. అంతలోనే తమా యించుకున్నాడు. ఆవేశం అనర్థకం అని గుర్తొచ్చింది. ఆగిపోయాడు. గదిలో పచార్లు చేస్తుంటే మరో ఆలోచన వచ్చింది. ఇప్పటికిప్పుడు బయలుదేరి వెళ్ళిపోతే ఏమౌ తుంది? ఏమీకాదు. మా సోదరులు ఎక్కడ అని సూరినడుగుతాడు.

అన్ని గదులూ వెతుక్కుంటారు. తన సూట్‌కేసులు కనిపించకపోయేసరికి వెళ్ళి పోయాడనుకుంటారు. ఎందుకు వచ్చాడు? ఎందుకు వెళ్ళిపోయాడు అని ప్రశ్నల మీద ప్రశ్నలు వేసుకుంటారు. జవాబులు చెప్పు కుంటారు. ఊహాగానాలు చేస్తారు. చేసు కుంటే చేసుకోనీ... తనకేమవుతుంది.

అంతలోనే భూషణం, సూరి గుర్తొచ్చారు. ఈ కొద్దిరోజులలోనే ఓ స్నేహం, ఓ ఆత్మీ యత ఏర్పడ్డాయి. ఇద్దరూ తనమీద నమ్మకం పెంచుకున్నారు. ఇలా గాలికి వది లివెళ్ళిపోవటం బాగుండదు. ఇంక కేవలం మూడు రోజులు మాత్రం తనిక్కడ వుంటాడు. ఈలోగానే ఏదో అద్భుతం జర గాలి. లేదా నో సెంటిమెంట్స్. తను వెళ్ళి పోతాడు. అంతే.

అలాంటి నిర్ణయానికొచ్చాక పడుకున్నాడు.

హాయిగా నిద్రపట్టేసింది.



"సోదరా... మేలుకో... లే... చూడు ఇట్స్రిగ్రేట్ ఎస్టానిష్మెంట్... లే... త్వరత్వరగా" భూషణం చెవిదగ్గర అరుస్తున్నాడు. కళ్ళు మంటలు పుడుతున్నట్లనిపించింది.

"ఒక్క అరగంట నిద్రపోతా" అన్నాడు.

"ఇప్పుడా నిద్ర... నో... లేవాల్సిందే"

విసుగ్గా లేచాడు.

ఎదురుగా 'సూరి' నిలుచున్నాడు.

అతని కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయి వున్నాయి.

"మనింటికి పెద్దకారొచ్చిందయ్యా" అన్నాడు.

చకచకా బాత్రూంలోకి వెళ్ళాడు.

'ఏదో జరగబోతుందని' మనసు సందేశాలు పంపుతోంది.

ముందు భూషణాన్ని కలుసుకున్నాడు.

"అగ్రజా... చిరునవ్వు తప్ప నోరు తెరవద్దు. మీరు"

"నిమిత్తమాత్రులం" అన్నాడు భూషణం.

"మంచిది. నీట్గా డ్రెస్ చేసుకుని రండి"

ఏ.ఎన్. వెళ్ళేటప్పటికి ఛైర్లో కాలిమీద కాలు వేసుకొని కూర్చున్నాడు ఆయన. చాలా గంభీరంగా వున్నాడు. కోటూ, టై, బూట్లూ అన్నీ చక్కగా సరిపోయాయి. ఆ ప్రాంతమంతా గుప్పున వాసన. ముక్కులు అదిరిపోతున్నాయి. అతనిపక్కన వుంది ఇంకో అద్భుతం.

మల్లెపూల తోటలమీద వీస్తున్న గాలిలాంటి పరిమళం. అందమైన అమ్మాయి. ఎర్రటి పెదవులు. భుజాలమీద పడుతున్న వెంట్రుకలు. ఆ హైహీల్స్ చూస్తుంటే తర్ఫీదు పొందిన సర్కస్ అమ్మాయిలైనా వాటిని ధరించి నడవగలరా అనే సందేహం కలుగుతుంది. మినీ స్కర్ట్. మోకాళ్ళపై దాకా కనిపిస్తున్న ఆ అందాన్ని చూడటానికి మొహమాటం. చూపులు తెలియకుండానే గుండెలమీదకు ప్రసరిస్తున్నాయి. ఆమె చేతి వ్రేళ్ళకి మెరుస్తున్న డైమండ్ ఉంగరాలు. బంగారు రంగు ఫైన్ వాచ్. కళ్లలోకి చూద్దామంటే తననెక్కడ కాల్చేస్తుందో అన్నంత భయం.

"ఐయామ్ ఏ.ఎన్." క్లుప్తంగా పరిచయం చేసుకున్నాడు.

నైస్ టు మీటుయూ. ఐయామ్ 'షా'. మహేంద్ర పిషా దిసీజ్ మైడాటర్ కేథరినా"

"హాయ్" అంటూ చేయి అందించింది.

"హలో" అని మెత్తటి ఆ చేతుల్ని స్పృశించి షాకయ్యాడు.

"జస్టె మినిట్" అంటూ భూషణం గదికి వెళ్ళాడు. అతని అలంకరణ చూసి, కొద్దిగా సరిచేసి 'వెళ్దాం' అని తీసుకొచ్చాడు.

"భూషణం...మై బ్రదర్" అని పరిచయం చేశాడు. 'షా' భూషణం కేసి నిశితంగా చూశాడు. భూషణం చిరునవ్వుతో తలూపాడు. కేథరినా భూషణాన్ని వింతగా చూస్తోంది.

పరిచయం చేయాలని కూడా ఏ.ఎన్కనిపించలేదు.

"మీది ఇండియానేనా? "

"నేను ఎన్.ఆర్.ఐని... బైదిబై... దట్ రేర్ యాంటిక్..." అడిగాడు షా.

"ప్లీజ్ కమ్" అన్నాడు ఏ.ఎన్.

ఆ గదంతా పరిశీలించారు. కేథరినా ఒక్కక్షణం మాత్రం ఆ భోషాణాన్ని చూసింది. ఆమె ఆ గదిని చూస్తుంటే అసం




పూర్ణ చిత్రంమీద దృష్టిపడింది

"డాడ్... వండర్‌ఫుల్ ఆర్ట్" అంది ఎగ్జయిటింగ్‌గా.

'షా' వచ్చి రెండు నిముషాలపాటు తదేకంగా చూశాడు.

"పికాసో డ్రా చేసిందా? " అన్నాడు.

"నో... ఇది మా బ్రదర్ భూషణం చేత్తో గీసింది"

"ఐ.సీ... దానికీఅందం ఎక్కడ్నుంచి వచ్చిందంటావ్" అన్నాడు కేథరీనాని చూస్తూ.

"బికాజ్ ఇట్స్ నాట్ కంప్లీటెడ్"

మెచ్చుకోలుగా చూశాడు తన కూతురికేసి.

తిరిగి భోషాణం దగ్గరకెళ్లాడు. నాలుగు పక్కలా తిరిగి చూసుకున్నాడు. తర్వాత 'లెటజ్ మూవా? ' అన్నాడు కేధరీనాని. భుజాలు ఎగరేసింది. తిరిగి వచ్చి కూర్చున్నారు.

అయిదు నిముషాల నిశ్శబ్దం...

"కాఫీ... టీ..." అన్నాడు అప్పుడు గుర్తొచ్చి

"నో..." అన్నాడు 'షా'

"లిటిల్ టిఫిన్" అన్నాడు కేధారినాని చూసి.

ఆ అమ్మాయి 'షా'కేసి చూసింది. అతను ఏదో అనేలోగా 'సూరి'ని పిలిచి చెప్పాడు. "నీపనితనం ఇప్పుడు చూపించు. ఇడ్లీ, సాంబార్ ఇస్తావా... కొబ్బరిచట్నీనా? "

అరగంట టైముంటే రెండూ రెడీ.

"నీ ఇష్టం. తర్వాత కాఫీ ఇస్తావా? "

"అయిదు నిముషాల్లో"

"సరే. ఆ ఏర్పాట్లలో వుండు" అని పంపించాడు.

భూషణం మాత్రం కొద్దిపాటి చిరునవ్వుని పులుముకొని గంభీరంగా కూర్చున్నాడు. శూన్యంలోకి చూస్తున్న భంగిమ పెట్టాడు. అప్పుడప్పుడు మాత్రం కేథరినాని యథాలాపంగా చూసినట్లు చూస్తున్నాడు.

ఏ.ఎన్., షా మాట్లాడుకుంటున్నారు. సంభాషణంతా ఆంగ్లంలో సాగుతోంది.

"డీల్‌లోకి వద్దాం. ఈ పీస్‌ని మీరు అమ్మాలనుకుంటున్నారా? "

"ఫ్రాంక్‌గా మాట్లాడుకుందాం. మొత్తంగా ఈ దివాణం కొలాప్సయింది. ఈ భోషాణాన్నీ, ఈ ఇంటినీ మైంటన్ చేయటం చాలా కష్టంగా వుంది. ప్రభుత్వం వారు రెస్పాండ్ అవుతారేమోనని ఎదురు చూశాం. కానీ ఇంతవరకూ అలాంటిదేం లేదు. మీరు కొందామనుకుంటున్నారా? "

"నాచురల్లీ" అన్నాడాయన కూతురుకేసి చూస్తూ.

కేథరీన్ సైతం తలూపింది.

"ఓకే. మేం కూడా మంచి ధర పలికితే అమ్మేయాలనుకుంటున్నాం."

"అలాగా... దెన్ మంచి ధర ఎంతో చెప్పండి"

"మీకు ఈ పీస్ విలువ తెలుసు. మీరే ఆఫర్ చెబితే బాగుంటుందేమో" అన్నాడు ఏ.ఎన్.

"టుబీ ఫ్రాంక్. ఈ పీస్ విలువలేనిది..."

ఏ.ఎన్ షాకయ్యాడు.

"ఐ మీన్ వెలకట్టలేనిది. అందుకనే ఎంత చెప్పాలో నాకు అర్థంకావటంలేదు"

"నాదీ అదే పరిస్థితి. కాకపోతే నాకో భయం వుంది. అందుకే ముందుగా నేను చెప్పటం లేదు" అన్నాడు ఏ.ఎన్.

"ఏమిటా భయం? "

"నేను చెప్పే ధర కంటే మీరు ఎక్కువ

ఇవ్వటానికి ప్రిపేరయి వుంటే నేను ఎంతో నష్టపోవచ్చు నేను ఆశించే ధర కంటే తక్కువ చెబితే బేరం ఆడవచ్చు ఏమం టారు? ”

“అఫ్‌కోర్స్” అన్నాడతను.

“సో మీ ఆఫర్...”

“ఫైవ్‌లాక్స్” అన్నాడతను.

ఏ.ఎన్‌కి తనేం వింటున్నదీ అర్థంకాలేదు. ముఖం అదోలా పెట్టాడు. అంతలో మరలా వినిపించింది.

“టెన్ లాక్స్”

ఈసారి అలాగే అందామనుకున్నాడు.

“ఓకే ఎయిటీన్” అన్నాడు.

నోటినుండి మాటరావటంలేదు. ఫైన ల్‌గా అతను... లెటజ్ మేకిట్ ఫీడ్ ఫిగర్ ట్వంటీ అన్నాడు.

భూషణం కేథరిన్ గుండెలకేసి చూడ కుండా వుండలేకపోతున్నాడు. ఏ.ఎన్‌కి మాత్రం కిందపడిపోయి గిలగిలా తన్నుకో వాలనిపించింది. ఇంతకూ వీళ్ళు ఇచ్చేది డబ్బులా? చిల్లపెంకులా?

“సీ మిస్టర్ ఏ.ఎన్. యు వాంట్ ది పేమెంట్ ఇన్ ఇండియన్ కరెన్సీ ఆర్ ఇన్ డాలర్స్”

నోరు పెగిలితే కదా?

“ఇట్సాల్ రైట్, వియ్ బ్రాట్ టెన్ లాక్స్.. తీసుకోండి. భోషాణం తీసుకువెళ్లే రోజున మిగతా పేమెంట్ ఇస్తాం” అని “డ్రైవర్” అని పిలిచాడు. అతనో పెద్ద సూట్‌కేసుతో వచ్చి అక్కడ పెట్టి వెళ్ళిపో యాడు.

షా సూట్‌కేస్ ఓపెన్ చేసి చూపించాడు.

భూషణం కళ్లు చెదిరిపోయాయి. కేథ రినా గుండెలకేసి చూడాలనిపించటంలేదు. ఆ సూట్‌కేస్‌నే చూస్తున్నాడు. అతను తిరిగి సూట్‌కేస్ క్లోజ్ చేశాడు. అప్పటికి గానీ వారికి స్పృహ రాలేదు.

“థాంక్యూ మిస్టర్ షా... విత్ ఆల్ మై సిన్సియారిటీ చెబుతున్నాను. మేం కలలో కూడా ఇంత పెద్ద మొత్తం రాగలదని ఊహించలేదు.”

షా గంభీరంగా నవ్వాడు.

“నేను మీతో ఓ విషయం చెప్పాలనుకుం టున్నాను” అని ఆగాడు.

ఏమిటాన్నట్లు చూశారు.

“దిసీజ్ నాటే రేర్ యాంటిక్” అన్నాడు మెల్లగా.

బాంబు పడినట్లు అదిరిపోయాడు ఏ.ఎన్.

“కానీ దీనికి ట్వంటీ లాక్స్ ఇవ్వటానికి నేను బలిసిలేను. అంతకంటే ఫూల్‌నికాదు. నా స్ట్రాటజీ నాకుంది” అన్నాడు నవ్వుతూనే.

ఏ.ఎన్ ప్రూన్పడి చూస్తుండగా ఆయనే ఆగి ఆగి మాట్లాడాడు ప్రవాహగానంలా.

“ఇలాంటివి చాలామంది ఇళ్లల్లో కాకపో యినా, కొందరి ఇళ్లల్లో దొరుకుతాయి. వీటి వెనుక కొన్ని పదుల సంవత్సరాల చరిత్ర వుండొచ్చు జస్ట్ అంతే. కానీ నాకు నచ్చిన విషయం మీ పబ్లిసిటీ. మీరేం పత్రికల్లో ప్రకటనలు ఇవ్వలేదు మేగ్‌జేన్స్ అన్నింటిలో ఆర్టికల్స్ ఇవ్వలేదు. ఎక్కడ ఏది చెయ్యాలో అదే చేశారు.

మీ ఆలోచన వేరు. పత్రికలవారి వ్యూ పాయింట్ వేరు. ఒక భావాన్ని శక్తివం తంగా జనంలోకి తీసుకుపోయారు. సీ... మిస్టర్ ఏ.ఎన్. ఆఫ్టాల్ దిస్ యూనివర్స్ ఈజ్ అండర్‌ది ఇన్‌ఫ్లుయెన్స్ ఆఫ్ యాడ్స్... నువ్వు ప్రతిభావంతుడివయితే బూడిదను అమ్ముకుంటావ్... గాలినీ, నీటినీ, నిప్పునీ, ఒకటేంటి ప్రతి వస్తువునీ





కస్టమర్ దగ్గరకు చేర్చగలవ్. పెట్టుబడిదారి ప్రపంచం రహస్యం తెలుసుకున్నావ్ కాబట్టి నీకు నేను ఈ ధర ఎందుకిచ్చానో అర్థమయ్యేవుంటుంది.

ఇంతకూ నువ్వు అమ్మటానికి ఇది ప్లాన్ చేశావా లేదా పీపుల్ మీద నీకేమైనా 'కసి' లాంటిదుందా? నాకెందుకో అనుమానం వచ్చింది? నేను ఎలాంటిదాన్నయినా మార్కెట్ చేయగలననే 'ఇగో' అన్నా వుండాలి. ప్రకటనల ద్వారా మిమ్మల్ని ఎంతైనా మోసం చేయగలనని చెప్పాలనే ఓ

కసి ఆర్ కమిట్‌మెంట్ ఆర్ వాటెవర్ ఇట్ మేబీ అదేమైనా వుందా?"

ఏ.ఎన్. మౌనంగా నవ్వాడు.

"ఓ.కే... నీ వ్యాపార రహస్యం నాకొద్దు. కానీ నాకెందుకో ఈ ఇంటినికూడా తీసుకోవాలనిపిస్తోంది. దీనిని నేను షిఫ్ట్ చేసుకుంటే మీకు అభ్యంతరం లేదుకదా"

ఎలా? అన్నట్లు చూశాడు ఏ.ఎన్.

"ఈ ఇంటికి కట్టిన ప్రతి ఇటుకనీ తరలిస్తాం. సేమ్ ఇదే మోడల్‌లో ఇలాంటి ఇల్లే కడతాం"

"మీ ఇష్టం. ఈ ఇంటిని కూడా మీకు ఇవ్వటానికి మేం సిద్ధంగా వున్నాం"

"ఇట్సాల్ రైట్. మేం వచ్చేటప్పుడు ఇంకో సూట్‌కేస్‌తో వస్తాం. ఇండియన్ పీపుల్‌కి సూట్‌కేసంటే పెద్ద క్రేజ్ కదా" అన్నాడు 'షా' నవ్వుతూ.

ఏ.ఎన్. ఎగ్జయిటింగ్‌గా వున్నాడు.

భూషణానికి సోదరుడ్ని అమాంతం వాటేసుకోవాలనుంది.

"ఇప్పుడు ఇంకో యాంటిక్ గురించి అడగాలనుంది"

"ఇంకోటా?"

"అవును. మిస్టర్ భూషణం"

"అంటే..."

"అతన్ని అమ్మమనటం లేదుగానీ... అతని సర్వీసెస్‌ని అమ్మమని అడుగుతున్నాను"

"ఏ సర్వీసెస్... దాని నేచర్ ఏమిటి?"

"ఆయన ప్రత్యేకంగా చేయవలసిన పనేం వుండదు. ఇంటర్నేషనల్ ట్రేడ్ ఫెయిర్స్‌లో మాకు చెందిన స్టాల్స్‌లో కూర్చోవటమే. ఎప్పుడన్నా ఆటోగ్రాఫ్స్ ఇవ్వటం. కాకపోతే అతను మేం కోరినప్పుడు ఏదేశమైనా రావాల్సుంటుంది."

"వెంటనే రావాలా?"

"మరీ వెంటనే కాదు"

"ఏమీలేదు. కనీసం సిక్స్ మంత్స్ టైం ఇవ్వండి. ఈలోగా అతనికి కంప్లీట్ ట్రైనింగ్ ఇప్పించేస్తాం"

"టేక్ యువర్ ఓన్ టైమ్" అన్నాడు 'షా'

"మా జీవితాల్లో ఇది మరుపురాని రోజు" అన్నాడు ఏ.ఎన్.

"సార్ టిఫిన్ రెడీ" అన్నాడు సూరి.

"తీసుకురా"

"సూరి అరటి ఆకుల్లో ఇడ్లీలుంచి సాంబారూ, కొబ్బరి చట్నీ సెపరేట్‌గా తెచ్చియిచ్చాడు. అనుమానంగా కేథరినా స్పూన్‌తో ఇడ్లీని తుంచి నోట్లో పెట్టుకుంది. కొద్దిగా కొబ్బరి చట్నీ తీసుకుంది"

"నైస్" అంది తల తిప్పుతూ.

సాంబార్‌లో ఓ ముక్కని ముంచి తిన్నాక మరింత మెచ్చుకుంది.

"హూ ఈజ్ హీ... యువర్ సర్వెంట్"

"నో.. అవర్ ఫ్రెండ్...వెరీ గుడ్ కుక్"

"వైడోంట్ యు స్టార్ట్ ఫాస్ట్‌ఫుడ్ సెంటర్" అన్నాడతను.

"డెఫినెట్లీ వి విల్ స్టార్ట్" అన్నాడు

ఏ. ఎన్.

"ఇది చాలా బాగుంది. ఏమంటారు దీన్ని"

"ఇడ్లీ సాంబార్ విత్ చట్నీ... సింపుల్‌గా అయితే ఇడ్లీ"

"అలాగా ... ఇదివరకు ఇలాంటివి తిన్నట్లు గుర్తు. కానీ ఇలా లేదు. ఇంత టేస్ట్ లేదు" అన్నాడాయన.

"సూరీస్ స్పెషల్ ఇది"

"దీనికి పేటెంట్ రైట్స్ తీసుకోకూడదూ" నవ్వుతూ అన్నాడు 'షా'.

ఏ. ఎన్ బిగ్గరగా నవ్వాడు గానీ... మెల్లగా ఏదో వెలిగినట్టనిపించింది. నవ్వు కరిగిపోయి ఆలోచన ప్రవేశించింది.

కాఫీలు తాగారు.

"ఇంక మేం బయలుదేరుతాం" అన్నారు.

కేథరిన్ కెమెరాతీసి 'షా' కిచ్చింది. భూషణంతో ఓ ఫొటో, ఏ. ఎన్. భూషణం మధ్యలో తనున్న ఫొటో... సూరితో ఓ ఫొటో దిగింది. 'షా' సూరితో ఓ ఫొటో దిగాడు.

బయటికి వచ్చి కారెక్కాక 'షా'నే చెప్పాడు.

"సరిగ్గా టెన్త్‌డే మేం వస్తున్నాం".

★ ★ ★

భూషణం గదిలో సూట్‌కేస్ తెరిచి చూస్తున్నాడు.

"సోదరా నమ్మశక్యం కాకుండా వుంది. ఇది నిజమా... కనికట్టా"

"నిజమే అగ్రజా"

"మీకేదో గజకర్ణ, గోకర్ణ టక్కుటమారీ విద్యలు తెలుసుననుకుంటున్నాను" అన్నాడు భూషణం.

"అలాంటిదే అగ్రజా నేనూ ఊహించని పరిణామం ఇది. ముందుగా అండర్ ఎస్టిమేట్ వేశాను. ఇదంతా నాకో షాక్‌నిచ్చింది. అదట్లా వుంటే ఏమాత్రం రక్షణ లేని ఈ ప్రదేశంలో ఇంత డబ్బు నుంచటం మంచిదికాదు"

"ఏం చేద్దాం చెప్పు సోదరా. నేను నిమిత్తమాత్రుడ్ని".

"భాగ్యనగరం వెళ్ళి అక్కడ ఓ జాయింట్ ఎకౌంట్ ఓపెన్ చేద్దాం"

"భాగ్యనగర ప్రయాణమా! ప్రయాణములన్న మాకు చెడ్డ చిరాకు" అన్నాడు భూషణం.

"అది గతం. మారుతున్న కాలమునకు తగినట్లుగా మనం మారి తీరవలయును అగ్రజా అందులోనూ ఎల్లప్పుడూ వార్తల్లో కనిపించాలనే తాపత్రయం చూపించారు. ఈ ప్రయాణం ఆరంభమే. మన భోషాణమునకూ, భూషణ మణీంద్రులకు కదలిక వచ్చింది. ఇంక చూడండి. దేశదేశాలు, ఖండాంతరములు వాయువేగంతో ప్రయాణం చేయవలసివచ్చును" అన్నాడు ఏ. ఎన్.

"అది సరే. ఆ స్వాములవారు ఇదంతా మనకి అనర్థం అని ప్రకటించిన వెంటనే ఇది జరగటం ఆశ్చర్యంగా వుందే"

"అవును అగ్రజా. ఈ దేశమున ప్రజల నాడి బాగా తెలుసు కున్న వారిలో ఈ స్వాములు మొదటివారు. స్వాములనుండే కదా స్కాములు ఆరంభం" అన్నాడు.

"అవునవును. మమ్మల్ని ఆ కొద్ది క్షణములలోనే చాలా చిత్రవధకు గురిచేసినాడు. ఇదే గతంలో అయితే వంద కొరడా దెబ్బలు రుచి చూపించనిదే వదిలేవాళ్ళం కాదు. మన ప్రయాణం ఎప్పుడు? "

"అగ్రజా... మనం ఇలా ప్రయాణం చేయం. ముందు 'సూరి'బాబు వెళ్ళి అంద




మైన 'కారు'ను తోడ్కొని వచ్చును"

భూషణానికి మహోత్సాహం వచ్చింది.

"ఓరి నీయబ్బ ఇంక ఆ భాష ఆపెహె" అన్నాడు భుజం చరుస్తూ...

"మన అబ్బలందరూ పైనుండి ఇదంతా చూస్తుంటారు. గత వైభవానికి తెరలేచింది అగ్రజా" అంటూ సూరిని పిలిచి

"సూరీ... అర్జెంటుగా ఓ చిన్నకారు ఏ.సీ వున్నది కావాలి. మాట్లాడుకునిరా..." అని అయిదువేలిచ్చాడు.

"ఎంతకు మాట్లాడమంటా రేంటండి" అన్నాడు.

"ఎంతోకొంతకు మాట్లాడు. అది నీకే వదిలేస్తున్నాం".

సూరిబాబు కారు తెచ్చాడు. ఈలోగా స్నానపానాదులు ముగించుకొని తయారుగా వున్నారు. "సూరీ! అర్జెంట్‌గా బయలుదేరి వెళ్తున్నాం. రెండు రోజులు ఇంటి నుంచి ఎక్కడికీ కదలొద్దు. నీకు వచ్చేటప్పుడు కావలసిన బట్టలు తెస్తాం. ఇంక మనం భాగ్యనగరంలోనే వుండాల్సివస్తుంది. నేను చెప్పిన పనులు మేం రాగానే మొదలుపెట్టాలి. ప్రస్తుతం ఖర్చులకి ఈ డబ్బు వుంచు" అని రెండువేలు చేతిలో పెట్టాడు.

సూరిబాబు గుడ్లప్పగించి చూస్తున్నాడు.

"అంత షాక్ అవసరంలేదు. కాకపోతే నీ బామ్మర్దికో, మేనమామకో ఇవన్నీ చెప్పకు. రెండోది. 'మందు' కొట్టి తొంగోవద్దు. మేం వచ్చేదాకా ఇంట్లోకి ఎవరికీ ఎంట్రిన్స్ లేదు. తాళాలువేసి బయట గదిలో పడుకో. కావాలంటే తోడుగాఇద్దరు మనుషుల్ని పెట్టుకో"

"అలాగేనయ్యా" అన్నాడు.

సూట్‌కేసుని కారులో వుంచారు. సూరిబాబు డోర్ తెరిచి పట్టుకుంటే భూషణం వచ్చి కూర్చున్నాడు. ప్రయాణం ఆరంభం అయింది. చెరువు కనిపించగానే భూషణానికి పాత జ్ఞాపకాలేవో మదిలో మెదిలాయి.

చల్లటిగాలి మేనుని తాకుతోంది.

భూషణం మెల్లగా నిద్రలోకి జారుకున్నాడు.

ఏ.ఎన్. ఆలోచిస్తున్నాడు. అతనికీ ఆశ్చర్యంగా వుంది. ఇది ఇంత నాటకీయ మలుపు తీసుకుంటుందని ఏమాత్రం అనుకోలేదు. మానవ మనస్తత్వం అంచనా వేయటంలో, ఆధునిక వేగాన్ని కొలవటంలో చాలా కింది స్థాయిలో వున్నానని అనుకున్నాడు. ఇకనుంచి వేసే ప్రతి అడుగూ 'చాలా జాగ్రత్తగా వేయాలి' అనుకుంటూ పక్కకి చూశాడు.

భూషణం నిర్మలంగా నిద్రపోతున్నాడు.

"భయ్యా... తుజే సలామ్" అన్నాడు మెల్లగా.

తనూ నిద్రలోకి జారుకున్నాడు గానీ, సూట్‌కేసు గుర్తుకు వచ్చినప్పుడల్లా ఉలిక్కిపడి లేస్తున్నాడు. అలానే ప్రయాణం భాగ్యనగరం దాకాసాగింది.

'కారు' వెళ్లి ఫైవ్‌స్టార్ హోటల్ ముందాగింది.

రిసెప్షన్ వాళ్ళు భూషణాన్ని చూసి సాదరంగా ఆహ్వానించారు. వారి కళ్లల్లో పెద్ద కుటుంబంనుండి ఎవరో వచ్చుంటారనే ఆసక్తిని గమనించాడు. ఏ.ఎన్.

'సూట్' తీసుకున్నారు. 'సూట్‌కేస్' లోపలికి తెచ్చారు.

"హాయిగా స్నానం చేద్దాం అగ్రజా... ముందు మీరు చేస్తారా" అన్నాడు.

"చేద్దాం" అన్నాడు.

బాత్‌రూం తలుపు తీసి "రండి" అన్నాడు.

లోపల ఏర్పాట్లు చూసి భూషణం 'ఔరా' అన్నట్లు తల పంకించాడు.

"సోదరా మయసభలా వుందే" అన్నాడు.

"అవును. ఆధునిక మయసభలు" అని నవ్వాడు.

ఆ తర్వాత స్నానాల తొట్టి చూపించాడు. అందులో ఎలా పడుకోవాలో, ఎలా నీళ్ళు వస్తాయో చెప్పాడు. ఇంక టాయ్‌లెట్‌ని ఎలా ఉపయోగించాలో వివరించాడు.

"ఇదేమి సోదరా... కాలకృత్యములకు కాగితములనుపయోగించుట... హే..." అన్నాడు.

"తప్పదు సోదరా. రేపటినుండి మనం వాయు మార్గమున ప్రయాణం చేయవలెను. అలాంటప్పుడు ఇవన్నీ తప్పవు. అలవాటు చేసుకోవాలి. దీన్ని ఫ్లష్ అంటారు. ఇలా నొక్కితే వాటర్ వస్తుంది. వేడినీళ్ళు కావాలంటే గీజర్ వేస్తే వస్తాయి" అంటూ చెప్పాడు.

"దీనినేమంటారు?"

"కమోడ్"

"కాగితము సంగతి వదిలేస్తే ఈ కమోడు సుఖముగా కూర్చోవటానికి అనువుగా వుంది" అని ప్రశంసించాడు భూషణం.

స్నానం చేయటానికి లఘు సోపులూ, తల అంటుకొనుటకు 'షాంపూ' పాకెట్లు, పాలనురుగులాంటి టవల్స్... అద్దాలూ... మాట్లాడుకొనుటకు ఫోన్... అన్నీ చిత్రంగా అనిపించాయి.

స్నానాల తొట్టిలో పడుకున్నాక భూషణం వేరే ప్రపంచంలోకి వెళ్ళిపోయాడు.

"అరరే... ఎంత దయనీయం. ఇన్ని సంవత్సరాలుగా చీకటిలో మగ్గిపోయాను. నా దివాణమే నా ప్రపంచం అనుకున్నాను. ఇన్ని సౌకర్యాలూ... ఇన్ని అద్భుతాలూ వచ్చేశాయి. బహుశా 'అఖిల' అందుకే నన్ను విడిచి వెళ్ళిపోయి వుంటుంది. భారత దేశముననే ఇన్ని వింతలుంటే లండన్‌లో మరెన్ని వింతలూ, విడ్డూరాలుంటాయో... సోదరులు చెప్పినట్లు ఇంక నిరంతర ప్రయాణం చేయవలసిందే" అనుకున్నాడు.

ఫోన్ మోగటంతో ఉలిక్కిపడ్డాడు. తీయగానే ఏ.ఎన్ కంఠం వినిపించింది.

"అగ్రజా... స్నానం ముగించండి. మనము చేయవలసిన పనులు చాలా వున్నాయి"

"వచ్చుచున్నాం" అన్నాడు.

'ఏ.ఎన్' త్వరత్వరగా స్నానం ముగించుకొచ్చాడు.

రూమ్ సర్వీస్‌కి ఫోన్ చేసి ఆర్డర్ చెప్పాడు. ఫోన్ డైరెక్టరీ అందుకుని చూశాడు. ఆ తర్వాత ఆనాటి ఆంగ్లపత్రిక తీసుకుని 'క్లాసిఫైడ్' యాడ్స్ చూసి ఓ నెంబర్ నోట్ చేసుకున్నాడు.

పావుగంటకి బజర్ మోగింది.

'కమాన్' అన్నాడు.

టిఫిన్ సర్దేసి బిల్ మీద సైన్ చేయించుకొని వెళ్ళాడు.

ఇరువురూ తిన్నాక కాఫీ తాగారు.

"అగ్రజా... మీరు గదిలో హాయిగా నిద్రపోండి. నేను నాలుగు గంటలలోపే వస్తాను. మీకేమన్నా కావాలంటే రూమ్ సర్వీస్‌కి ఫోన్ చెయ్యండి. ఏం కావాలంటే అది మీ ముందుకొస్తుంది"

"అలానే"

"ఇదిగో ఇది ఆన్‌చేస్తే మ్యూజిక్ వస్తుంటుంది. ఇది రిమోట్ కంట్రోల్. ఈ నెంబర్లు నొక్కితే ఛానల్స్ మారుతుంటాయి. మీకు ఏ ఛానల్ చూడాలనిపిస్తే అది చూడండి. నేను వచ్చేదాకా గదిని విడిచిపెట్టవద్దు. ముఖ్యంగా 'సూట్‌కేస్' జాగ్రత్త" అన్నాడు.




"కానీ మీరు త్వరగా వచ్చేయాలి సోదరా" అన్నాడు.

"భలేవారే. ఇకనుంచి టైమ్ ఈజ్ మనీ. ఒక్క క్షణంకూడా వృధాపోవటానికి వీల్లేదు"

"వెళ్ళిరండి... మనం పైకి వచ్చిన దాన్నేమంటారు..."

"లిఫ్ట్..."

"మెట్లుకూడా నడిచి వచ్చినదాన్నేమంటారు? "

"యస్క్యులేటర్"

"వాటిమీద కొంతసేపు ప్రయాణం చేయాలనుంది. మీరు వచ్చేకనే సుమా" అన్నాడు.

ఏ.ఎన్. నవ్వుతూ వెళ్ళిపోయాడు.



అదేం పెద్ద రద్దీవున్న చోటు కాదు. ప్రశాంతంగా వుంది. ముఖ్యంగా కాంప్లెక్స్ లోకి అడుగు పెడుతుంటే సేద తీరిన భావం కలిగింది. రోడ్స్, పార్కింగ్ ప్లేస్, ఇంటీరియర్ డెకరేషన్ అన్నీ పద్ధతి ప్రకారం రూపొందించారు. ముఖ్యంగా ఆ హాల్ ఏ.ఎన్.ని విపరీతంగా ఆకర్షించింది.

"ఓ.కె... మొత్తం ఈ భాగం అంతా నేను తీసుకుంటాను. మనకి టెర్మ్స్ కుదరాలి" అన్నాడు నవ్వుతూ.

"చెప్పండి" అన్నాడతడు.

"ముందు మీరు చెప్పండి. ఎంత అడ్వాన్స్ ఇవ్వమంటారు? ఎన్ని సంవత్సరాలకు అగ్రిమెంట్ రాస్తారు. రెంట్ ఎంత? "

అతను చెప్పాడు.

రీజన్‌బుల్‌గానే అనిపించింది.

"ఓ.కె... నాకు మినిమమ్ ఎయిట్ యియర్స్‌కి లీజ్ అగ్రిమెంట్ కావాలి. మీరు అంగీకరిస్తే నా లాయర్‌తో వస్తాను. వి విల్ పే ది ఎంటైర్ ఎమౌంట్" అన్నాడు ఏ.ఎన్.

"ఎనిమిది సంవత్సరాలా? " అన్నాడతడు.

"అవును. ఇక్కడ నేను చాలా పెద్ద మొత్తంలో ఇన్‌వెస్ట్ చేయాలనుకుంటున్నా. నా పెట్టుబడి వెనక్కి రావటానికి చాలా కాలం పడుతుంది. తర్వాత ఇదేం బిజినెస్ సెంటర్ కాదు"

"నిజమేననుకోండి. అప్పటికి పెద్ద సెంటరవుతుంది కదా..."

"చూడండి. రెంట్ ప్రతి సంవత్సరం టెన్ పర్సెంట్ పెంచుతాను. నేనిచ్చే అడ్వాన్స్‌కి మీరు వడ్డీ ఇవ్వనవసరంలేదు.

ఇంతకంటే మంచి ఆఫర్‌వస్తే మీ ఇష్టం" అంటూ లేచాడు.

"వెయిటే మినిట్ సార్" అన్నాడు.

ఏ.ఎన్ కూర్చున్నాడు. అతను ఎవరికో ఫోన్ చేసి మాట్లాడాడు.

"మీరు కోరినట్టుగానే అగ్రిమెంట్ ఇస్తాం. మంచిరోజు చూసుకుని వస్తారా..."

"రేపు మంచిరోజుకాదా... మంచిరోజే అనుకుంటాను. షార్ప్‌గా నాలుగు గంటలకి మా లాయర్‌తో, డబ్బుతో వస్తున్నా"

"కొంత వైట్ ఇవ్వండి... మరికొంత బ్లాక్‌లో..."

"ఇట్సాల్ రైట్... బట్ నా అడ్వాన్స్ ఎమౌంట్‌కి మీనుండి నేను నోటు ఆశించ వచ్చా? ఐ మీన్ ఓన్లీ ఫర్ దట్ బ్లాక్ ఎమౌంట్"

"వై నాట్" అన్నాడతడు.

బయటకొచ్చి కారు ఎక్కాడు. అరగంట తర్వాత ఓ లాయర్ ఇంటిముందు ఆగింది. అతని రూమ్‌కి వెళ్ళాక తనని తాను పరిచయం చేసుకున్నాడు.

"నేను ఓ కాంప్లెక్స్‌లో సెల్లార్‌లో మేజర్ పోర్షన్ లీజ్‌కి తీసుకుంటున్నాను. ఆ ఎగ్రిమెంట్ మీరు చేసి పెట్టాలి. రేపు నాకు ఎలాంటి తలకాయ నొప్పి రాకూడదు. మీకు కాంప్లెక్స్ ఓనర్‌కి చెందిన వివరాలిస్తాను. వాళ్ల డాక్యుమెంట్స్ పరిశీలించండి. అన్నీ క్లియర్‌గా వుంటే రేపు నాలుగు గంటలకి ఎగ్రిమెంట్‌తో ఎంటరవుతున్నాం. ఇది మీ అడ్వాన్స్" అని టేబుల్ మీద పెట్టాడు.

అతని వేగం చూసి ఆశ్చర్యపోయాడు.

"తర్వాత మేం ఇక్కడే కొన్ని సంస్థలు ఏర్పాటు చేయాలనుకుంటున్నాం. దానికి చెందిన లీగల్ అడ్వయిజర్‌గా మిమ్మల్ని అపాయింట్ చేయాలనుకుంటున్నాను. ఆ విషయం గురించి రేపు మాట్లాడుకుందాం. నేను అర్జంటుగా బ్యాంక్‌లో ఎకౌంట్ ఓపెన్ చేయాలి. దటీజ్ ఆల్సో జాయింట్ ఎకౌంట్. మీ బ్యాంక్‌లో ఓపెన్ చేద్దామా? "

"తప్పకుండా"

"అట్లయితే బీ ఆన్ యువర్ జాబ్ రైట్ నవ్. ఇది మా హోటల్ నెంబర్. రాత్రి ఎనిమిది గంటలకి మీరు నాకు ఫోన్ చేస్తున్నారు. ఇఫ్ ది టైటిల్ డీడ్స్ ఆర్ శాటిస్ ఫైడ్ మిగతా పనులు పూర్తిచేయండి. ఉదయం బ్యాంక్ ఓపెన్ చేయటానికి పది నిముషాల ముందు మీ ఇంటిముందు మా కార్ వుంటుంది. అటునుండి వెళ్లి ఎకౌంట్ ఓపెన్ చేస్తాం. లంచ్ ఎట్ ఒన్... ఒన్ అవర్ రెస్ట్... షార్ప్‌లీ 'ఫోర్'కి ఎగ్రిమెంట్ మీదసైన్ చేస్తాం. ఓ.కె..." అన్నాడు.

"అలాగే"

"దెన్ గుడ్‌బై"అంటూ వెళ్ళిపోయాడు.

కారు కదిలిన సవ్వడి.

అతనింకా ఊపిరి పీల్చుకోలేదు.

"వీడెవడ్రా బాబు జెట్ కంటే వేగంగా వున్నాడు" అనుకున్నాడు.

అతని చూపులు కాంప్లెక్స్ ఓనర్ ఫోన్ నెంబర్, అడ్రస్ మీద పడ్డాయి.

ఇంకొక్క క్షణం ఆలస్యం చేయలేదు.

ఏ.ఎన్. కారు పెద్ద క్లాత్ షోరూమ్ ముందు ఆగింది. లోపలికి వెళ్లి చకచక డ్రెస్సులు సెలక్ట్ చేశాడు. సూరిబాబుకి 'జీన్స్' ప్యాంట్‌లు కొన్నాడు. టీ షర్ట్‌లు తీసుకున్నాడు. తను మరికొన్ని బట్టలు తీసుకున్నాడు. బిల్ 'పే' చేశాక తిరిగి కారు ముందుకు కదిలింది.

బెల్ మోగటంతో భూషణం అన్నాడు "కమిన్". ఏ.ఎన్. లోపలకు అడుగుపెట్టాడు. వెనకాల 'బాయ్' పేకెట్లు తెచ్చి టేబుల్ మీదసర్దాడు. అతనికో ఏభైకాగితం ఇచ్చాడు. సలామ్ చేసుకుంటూ వెళ్లాడు ఆ కుర్రాడు.

"బోర్ కొట్టిందా? "

"లేదు. మంచి సంగీతం విన్నాను. టీ.వీ. చూస్తూ కూర్చున్నా"

"ఎలా వున్నాయి కార్యక్రమాలు"

"నాకయితే దున్నపోతుల్లాంటిమగాళ్ళూ ఆడవాళ్ళూ కొట్టుకోవటం నచ్చింది సోదరా. వీళ్లమ్మ కడుపులు కాలా.. ఆడామగా ఆ లంగోటాలు కట్టుకుని ఆ పిచ్చి కొట్టుడేంట య్యాబాబూ... కడుపు పగిలిపోయింద నుకో" అంటూ నవ్వాడు భూషణం.





"ఇంకా చాలా చమత్కారాలుంటాయి అగ్రజా. ఈ డ్రెస్సులు కొన్ని మన సూరికి తీసుకున్నా... ఎలా వున్నాయి? "

"వాడికా... అదేంటి సోదరా అలా అడి గావ్... వాడున్ను నిమిత్తమాత్రుడే కదా" అన్నాడు.

ఏ.ఎన్. భూషణం మాటలకి నవ్వకుండా వుండలేకపోయాడు.

"ఇంక నేను చేసిన పనులగురించి చెప్పాలి. మనం రేపు ఓ అగ్రిమెంట్ చేస్తున్నాం. దాదాపు ఓ 'ఫ్లోర్' లీజ్‌కి తీసు కుంటున్నాం"

"ఏం చేద్దామందులో"

"చెబుతా. ఉదయం బ్యాంక్‌కి వెళ్లి ఎకౌంట్ ఓపెన్ చేస్తున్నాం"

"అలాగే"

"ఇంక ఏం చేస్తామనేది మీ ప్రశ్న.. దానిని రెండు భాగాలుగా చేస్తాను. ఆ భాగం మాత్రం అద్భుతంగా డెకరేట్ చేయి స్తాను. అందులో టాయ్స్ నుండి ఆల్ ఐటమ్స్ దొరుకుతాయి. జస్ట్ లవ్‌లీ... ప్రెజెంటేషన్ ఆర్టికల్స్.."

"ఇంకా"

"క్లాస్సీ బుక్స్...ది బెస్ట్ సెల్లర్స్ ఇన్ ది వరల్డ్... ఆడియో వీడియో అండ్ లేజర్ డిస్క్స్... ఇట్స్ వరల్డ్ ఆఫ్ ఫాంటసీ..."

"ఎంత ఖర్చవుతుంది"

"కొన్ని లక్షల రూపాయలు"

"అంత డబ్బు ఎలా వస్తుంది? "

"అగ్రజా... నాలుగు లక్షలు సంపాదించే దాకానే సమస్య... తర్వాత అవి గుడ్లు పెడ తాయి..."

"ఏమిటో నాకేమీ అర్థంకావటంలేదు. నేను నిమిత్తమాత్రుడ్ని"

"ఇందులో అర్థంకావటానికేం లేదు అగ్రజా... మనం స్పేస్‌ని తీసుకున్నాం. అద్భుతంగా డెకరేట్ చేశాం. అందులో తమతమ కంపెనీల సరుకులు పెట్టుకో వటం వాళ్ళ ప్రెస్టేజికి చెందింది. డెకరేషన్ ఖర్చులు కూడా మనవికాదు. కంపెనీలు స్పాన్సర్ చేస్తాయి. వర్కింగ్ కాపిటల్ మా దగ్గర తీసుకోండంటే మా దగ్గర తీసుకో మని బ్యాంకులవాళ్ళు పరిగెత్తుకొస్తారు"

"నిజంగానా? "

"చూస్తుండు బాస్... అన్నీ అనుకున్నట్లు జరిగితే ఆ కాంప్లెక్స్‌లో ఇంకో రెండు ఫ్లోర్లు మనంకొంటాం. ఒక దాంట్లో ఫాస్ట్ ఫుడ్ సెంటర్. ఒక క్లాత్ ఎంపోరియం, ఓ సెలూన్ ఏర్పాటు చేస్తాం"

"సెలూనా? " ఆశ్చర్యంగా అన్నాడు.

"యస్. సెలూన్. దేన్నీ హీనంగా చూడ కూడదు. 1987లో ఢిల్లీలో ఓ ప్రముఖ సెలూన్‌కి నెలకి ఇరవైవేల రూపాయల ఆదాయం వచ్చేది. అదే ఇప్పటి ఆదాయం ఎంతో తెలుసా. లక్షా ఇరవైవేల రూపా యలు. 'వుడ్‌లాండ్స్' అనే ఓ క్లాత్‌షో రూమ్. అందులో రెడీమేడ్ నుండి అన్నీ దొరుకుతాయి. దాని ఆదాయం నెలకి ఏడు కోట్లు. నాలుగు సంవత్సరాలక్రితం. ఇప్పుడు వాళ్ళ కస్టమర్లు ఎంత మందో తెలుసా. జస్ట్ సిక్స్టీఫైవ్ థౌజండ్. అరవై అయిదు వేలమంది మాత్రం. అంటే వాళ్ళు ఎంత టర్నోవర్ సాధించారో అర్థంచేసుకోండి"

భూషణం నోరు తెరిచాడు.

"అవును అగ్రజా... డోంట్‌సే దట్ ఇండియా ఈజే 'పూర్' కంట్రీ. ఇక్కడ జనం చాలా మారారు. కొత్త తరగతులు పుట్టుకొచ్చాయి. ఓ రెడీమేడ్ షర్ట్‌ని అయి దువేలనుండి పదివేల దాకా, ఓ ప్యాంట్‌ని ఏభైవేలనుండి లక్ష రూపాయలదాకా కొన గల వాళ్ళు లక్షమందికి పైగా వున్నారు. అయిదారు లక్షల ఖరీదు చేసే గడియా రాలూ, లక్షలాది రూపాయల కార్లూ,

వజ్రాల తాపడం చేసిన ఆభరణాలూ వీటిని ఖరీదు చేయగల వర్గం ఇండియాలో తయారైంది"

"ఈ విషయాలన్నీ ఎలా తెలుసుకున్నావ్ సోదరా? " అన్నాడు భూషణం.

"నడుస్తున్న చరిత్రని ఫాలో అవుతుంటే అన్ని విషయాలూ తెలుస్తాయి. ఇప్పుడు చెబుతున్నా అసలు రహస్యం. మన భోషాణాన్ని అంత ధరకు ఎందుకుకొన్నాడో తెలుసా? "

తల అడ్డంగా వూపాడు.

"కొన్ని కోట్ల రూపాయలకు అమ్ముకునే శక్తి వుంది కాబట్టి"

"కోట్లా... నిజమా"

"అవును. దానికి పెద్ద బిల్డప్ కావాలి. బోల్డంత పెట్టుబడి పెట్టాలి. అవన్నీ చేయగలడు కాబట్టే ఆ కాన్ఫిడెన్స్. నిన్ను కొంత కాలం తనతో వుండమని కోరిందందుకే"

"నేనుండటంవలన లాభం ఏమిటి? "

"జస్ట్ క్రేజ్... ఒక నవలకు నాలుగు కోట్లు ఇచ్చారంటే అందులో ఏదో వుందని క్రేజ్. అందులోనూ ఏదన్నా ఎగ్జిబిషన్‌లో రచయిత్రి స్వయంగా సంతకం చేసి ఇస్తారంటే సేల్స్ మరింత పెరుగుతాయి. రచయిత్రితో ఫొటో కూడా దిగవచ్చునంటే మరింత సేల్స్"

"అది సరే. ఇంతకీ మన భోషాణం పాత కాలం నాటిది కాదంటే"

"అనాలి... అనకపోతే ఆయనే కొంతమందితో అలాంటి విమర్శలు చేయిస్తాడు. నెగిటివ్ ప్రచారం వల్ల కూడా సేల్స్ బూస్ట్ అవుతాయి. సాహిత్యంలో ఎంత తిట్టించుకుంటే అంత సేల్స్. సినిమాలూ అంతే. బాగుండి ఆడితే ఓ రకం. లేకపోతే నెగిటివ్‌గా రాస్తారు. లేదా పాజిటివ్‌గానే థియేటర్‌దాకా లాక్కొచ్చేదాకా వదలరు"

భూషణం ఇంక శ్రోతగానే వుండిపోయాడు.

"అగ్రజా... ప్రపంచం ఓ సంధిదశలో నడుస్తోంది. వస్తువుల ప్రవాహంలో కొట్టుకుపోతున్నారు. జీవితం అంటే అర్థం మారిపోయింది. ప్రపంచం చాలా దగ్గరగా వచ్చి ఇరుగ్గా మారిపోయింది. అందుకే మనిషి మనసుని అర్థంచేసుకున్న వాడే ఈ కాలపు రారాజు" అన్నాడు.

"ఏమో సోదరా, మేం మాత్రం నిమిత్త మాత్రులం" అన్నాడు.

"అవును. గీతలో గోవిందుడు అదే చెప్పాడు. ఇప్పుడు మనం కొంచెంసేపు కిందకు వెళ్తే స్విమ్మింగ్‌పూల్‌లో ఈదవచ్చు"

"పదండి పోదాం" అన్నాడు.

ఇద్దరూ కిందకు వెళ్ళారు. స్విమ్మింగ్ పూల్ అందంగా వుంది. ఆడా, మగా స్విమ్ సూట్‌లో కనిపిస్తున్నారు. నీళ్లలోకి దూకి ఆనందంగా కేరింతలు కొడుతున్నారు.

"అగ్రజా... మీరు రాగలరా? "

"లేదు. మేం చూస్తుంటాం. మీరు ఈదండి" అన్నాడు భూషణం. ఏ.ఎన్ స్మిమ్మింగ్ డ్రెస్ వేసుకొని వచ్చి నీళ్లలో దూకాడు. చాలా హాయిగా అనిపించింది.

భూషణం అక్కడ సీట్లో జారగిలబడి అందాలన్నింటినీ తిలకిస్తున్నాడు.

అరగంట తర్వాత బయటికొచ్చాడు ఏ.ఎన్.

"ఫ్రెష్‌గా వుంది అగ్రజా... మనం కొంచెంసేపు సిటీ చుట్టొద్దామా" అన్నాడు.

"పదండి"

అంతలో లాయర్ గుర్తొచ్చాడు.

"ఎనిమిది గంటలకి మనకో ఫోన్ రావాలి. అది రిసీవ్ చేసుకున్నాక వెళ్దాం" అన్నాడు ఏ.ఎన్.





ఇద్దరూ గదికి వచ్చారు. టీ.వీ. ఆన్ చేశారు.

"ఇందాక కొట్టుకున్న వాళ్ళు రారా" అనడిగాడు భూషణం.

"వారానికొకసారే వస్తారు. ఇదివరకు కూడా రాచకుటుంబాల్లో ఇలాంటి ఆటలే వుండేవి. బానిసల్ని కొనుక్కొచ్చి చచ్చేదాకా యుద్ధాలు చేస్తుంటే చూసేవాళ్ళు. బుల్ ఫైట్స్ అంతే. మనిషా? పశువా? ఎవరు ముందు చావటమా అనేదే పోటీ. చాలా వికృతానందం" అన్నాడు ఏ.ఎన్.

"అవునవును" అన్నాడు భూషణం.

ఎనిమిది గంటల అయిదు నిముషాలకు ఫోన్ మోగింది.

"యస్. ఏ.ఎన్. హియర్"

"సర్... ఇప్పుడే వస్తున్నాను. అన్ని డాక్యుమెంట్స్ చూశాను. మీరు ఎలాంటి అనుమానం లేకుండా ఎగ్రిమెంట్ చేసుకోవచ్చు"

"థ్యాంక్యూ సర్. రేపు ఉదయం ప్రోగ్రాం గుర్తుందిగా"

"గుర్తుంది సర్"

"మేం వస్తాం"

"అలాగే"

ఫోన్ పెట్టేశాడు. భూషణం వంక చూశాడు.

"ఆ పని పూర్తయిపోయింది. ఇంక రేపు నాలుగు గంటల్లో ఒక పెద్ద పని పూర్తయి నట్లే. ఇప్పుడు మనం బయటికెళ్దాం అనుకున్నాంగానీ ఇంత క్యాష్ వుంచుకొని వెళ్ళటం అంత మంచిదికాదు. రేపటికి చాలా వరకు డిస్పోజ్ అవుతుంది. రేపు వెళ్దాం. లేదా మనం రాబోతూంది ఇక్కడికే కాబట్టి తర్వాత చూద్దాం"

భూషణం అంగీకారంగా తలూపాడు.

★ ★ ★

ఉదయం లేవగానే-

నీట్‌గా తమ టేబుల్‌మీద నాలుగు రకాల దినపత్రికలు, ఫ్రూట్స్, మినరల్ వాటర్ బాటిల్స్ ఎరేంజ్ చేసున్నాయి. మినీ ఫ్రిజ్‌లో కూల్‌డ్రింక్స్ వున్నాయి. ఇంకో పది నిముషాల తర్వాత చిరునవ్వుతో ఓ యువతి వచ్చి పలకరించింది. పక్కలు మార్చారు. టవల్స్... సోప్స్ మార్చారు. విష్‌చేసి వెళ్ళిపోయారు. ఇద్దరూ స్నానాలు ముగించి రూమ్‌కే టిఫిన్ తెప్పించుకు తిన్నారు. భూషణం బిల్లు అందుకుని చూశాడు.

"ఇదేంటి సోదరా ఇంత మొత్తమా? "

"అవును స్టార్ హోటల్స్ బిల్స్ అలానే వుంటాయి"

"పదార్థములు ఇంత చెత్తగా వున్నాయేమిటి? "

"అదంతే..."

"మన సూరి వెయ్యిరెట్లు అద్భుతంగా చేస్తాడు దీనికంటే"

"అవును 'షా' కూడా ఆ ముక్కే అన్నారు. ఇవన్నీ కేవలం సోషల్ స్టేటస్‌కి మాత్రమే అగ్రజా. ఊరి చివర డాబాలని వుంటాయి. అక్కడ లారీ డ్రైవర్లకోసం మంచాలుంటాయి. అక్కడకి వెళ్ళి తింటే రుచికి రుచి ధరలు చాలా తక్కువగా వుంటాయి"

"మీరు మన 'సూరి'కి ట్రైనింగ్ ఇప్పిస్తానన్నారు. ఇంతనీచంగా చెయ్యటానికా" అన్నాడు భూషణం.

"అన్నిచోట్లా ఇంత చెండాలంగా వుండదు. కొన్ని కొత్త వంటకాలు నేర్చుకుని వుండటం మంచిదేకదా" అన్నాడు ఏ.ఎన్.

"అవును... వాడిని కూడా మీరు తలుచుకుంటే మహానుభావుడ్ని చేయగలరు" అన్నాడు నవ్వుతూ భూషణం.

ఓ చిన్న బ్యాగ్‌లో కొంత డబ్బుని విడిగా

తీశాడు. సూట్‌కేసు కూడా తమతో తీసుకు వెళ్ళారు. కారు ఇంటిముందు ఆగేసరికి లాయర్ వాకిట్లో వున్నాడు. వచ్చి కారు ఎక్కాడు.

"మీట్ మై బ్రదర్ భూషణ్... ఎం" అన్నాడు.

లాయర్ విష్ చేశాడు. బ్యాంక్ దగ్గర కారు ఆగింది. మేనేజర్ రూమ్‌లోకి వెళ్ళి కూర్చున్నారు. అప్పటికప్పుడు 'డ్రింక్స్' వచ్చాయి. ఎకౌంట్ ఓపెన్ చేయటానికి అవసరమైన ఫారాలన్నీ చకచకా ఫిల్ చేశారు. మొత్తం నాలుగు లక్షలు కరెంట్ ఎకౌంట్‌లో వేశారు. చెక్ బుక్ యిచ్చారు.

"ఫిక్సెడ్ డిపాజిట్‌లో కొంతవేస్తే బాగుంటుందేమో" అన్నాడు మేనేజర్.

"నాట్ నౌ సర్. మేం ఓ పెద్ద ప్రాజెక్ట్ చేయబోతున్నాం. ఫండ్స్ కావాలి. బట్ విథిన్ షార్ట్ స్పాన్ ఆఫ్ టైమ్‌లో మీకు కొన్ని ఫిక్సెడ్ డిపాజిట్స్ ఇవ్వగలననుకుంటున్నాను"

"మోస్ట్ వెల్‌కమ్ సర్" అన్నాడతను.

"మీరు క్రెడిట్ కార్డ్ తీసుకున్నారా... తీసుకునేవుంటారనుకోండి"

"లేదు సర్. తీసుకోవాలి. ఇంకా సెల్ ఫోన్, ఫాక్స్, అన్నీ ఓ ప్రాసెస్‌లో వస్తాయి. మీకు తప్పకుండా చెబుతాం"

"మా బ్యాంక్ మీకెప్పుడూ సర్వీసెస్‌ని ఎక్స్‌టెండ్ చేస్తుంది"

"థాంక్యూ సర్"

ముగ్గురూ బయటకొచ్చారు.

"ఇప్పుడెక్కడికి? "

"రేపట్నుంచే ఇంటీరియర్ డెకరేషన్స్ మొదలు కావాలి. వాళ్ళతో డిస్కస్ చేద్దాం. మీకు తెలిసిన వాళ్ళు ఎవరైనా వున్నారా? మన 'షో'రూమ్స్ సింపుల్‌గా చెప్పాలంటే ఇంతకుముందు రాని పద్ధతుల్లో వుండాలి"

"నాకో ఆర్టిస్ట్ తెలుసు" అన్నాడు లాయర్.

"పదండి. ఆయన్తో డిజైన్ గీయించుకుందాం" అన్నాడు ఏ.ఎన్.

"కానీ ప్రాబ్లమ్ ఏంటంటే... ఆయన ప్రొఫెషనల్ ఆర్టిస్ట్ కాదు. చాలాకాలం క్రితం కొన్ని చిత్రాలు గీశారు. చాలామంది ఆయన్తో తమ ఇళ్ళకోసం వాల్స్‌మీద డిజైన్ చేయించుకోవాలనుకున్నారు. ఆయన అంగీకరిస్తే కొన్ని లక్షల రూపాయలివ్వటానికి తయారుగా వున్నారు. అంగీకరించరు, అలా అని అసలు వేయరా అంటే వేస్తారు. ముందు మనుషులు ఆయనకి నచ్చాలి. ఆయన వారిని ప్రేమించాలి. ఇటీవల ఆయన ఫ్రెండ్ ఇంటికి రెండు డిజైన్స్ వేశారు. వాటిని చూస్తుంటే 'ఓహో' అనుకుంటాం. ఒక్కనయాపైసా తీసుకోలేదు. ఆ రకంగా డిజైన్‌కి అతని మార్కెట్ వాల్యూనిబట్టి లెక్కకడితే జస్ట్ సిక్స్ లాక్సవుతుంది" అన్నాడు.

భూషణం ఏ.ఎన్.కేసి చూశాడు. ఈ ప్రపంచపు వింతలు అడుగడుగునా ఎదురౌతున్నాయి.

"పిక్యూలియర్ పర్సన్స్. దే డోంట్ వాంట్ మనీ.. తమలోని కళాతృష్ణకు ఏ క్షణం రూపం యిస్తారో తెలియదు. కనీసం ఆ మహానుభావుడ్ని చూసే అదృష్టం కల్పించండి" అన్నాడు ఏ.ఎన్.

"ట్రై చేద్దాం. ఆయన దర్శనం దొరికినా మనం అదృష్టవంతులమే" అన్నాడు లాయర్.

కారు ఆయన చెప్పిన విధంగా వెళ్తోంది.

"మొత్తంమీద వారి మిత్రులు చాలా అదృష్టవంతులు"

"అదృష్టం కాదండి. హీ డిజర్వ్‌డ్ ఇట్. కళమీద ఆయన ఎంతో కృషిచేశారు. ఎంతమందో పెద్ద, చిన్న చిత్రకారుల చిత్రాల్ని ప్రపంచానికి పరిచయం చేశారు. 'పాత కీర్తి





తోనే బతుకుతావా... నువ్వెందుకు బొమ్మలు గియ్యవు' అని పోట్లాడితే చకచకా పాతిక బొమ్మలు గీసిచ్చారు."

"అలాగా... మా భూషణంగారు కూడా చిత్రకారులే. కాకపోతే కేవలం తన ఆనందం కోసం బొమ్మలు గీశారు. దాంట్లో పరిణతి సాధించాలని ఆయన అనుకోలేదు"

కారు ఓ ఇంటిముందు ఆగింది.

"నేను కనుక్కుని వస్తాను" అని లోపలకు వెళ్ళాడు.

ఆనందంగా తిరిగివస్తూ...

"ఉన్నారు రండి" అన్నాడు.

ఇంట్లోకి వెళ్ళేసరికి ఆయనకాక ఇంకెవరో కనిపించారు.

"వీరు ప్రఖ్యాత కళావిమర్శకులు రావుగారు" అని పరిచయం చేశాడు లాయర్.

"మీరు కార్లో చెప్పింది వీరి గురించేనా?"

"అవును"

"ఇద్దరు మహానుభావుల్ని ఒకేచోట కలుసుకున్నందుకు ఆనందంగా వుంది. నన్ను ఏ.ఎన్. అంటారు ఆర్ట్ లవర్‌ని. ఇతను మా సోదరుడు భూషణం"

వారిద్దరూ నమస్కరించారు.

"మరి నేను బయలుదేరతాను" అని సైగ చేశారు రావ్.

"అలాగే" అన్నారాయన.

ఆయన చిరునవ్వుతో అందరికీ నమస్కరించి వెళ్ళిపోయారు.

"కూర్చోండి" అని కుర్చీలు చూపించారాయన.

అరవై సంవత్సరాలు పైబడి వుంటాయనిపించింది. కుర్చీలకేసి చూశాడు ఏ.ఎన్. అపురూపంగా వున్నాయనిపించింది. భూషణం గోడలకేసి కళ్ళప్పగించి చూస్తున్నాడు. చూపులు ఎక్కడికక్కడ నిలిచిపోతున్నాయి. పరమాద్భుత చిత్రాలు... ప్రకృతి దృశ్యాలు, ఆడవారు, గిరిజనులు, ఆ రంగులు, ఆ గోడలకి వన్నెతెచ్చాయి. ఆ సుందర కళాకృతుల ముందు శిలగా మారి తనివితీరేదాకా చూడాలనిపిస్తోంది.

ఆ ఇంట్లో ఏ వస్తువుని చూసినా అందులో కళాత్మకత, ఎలాంటి ఆడంబరాలు లేవు. అత్యంత సాదాసీదాగా వుంది.

"కొంచెం టీ తాగుదామంటారా" అన్నారాయన.

"నేను తెస్తాను" అనేసి లోపలకు వెళ్ళాడు లాయర్ చొరవగా.

"వాటిని దగ్గరనుంచి చూడాలనుంది" అన్నాడు భూషణం.

"చూడండి" అన్నారాయన.

భూషణం అలా గోడచుట్టూ అడుగులు వేస్తున్నాడు.

లాయర్ టీ కప్పుల్తో వచ్చాడు.

ఏ.ఎన్. లేచి అందుకుని భూషణానికి ఇచ్చాడు.

వాటిని సిప్‌చేస్తుంటే తిరిగి ఇంకేవో లోకాలకు వెళ్ళినట్లనిపించింది.

"అవును మరి. ఈ మహాకళాకారుడికి డబ్బుతో పనేముంది. ఏం చేసుకుంటారాయన. జీవితంలో కళయిచ్చే అనంతమైన తృప్తిని సొంతంచేసుకున్నవాడు. నిజంగా మామూలు మనుషులకు భిన్నమైనవాడు" అనుకున్నాడు ఏ.ఎన్.

"చెప్పండి. మీరేం చేస్తుంటారు?" అన్నారాయన చిరునవ్వుతో. ఏ.ఎన్. భూషణం గురించి, వారి వంశం ఏవిధంగా శిధిలమైందీ చెప్పాడు.

"మేం ఇక్కడ ఓ ట్రెడిషనల్ కలెక్షన్ సెంటర్ తెరవాలనుకుంటున్నాం. అందులో రేర్ యాంటిక్స్ వుంటాయి. అలాగే మరో



పక్క ఆధునికమైన మరో షాప్ వుంటుంది. ఈ రెండింటికీ ఎవరితోనైనా డిజైన్ చేయిం చాలనుకున్నప్పుడు లాయర్‌గారు మీ పేరు చెప్పారు. మీ గురించి ఇతర విషయాలు కూడా చెప్పారు. అందుకే మిమ్మల్ని అడిగే సాహసం చెయ్యటం లేదు. మిమ్మల్ని ఓసారి చూసి వెళ్దామని వచ్చాం" అన్నాడు ఏ. ఎన్.

భూషణం వచ్చి కూర్చున్నాడు. ఆయన భూషణంకేసి నిశితంగా చూశారు. ఏమను కున్నారో ఏమోగాని లాయర్‌ని పిలిచారు. అతని చెవిలో ఏదో చెప్పారు. లాయర్ తలూపాడు.

"గురువుగారు సరే అన్నారు. కాకపోతే ప్రాబ్లమ్ ఒకటే. ఆయన స్కెచ్ ఇచ్చేంత వరకూ మీరు వెయిట్ చెయ్యగలరా అని"

"ఎదురుచూద్దాం"

"కానీ బిజినెస్ వెంటనే ప్రారంభం కాక పోతే మీకు నష్టం కలగవచ్చు"

"కానీండి. మిగతాపనులు చాలా వున్నాయి. ఈలోగా వాటిని పూర్తిచేద్దాం. అయినా తాజ్‌మహల్‌లాంటి ప్రపంచ అద్భుతం రూపుదిద్దుకోటానికి కళాకారుల్ని తొందరపెట్టకూడదు. సృజన ఎప్పుడు వెల్లి విరుస్తుందో ఎవరు చెప్పగలరు" అన్నాడు ఏ. ఎన్.

ఆయన ఏ. ఎన్. కేసి కొంచెంసేపు చూశారు.

తిరిగి లాయర్‌ని దగ్గరికి పిలిచి ఏదో చెప్పారు. తర్వాత లేచి నమస్కారంపెట్టి లోపలకు వెళ్ళిపోయారు.

కారులో కూర్చున్నాక చెప్పాడు లాయర్ "సాయంకాలం నన్నోసారి రమ్మన్నారు. కారణం తెలియదు"

ఏ. ఎన్. టైమ్ చూసుకున్నాడు.

"లంచ్ చేద్దాం. మంచి హోటల్‌కు వెళ్దాం" అన్నాడు.

హోటల్ ముందు దిగి లోపలకు వెళ్ళారు. రెస్టారెంట్‌ని చెట్టు మీద ఏర్పాటు చేశారు. చెట్టుకొమ్మల చుట్టూ అందంగా జరిపిన నిర్మాణం చూశాక అన్నాడు ఏ. ఎన్.

"మన పల్లెటూర్లలో చెట్టునీడన కూర్చుని భోంచేస్తాం కదా. అలాంటి ఎఫెక్ట్ నివ్వటా నికే ఇవన్నీ... ముందు సూప్ అనే గంజి తాగుదాం" అన్నాడు.

ఏమేం కావాలో ఆర్డరు చేశాక.

"అన్నీ టైప్ చేయించారు కదా" అన్నాడు.

"రెడీ... వెళ్ళటం మిగతా ఫార్మాలిటీస్ పూర్తిచేసుకోవటం. మా అసిస్టెంట్ మనం వెళ్లేసరికి అక్కడ వుంటాడు"

"వెరీగుడ్"

భోజనాలు వచ్చాయి. తినటం మొదలు పెట్టారు.

"నాకయితే ఆ ఇల్లు విడిచి రావాలనిపిం చలేదు. ముఖ్యంగా ఆ చిత్రాలు చూస్తుంటే నాకు గత జన్మ ఏదో వుందనిపించింది" అన్నాడు భూషణం.

"ప్రతి మనిషికీ అలా అనిపించటం సహజం అగ్రజా" అన్నాడు ఏ. ఎన్.

"ఆయన చేర్చుకోవాలేగాని నా బతుకంతా ఆయనకు శిష్యరికం చేయాలనిపించింది. అయినా ఆయనలా 'కళ' పట్టుబడు తుందా? "

"ఆయనలా అవసరంలేదు అగ్రజా... మీలా మీరూ సాధన చేయవచ్చు" అన్నాడు ఏ. ఎన్.

"ఒక్క గంట మన సూట్‌లో రెస్ట్ తీసు కున్నాక బయలుదేరుదాం" అన్నాడు భోంచేసి బయటకు వచ్చాక.

"అలాగే" అన్నారు.

★ ★ ★

సాయంకాలం నాలుగు గంటలు...





కాంప్లెక్స్‌లో ఎగ్రిమెంట్ మీద సంతకాలు చేస్తున్నారు. చివరి నిముషంలో **మొత్తం** పది సంవత్సరాలకు లీజ్ ఇవ్వటానికి అంగీకరించాడు. అనుకున్నట్లుగానే కొంత మొత్తం క్యాష్ రూపంలో మిగాతాది చెక్కు రూపంలో యిచ్చారు. ఇంకొక్కవారంలో ఈ భాగం మీ ఆధీనంలోకి తీసుకోవచ్చునని చెప్పారు. ఒకరినొకరు అభినందించుకున్నాక "త్వరలో కలుసుకుందాం" అని చెప్పి బయటకు వచ్చేశారు.

లాయర్‌కి ఫీజు చెల్లించాడు.

"మీరు మాకు చాలా సహాయం చేశారు. మీ గురించి అంతకుముందు నేను విన్నాను. ఇప్పుడు బిజినెస్ పూర్తికావటంతో మన బంధం తెగినట్లు కాదు. ముందే చెప్పినట్లు మా లీగల్ అడ్వయిజర్ మీరు. నాకిప్పుడు రెండు మంచి పేర్లు కావాలి. ఒకటి నిన్నని ప్రతిబింబిస్తే... ఇంకొకటి రేపుని టచ్‌చేయాలి. 'యాంటిక్ కార్నర్' అనే పేరుపెట్టి చిన్న అక్షరాల్తో ఫిఫ్టీన్త్ సెంచరీ అని రాయిస్తే బాగుంటుందా అనే ఆలోచన... లేదా... ఓ విభాగానికి 'యస్టర్ యియర్స్' అని రెండో విభాగానికి 'టుడే టుమారో' అని పెడితే ఎలా వుంటుందా అనే ఆలోచన. మీరూ ఆలోచించండి. బట్ లోగోమాత్రం ఖచ్చితంగా మా అగ్రజులూ, భోషాణం ఈ కాన్సెప్ట్‌ని దాటిపోకుండా వుండాలి. సర్... యంగ్ ఆర్టిస్ట్స్ ఎందరో వున్నారు. ఇలాంటి పనుల్ని వాళ్ళకు అప్ప చెబుదాం. నిన్నటి తరానికి వారేమాత్రం తీసిపోరు. నేటికి ప్రతినిధులు వాళ్ళు. ఎవరేమన్నా నేటినుండి రేపట్లోకి అడుగులేస్తున్నారు వాళ్ళు. ఇంకా ఈ ఎగ్రిమెంట్స్ ఫొటోకాపీలు తీయించి మీ దగ్గర వుంచండి. అవసరమైతే మిగతా పనులు చూడండి. మేం బహుశా రేపు వెళ్తాం. తొందరలో తిరిగి వస్తాం"

కారు లాయర్ ఇంటిదగ్గర ఆగింది. ఆయన్ని దింపేశాక హోటల్ కెళ్లారు. "భయ్యా త్వరగా ఫ్రెషప్ అయితే సిటీ చుట్టివద్దాం" అన్నాడు.

గంటలోపు ఇద్దరూ తయారైపోయారు.

ఇంక వారి దగ్గర కొద్దిపాటి డబ్బు మాత్రం మిగిలుంది.

దాన్ని చిన్న బ్యాగ్‌లో సర్ది తన వెంట తీసుకొచ్చాడు.

నగర వీధుల్లో కారు ప్రయాణం చేస్తోంది. లైట్లు చీకట్లను పారద్రోలుతున్నాయి. ఎటు చూస్తే అటు మానవ ప్రపంచం, సముద్రంలోని చేపల గుంపుల్లా కదులుతున్నారు.

"చూశారా వేగం" అన్నాడు ఏ.ఎన్.

భూషణం తల పంకించాడు.

"అక్కడ టైం నడవదు. ఇక్కడ టైం వుండదు. సాయంకాలం అయితే చాలు పరుగేపరుగు. ఇరుకు గదుల్లోకి, బార్లలోకి, వ్యభిచారగృహాల్లోకి, అక్కడక్కడా పరుచుకున్న పార్కుల్లోకి. అంతిమంగా నగరాన్ని చుట్టేసి వలయంలా ఏర్పడిన కాలుష్యంలోకి'

భూషణం మాట్లాడలేదు. తదేకంగా చూస్తున్నాడు. ఎర్రలైట్ల దగ్గర బారులు తీరి ఆగిన వాహనాలు, అక్కడకి చేరే అడుక్కునే వాళ్ళు. రోడ్డుకి అడ్డదిడ్డంగా వెళ్తున్న స్కూటర్లు, కార్లు. ఏదో వాసన, విగ్రహాలు, వంతెనలు.

"కారుని ఆపకు. పెట్రోలుందిగా"

"ఉంది సార్"

"చలో... అఛ్ఛా సాంగ్స్ నై"

"హైసాబ్" అన్నాడు డ్రైవర్.

మెల్లగా సంగీతం మొదలయింది సిటీ ఔట్‌స్కర్ట్స్ ఆరంభం...

"ప్యార్‌కియాతో డర్నా క్యా... జబ్ ప్యార్ కియాతో డర్నాక్యా"

భూషణం అడిగాడు.

"ఆ పాట అర్థంఏమిటి? "

"ప్రేమించటానికి భయపడటమెందుకు? ప్రేమిస్తే ఎందుకు భయపడాలి ఈ మనుషులకి, ఈ ప్రపంచానికి" అంటున్నాడు కవి.

"అగ్రజా... ఆ గాయకుడి కంఠంలో ఆ పాట పలుకుతున్న తీరు చూడు. నిజం, నిజం, ప్రేమించేవాడు దేనికీ భయపడకూడదు. అది అమ్మాయిని కావచ్చు దేశాన్ని కావచ్చు ఆశయాన్ని కావచ్చు నిన్నని కావచ్చు రేపటిని కావచ్చు"

ఏ.ఎన్.లో ఉద్వేగం. అతనలా తనలో తాను మాట్లాడుకుంటూనే వున్నాడు.

భూషణానికి మాత్రం తెరలు తెరలుగా దుఃఖం పొంగుకొస్తోంది. తన వాళ్ళు అందరూ గుర్తొస్తున్నారు. అందరూ దూరమైపోయారు. కొందరు తిరిగిరారు. కొందరు ఎక్కడున్నారో తెలియదు. ఇంత కాలం ఒంటరిగా, అనాగరికంగా, శిలలా బతకటం ఎలా సాధ్యపడింది. ఎవ్వరితడు? ఎక్కడనించి వచ్చాడు. ఇతను రేపు తనని విడిచి వెళ్ళిపోతే ఎలా బతకటం?

"మిత్రమా... ఆగకుండా వస్తున్న కన్నీళ్లను తుడవాలని ప్రయత్నం చేయకు. మన సారా ఏడవనీ. నాలోని సర్వ అవలక్షణాలూ కరిగిపోయేలా ఏడవనీ. మనుషులందరూ ఒకటేనని ఇపుడిపుడే అర్థంచేసుకుంటున్నా. నాకిప్పుడు జీవితంలో ఎన్నడూ లభించని ఆనందం, దుఃఖం దొరికిపోయింది. ఎంత అల్పుణ్ణి. ఎంతెంత అల్పుణ్ణి"

భూషణం మనసు ఘోషిస్తోంది.

ఏ.ఎన్. ఎందుకో పక్కకు తిరిగాడు.

భూషణం కళ్ళవెంట కన్నీరు జారిపడుతోంది. అలా బుగ్గలమీద జారి కిందపడి చిట్లిపోతున్నాయి.





ఏ.ఎన్. అతన్నలా వదిలేశాడు.

హోటల్‌కి వెళ్లేసరికి అర్జెంట్ మేసేజ్ వుంది.

"ప్లీజ్ కాంటాక్ట్ ఇమ్మీడియట్లీ" అని తన నెంబర్ యిచ్చాడు లాయర్.

వెంటనే అతనికి ఫోన్ చేశాడు.

"ఇందాక గురువుగారింటికి వెళ్ళాను. మీకో థ్రిల్లింగ్ న్యూస్" అన్నాడు లాయర్.

"చెప్పండి"

"సార్ అద్భుతమైన డిజైన్ చేశారు. రేపొకసారి ఆ ఏరియా మొత్తం చూడాలన్నారు. అప్పుడు పూర్తి స్కెచ్ మనకు ఇచ్చేస్తారు"

"నిజమా? "

"అవును. యూ ఆర్ సో లక్కీ... గురువుగారు ఇంత త్వరగా స్పందించటం నాకు తెలిసినంతవరకు ఇదే మొదటిసారి"

"ఒక్క నిముషం" అని.

"అగ్రజా. సార్ మనకోసం ఓ గొప్ప స్కెచ్ రూపొందించారంట. రేపు ఉదయం మన స్థలం చూడబోతున్నారు" అని చెప్పి.

"లాయర్‌గారూ మేమిప్పుడు బయలుదేరి రావచ్చా? " అనడిగాడు.

"వద్దులెండి. ఆయన పడుకుంటారు. రేపు ఉదయం వస్తే ఆయన్ని తీసుకెళ్ళి మన స్థలం చూపించొచ్చు"

"కానీ ఆయనకి రెమ్యునరేషన్ ఇవ్వాలో... దానికి ఖరీదు ఎలా కట్టాలో నాకు అర్థంకావటంలేదు"

"ఇప్పుడా విషయాలు ఏమీ మాట్లాడొద్దు... తర్వాత మెల్లగా ఆయన్నే అడుగుదాం. ఈ ఆనందాన్ని మీతో పంచుకోవటానికి ఈ ఫోన్ చేశాను"

"ధన్యవాదాలు లాయర్‌గారూ. ఇంక ఈ రాత్రికి నిద్రపట్టదు"

"త్వరత్వరగా తెల్లవారిపోతుంది లెండి, గుడ్‌నైట్" అని ఫోన్ పెట్టేశాడాయన.

ఏ.ఎన్. భూషణం కళ్ళలోకి చూశాడు.

"కలిసొచ్చేకాలంలో నడిచొచ్చేబిడ్డ పుడతా డంటారు" అన్నాడు భూషణం నవ్వుతూ.

సూట్ కి వెళ్ళాక అడిగాడు.

"డిన్నర్ తెప్పించుకుందామా? "

"ఈరోజు భోజనం చేయాలనిపించటం లేదు"

"ఎందుకని? "

"ఏమో తెలియదు"

"అనంతమైన తృప్తో, వేదనో, మరింకే దైనా భావమో విరుచుకుపడుతున్నప్పుడు ఏమీ తినాలనిపించకపోవటంలో ఆశ్చర్యం లేదు"

"కానీ ఈ స్థితి ఎప్పుడూ వుంటే బాగుం టుందేమో"

"బాగుండదు. అలా వుంటే మంచి వారంతా దుర్మార్గులుగానూ, దుర్మార్గులంతా మంచివాళ్ళుగా మారిపోతారు" అన్నాడు ఏ. ఎన్.

ఆ రాత్రి భూషణం త్వరగానే నిద్రపో యాడు.

ఏ. ఎన్. కళ్ళు మూతలు పడక తన్నుకు న్నాడు.

ఉదయం లేచి లాయర్ని, ఆర్టిస్టుని తీసు కుని వెళ్ళారు. ఆర్టిస్ట్ రామ్ మౌనంగానే ఆ ప్రాంతాన్నంతా పరిశీలించారు. ముఖ్యంగా మూలల్లో నిలబడి చూసుకున్నారు. ఎక్కడి నుండి ఎక్కడికి గోడ కడితే బాగుంటుందో చూసుకున్నారు. ఎక్కువ ఆకర్షణలన్నీ టుడే అండ్ టుమారో షాప్కే కేటాయించారు. 'యస్టర్ యియర్స్'కి మాత్రం వాల్ డెకరే షన్ ప్రధానంగా సూచించారు.

సాయంకాలానికి ఆయన మొత్తం స్కెచ్ని అందజేశారు. ఏ.ఎన్. అమాంతం ఆయన పాదాలమీద పడిపోయాడు. ఆయన మెల్లగా లేవదీసి భుజం తట్టారు. ఇంట్లోనుండి టీలు తెప్పించి అందరికీ స్వయంగా ఇచ్చాడు.

"సర్" అని ఆగిపోయాడు ఏ. ఎన్.

"ముందది కానీయ్" అన్నారాయన.

నమస్కారం పెట్టేసి బయటకు వచ్చారు.

"సార్.. ముందు ప్రారంభోత్సవం జరగ నీయండి. ఆ తర్వాత ఏం చేయాలో ఆలో చిద్దాం. నేను రాగానే వర్క్ మొదలుపె డదాం. మంచి పనివాళ్ళు కావాలి. గురువు గారు కాగితంమీద ఎలా ఇచ్చారో అలానే కనిపించాలి. త్వరలో వచ్చేస్తాం" అని శెలవు తీసుకున్నాడు.



ఇంటికి వచ్చేసరికి సూరిబాబు ఎదురు చూస్తున్నాడు, తనకిచ్చిన బట్టలు చూసు కుని.

"ఇవన్నీ నాకేనంటండయ్యా" అన్నాడు.

"నీకే"

"తొడుక్కుంటే నవ్వుతారేమో"

"ఎవరయ్యా నవ్వేది. చూసి అదిరిపో తారు. హైదరాబాద్ వెళ్ళాక నీ హెయిర్ స్టైల్ మార్చి పారేస్తా" అన్నాడు.

గది తలుపులు తీసి భోషాణాన్ని ప్రేమగా చూసుకున్నారు.

రాత్రికి ఏ.ఎన్. ఎదురుగా సూరి కూర్చున్నాడు.

"ఇంక నీ పని మొదలైనట్లే. రేపట్నుంచి ఈ చుట్టుపక్కల దొరికే పాత సామాన్లన్నీ కొనేసి పెట్టు. కావాలంటే ఎవరి ఇల్లన్నా ఖాళీగా వుంటే అద్దెకి తీసుకొని అందులో వేసి ఉంచు. వాటన్నింటినీ లారీల్లో మనం హైదరాబాద్ తీసుకుపోదాం"

"అలాగేనండయ్యా... కానీ ఎంతకు కొనమంటారు? "

"చూడవయ్యా వస్తువునిబట్టి చూడు. అవసరమనుకుంటే కొంత ఎక్కువ యిచ్చినా ఫర్లేదు. ఎవర్నీ బలవంతపెట్టొద్దు. ఎందుకివన్నీ కావాలంటున్నారంటే ఆఫీసు తెరుచుకుంటున్నారని చెప్పు. సరేనా? "

"అట్లాగే"

"ఎక్కడికి తిరిగినా రాత్రికల్లా ఇక్కడికి వచ్చేసి మొత్తం వివరాలు చెప్పి వెళ్లు" అన్నాడు ఏ.ఎన్.

మరుసటి రోజునుండి ఆ కార్యక్రమంలో దిగిపోయాడు సూరి.

రాత్రిపూట వచ్చి అన్నీ చెబుతున్నాడు.

"చిన్నచిన్న వాటిని వూరికే తీసుకుపొమ్మంటున్నారండి. ఇల్లు పట్టడంలేదు. పిల్లలు పట్నాల్లో వీటికోసం గదులు ఎక్కడ తీసుకోమంటారని వద్దంటున్నారంట. అందుకే ఎంతొచ్చినా చాలంటున్నారు. డబ్బులు కాకుండా ఉల్లిపాయలు, చింతపండు లాంటివిస్తే ఇంకా ఎగబడతారండి" అన్నాడు సూరి.

"ఉల్లిపాయల ధర పెరిగింది. తగ్గినాక ఆలోచిద్దాంగానీ ఇట్లాంటి ఆలోచనలు మానవయ్యా" అన్నాడు ఏ.ఎన్.

చెప్పినట్లుగానే షా వచ్చాడు. ఆయన్తోపాటు పెద్ద లారీ వచ్చింది. లారీకి అన్ని చక్రాలుంటాయని ఆ వూర్లో చాలామందికి తెలియదు. ఆ వూరి మనుషులు తలో చెయ్యివేసి జాగ్రత్తగా ఆ భోషాణాన్ని లారీలోకి తరలించారు. ఇంటికి చెందిన డబ్బునీ, భోషాణానికిస్తున్న డబ్బునీ ఇచ్చేశాడు.

ఇంటికి చెందిన రిజిస్ట్రేషన్ కార్యక్రమాల్ని దగ్గరుండి పూర్తి చేయించుకున్నాడు. ఇంటికి తాళం వేసుకుంటానంటే రెండు రోజులు ఆగమని అడిగాడు ఏ.ఎన్. ఈసారి కేథరిన్ రాలేదు. ఆ ఊర్లోనే షా ఓ వ్యక్తిని తన ఉద్యోగిగా పెట్టుకున్నాడు. ఆ ఇంటిని తరలించేదాకా అతను కాపలా వుండాలి.

భోషాణం లారీలోకి చేరిన వెంటనే భూషణం కళ్లవెంట నీళ్లు బొటబొటా కారాయి. ఏ.ఎన్ అనునయంగా భుజం తట్టాడు.

"సోదరా మా వంశానికి చెందిన చిట్టచివరి జ్ఞాపకం" అన్నాడు.

"ఈ గ్రామంలో వుండటంవలన దానికి రావలసినంత ఖ్యాతి రాలేదు. ఇంక చూడండి ఈ భోషాణాన్ని చూసిన వారెవరైనా మీ వంశం గురించి తలుచుకుంటారు" అన్నాడు.

షా ఒక రోజంతా అక్కడే వుండి, వీడ్కోలు చెప్పి వెళ్లిపోయాడు. వెళ్లేముందు తన కార్డూ, సెల్ నెంబరూ ఇచ్చి వెళ్లాడు. "హైదరాబాద్ చేరగానే నాకు తెలియజేయండి" అన్నాడు.

ఊరి జనమంతా ఆశ్చర్యంగా చూశారు. ఏదో జరిగిందని తెలుసుగానీ దాని వెనుక పెద్ద బేరం జరిగిందని తెలియదు.

"భూషణంగారి దరిద్రం తీరిపోయింది గానీ ఇల్లును కూడా అమ్ముకోవటమే బాగుండలేదే"న్నారు కొందరు.

రెండు రోజుల తర్వాత భూషణం, ఏ.ఎన్ బయలుదేరే ముందు ఆ గ్రామ ప్రజలందరికీ పెద్ద విందు చేశారు. అంతకు ముందు భూషణం అంటే ఎలావున్నా అందరూ వచ్చారు. కొంతమంది పెద్ద వాళ్ల




యితే చేతులు పట్టుకుని భోరున ఏడ్చారు.

"బాబూ మీరు కూడా వెళ్లిపోతే ఈ వూరి కళపోతుంది. మా తాతలు మీ తాతల గురించి కథలు చెప్పుకునేవారు. మనూరి సంబంధం చేసుకోవాలంటే ఎగిరి గంతేసే వారు. రామరాజ భూషణంగారి ఊరు మాది అని గుండెల మీద చెయ్యేసి చెప్పుకునేవాళ్లు. రోజులు మారిపోయినాయి. మీకు అన్యాయం జరిగిపోయింది. చివరాఖరికి వూరిడిసే వెళ్లిపోతున్నారు"

"భూషణం బాబూ పుట్టినూరు కన్నతల్లి లాంటిది. మరిచిపోబాకండి. మమ్మల్ని చూడటానికి అప్పుడప్పుడు రండయ్యా!"

"ఈడు నా మనవడండి. దీవించండయ్యా"

అందరూ తలోమాట

అందరికీ బాధ ఇప్పుడు కలిగింది.

"తప్పకుండా ఈ ఊరికి భూషణంగారొస్తారు. మీలో ఒక్కరిని కూడా ఆయన మరిచిపోరు" అని ఏ.ఎన్. అందరికీ చెప్పాడు.

సూరి కారుని తీసుకొచ్చాడు.

"సూరిబాబూ... ముందు వెళ్లగానే గోడౌన్ చూస్తాను. నువ్వు రెండు రోజులు ఆగాక హైదరాబాద్ వచ్చేయ్. ఈలోగా నీ పనిలో వుండు. అక్కడ గోడౌన్ దొరకగానే సామాన్లన్నీ వేసుకొని వచ్చేయ్. ఆ తర్వాత నువ్వు మాతోనే వుంటావ్. ఈలోగా మీ బంధువుల్నీ, మిత్రుల్నీ కలుసుకొని వీడ్కోలు చెప్పేయ్"

సూరిబాబు తలూపాడు.

భారమైన హృదయాల్తో అందరూ వీడ్కోలు పలుకుతుండగా కారు ముందుకు కదిలింది.

★ ★ ★

వెళ్లిన వెంటనే ఏ.ఎన్ సుడిగాలిలా తిరిగాడు. ముందు పెద్ద బిల్డింగ్‌ని అద్దెకి తీసుకున్నాడు. అందులోకి కావలసిన ఫర్నిచర్‌ని క్షణాల్లో తెప్పించాడు. సెల్‌ఫోన్ కనెక్షన్ తీసుకున్నాడు. లాయర్‌తో మాట్లాడి షోకేసుల తయారీ పనులు పురమాయించాడు.

కారు కొందామనుకున్నాడుగానీ షోరూమ్స్‌లో అతను కోరుకున్న కలర్ దొరకకపోవటంతో ఆగిపోయాడు.

భూషణం రిక్రియేషన్ కోసం కేబుల్ టీవీ కనెక్షన్ తీసుకున్నాడు. ఆడియో సిస్టమ్ కొన్నాడు. ముఖ్యంగా భూషణానికి ఆంగ్ల భాషనేర్పటానికి ఇంటి దగ్గరే ఓ ట్యూటర్‌ని నియమించాడు. భూషణం కూడా చాలా శ్రద్ధగా ఆ భాష నేర్చుకునే ప్రయత్నం చేస్తున్నాడు.

నాలుగు రోజుల తర్వాత సూరి వచ్చాడు. అప్పటికి గోడౌన్ తీసుకున్నారు. వెంటనే వెళ్లి తను కొన్నవన్నీ తీసుకురమ్మన్నారు. రెండు లారీలు అవసరం అయ్యాయి. కేశీమంచాలూ, చెక్క బీరువాలూ గాజుల పెట్టెలు, చిన్నచిన్న భోషాణాలు, బట్టలు తగిలించుకునే వంకీలు, ములుగర్రలు, పాత కాలపు ఫ్రేమ్స్, చేతికర్రలు, గొడుగులు ఒకటేమిటి ఏది దొరికితే అదికొన్నాడు. విరిగిపోయిన కుర్చీకాళ్లు... చెక్క దేవుళ్లు అన్నీ తీసుకొచ్చి గోడౌన్‌లో పడేశాడు.

మళ్లీ వెనక్కి వెళ్లి ఇంకో నాలుగు లారీల్లో సామాను తోలుకొచ్చాడు. ఈలోగా చకచక పనులు సాగిపోతున్నాయి. ఎవరెవర్ని కాంటాక్ట్ చేయాలో వారందరినీ కాంటాక్ట్ చేస్తున్నాడు.

షోరూమ్స్ అద్భుతంగా తయారయ్యాయి. లాయర్ అప్పుడప్పుడు చూసి వెళ్తున్నారు. సొంతం అయ్యాక ఆర్టిస్టుగారు వచ్చారు. అన్నీ పరిశీలనగా చూశాక సంతృప్తి చెందారు.

"మీరు అనుమతిస్తే ఇందులో మీ చిత్రాలు ఎగ్జిబిషన్ పెట్టాలనుంది"



అన్నాడు. అందుకాయన "ఎందుకయ్యా మరో సందర్భంలో పెట్టుకుందాం. నా ఒక్కడివే వద్దు. నా మిత్రులవీ, శిష్యులవీ కూడా వున్నాయి. మా అందరి చిత్రాలతో ఆ పని చేద్దాం" అన్నారాయన.

భూషణం వచ్చి చూశాడు. సంతృప్తితో తలాడించాడు.

ముహూర్తం నిర్ణయించాలి. టుడే అండ్ టుమారోకి చెందిన ఎంప్లాయిస్ కోసం ప్రకటనలిచ్చారు.

ఇంటర్వ్యూస్ కోసం లాయర్‌తోపాటు ఏ.ఎన్ కూర్చున్నాడు. చాకుల్లాంటి కుర్రాళ్లని సెలక్ట్ చేసుకున్నాడు. ఒకరిద్దరు షార్ప్ గర్ల్సని ఎన్నుకున్నారు. యస్టర్ యియర్స్ కోసం ఆంగ్లో ఇండియన్స్‌ని ప్రిఫర్‌చేశారు.

కంప్యూటర్స్, ఫ్యాక్స్, క్లోజ్‌డ్ సర్క్యూట్ టీవీస్, కెమేరా.. అన్నీ అమర్చారు. షాప్ లోకి అడుగు పెట్టగానే ఏవో లోకాలకి తీసుకుపోయే పరిమళం తాకుతుంది. అక్కడ నుంచి ప్లీజింగ్ మానర్స్‌తో అడుగడుగునా సహకరించే ఉద్యోగుల బృందం.. ఒకటి రెండుసార్లు ట్రైల్స్ వేశారు. పార్కింగ్ ప్లేస్‌లో జామ్ కాకుండా గార్డ్ నేర్పాటు చేశారు. అంతా సిస్టమాటిక్‌గా అయిందనుకున్నాక ఎవరెవరిని పిలిస్తే బాగుంటుందా అని చర్చించారు.

దేశంలోనే ఆయారంగాల్లో వున్న ప్రఖ్యాత వ్యక్తుల్ని పిలిస్తే బాగుంటుందనుకున్నారు. ట్రెడిషనల్ ఆర్ట్‌కి చెందిన కొందరు పెద్దల్ని, మోడ్రన్ కళాకారులుగా సంచలనం సృష్టిస్తున్న కొందరిని సెలక్ట్ చేసుకున్నారు. సినిమా తారలకు చెంది ఆర్ట్ ఫిలిమ్స్‌లో నటించే ఇద్దర్ని ఆహ్వానించారు. ఆ రోజు సంగీత విభావరి. ముందుగా గెట్ టు గెదర్. ఒక్కో విభాగం ప్రారంభించటం, ఇలా కార్యక్రమాలు రూపొందించారు. పొలిటికల్‌గా పేరున్నా ప్రవృత్తి రీత్యా ఆర్ట్ లవర్స్‌గా పేరు పొందినవారిని ఆహ్వానించారు.

ఎక్కడా గందరగోళంలేదు. ముఖ్యంగా సిటీకి రొటీన్ అయిపోయిన వ్యక్తుల్ని అసలు పిలవకుండా జాగ్రత్తపడ్డారు.

ఇంక వారం రోజుల్లో కార్యక్రమం జరుగుతుందనగా సిటీలోని ఎలైట్ వర్గానికంతా ముందుగానే కొన్ని, స్వయంగా మరికొన్ని లాయర్‌గారి ద్వారా, మిత్రులద్వారా ఆహ్వానాలు అందజేశారు.

ఇంకో రెండు రోజులుండనగా ప్రెస్‌ని ఆహ్వానించారు. ఈసారి ఎవరినీ ఒమిట్ చేయలేదు. ప్రైవేట్ ఛానల్స్ వారూ వచ్చారు. అద్భుతమైన డిన్నర్ ఎరేంజ్ చేశారు.

వీక్లీ ఎడిటర్, సూర్య, ఇన్‌ఛార్జ్, రోహిత్ హాజరయ్యారు. వారందరూ ఆశ్చర్యంతో తలమునకలయ్యారు.

"మిత్రులారా... మీరు చేసిన సహాయం మేం మరిచిపోలేం. పురాతనమైన విలువల కోసం ఓ కదలిక తీసుకువచ్చాం. ఇప్పుడు మా షాప్స్‌లో మీకు దొరకని వస్తువంటూ లేదు. ప్రపంచ ప్రఖ్యాత చిత్రకారుల చిత్రాలను ఎగ్జిబిట్ చేయబోతున్నాం. ఏ కళాకారుడైనా తమ ప్రొడక్ట్స్‌ని మాద్వారా అమ్ముకోవచ్చు. కేవలం అమ్మటమే కాదు. మేం కొంటాం. వుయ్ ఆర్ జస్ట్ మీడియేటర్స్. మాకు కావలసింది మా కమీషన్"

"చూశారా నేను అనుకున్నంతా అయింది. అతన్ది మాస్టర్ బ్రెయిన్" అన్నాడు సూర్య చాటుగా.

రాత్రి చాలా సేపు వారితో గడిపాక అందరికీ టాక్సీలు ఎరేంజ్ చేయించి పంపించాడు. ఉదయమే సూరిబాబుని తీసుకొని గోడౌన్‌కెళ్లాడు. అందులో నుండి ఓ పందిరిమంచం, నాలుగు కుర్చీలూ, ఓ టీపాయ్ లాంటి బల్ల, మరికొన్ని చిన్న వస్తువులు సెలక్ట్ చేసి షాపుకి తరలించాడు. వాటిని ఆయా స్థానాల్లో వుంచాక దాని ధర రాసి ఓ పక్కన వేలాడదీశాడు. సూరిబాబు దాని




ధర ఎంతుందో చూద్దామనుకున్నాడు. ముందు అది ధరా, వేరే ఏదైనా నెంబరా అనుకున్నాడు.

తర్వాత కొంచెంసేపు గుండాగిపోయినట్ల నిపించింది.

అక్షరాలా ఎనభై అయిదు వేల తొమ్మిది వందల తొంభై తొమ్మిది రూపాయలు మాత్రమే అందులో చూపించిన ధర.

మళ్లీ ఇంకోసారి చూశాడు. అదే ధర...

ఆ మంచం తనెంతకి కొన్నాడో గుర్తు చేసుకుందామనుకున్నాడు. అసలు మొత్తం గోడౌన్లో వున్న సరుకంతా కలిపి ఇంతకి కొన్నానా అని అనుమానపడ్డాడు.

'అయ్యగారేంటి ఇంతింత రేట్లు పెట్టారు. పైగా మంచం ఓ చోట కొద్దిగా దెబ్బ తింది. పాలిష్ చేయించలేదు. ఇంత ఆశుంటే ఎట్టారా బాబు' అనుకున్నాడు.

ఆ రోజు ఉదయం నుండి కోలాహలం. కార్లు వచ్చి ఆగుతున్నాయి. భూషణం ప్రత్యే కంగా తయారయ్యాడు. అప్పటికే కొంతవ రకు ఎదుటివారితో ఎలా మాట్లాడాలో నేర్చుకున్నాడు. సూరిబాబు క్రాఫ్ మారిపో యింది. డ్రస్‌లు కొత్త రకానివి. చూస్తే ఆ ఊరివారు గుర్తుపట్టరు. ఏ.ఎన్ అందరికీ ఏ సమయానికి ఏం చేయాలో చెప్పాడు. ఫొటోలు క్లిక్‌మంటున్నాయి. టీవీ కెమే రాలు తిరుగుతున్నాయి.

కొంతమంది చిన్న వీడియో కెమేరాస్ తెచ్చి షూట్ చేసుకుంటున్నారు. ప్రతి ఒక్కరూ ఆ ఇంటీరియర్ డిజైన్‌ని చూసి ఆశ్చర్యపోవటమే. కళాకారులందరూ ఒకరి నొకరు పలకరించుకున్నారు. ఓ పక్కనుంచి జర్నలిస్టులూ మరోపక్క ఛానల్స్‌వారూ ఇన్‌స్టెంట్ ఇంటర్వ్యూలు చేస్తున్నారు.

"ఇంతమంది మిత్రుల్ని కలుసుకోవటం నాకెంతో ఆనందాన్ని కలిగిస్తోంది"

"భాగ్యనగరానికి ఇదో వినూత్న శోభ"

"ఇలాంటి వాటిని ఏర్పాటు చేయటానికి అభిరుచి మాత్రమే చాలదు. శ్రమ కావాలి'

"బహుశా ఈ షాప్‌ని చూశాక వందల సంవత్సరాలనాటి కథల్ని ఆ నేటివిటీతో నిర్మించవచ్చనే ధైర్యం నిర్మాతలకి కలుగు తుందనుకుంటాను"

"ఇంక బుక్స్‌కోసం విదేశాల్లో వున్న నా మిత్రులమీద ఆధారపడనవసరం లేదను కుంటాను"

"సంగీత విభావరిని ఇలా ఏర్పాటు చేస్తేనే హుందాగా వుంటుంది. గొప్ప ఉపో ద్ఘాతాలుండవు. రసజ్ఞుల ముందు హృదయ మంతటితో తమలోని ప్రతిభని ఆవిష్కరి స్తారు. కొన్ని రోజులపాటు జీవితం పట్ల బోల్డంత ఆశ కలుగుతుంది"

"ఈ సంస్థ మరెంతో ఎదగాలి. నిజమైన కళాతృష్ణ వున్నవారికి వేదిక కావాలి"

రకరకాల అభిప్రాయాలు. అందరూ పుస్త కాల చుట్టూ, బొమ్మల చుట్టూ, ఇంకా రకర కాల వస్తువుల చుట్టూ చేరిపోయారు.

ఎవరూ గంటల తరబడి మాట్లాడలేదు.

క్లుప్తంగా, అందంగా తమ భావాల్ని వ్యక్తం చేశారు.

కేశీ మంచం కావాలని ఇద్దరు పట్టుబ ట్టారు.

సమస్య ఎంతకీ తెగదు.

"నేను దీన్ని లక్ష రూపాయలకైనా కొంటాను" అన్నారొకరు.

"ఫిక్సెడ్ రేట్స్. ఎక్కువా వుండదు. తక్కువా వుండదు. మీరిద్దరూ తేల్చుకోలేని పరిస్థితుల్లో లాటరీద్వారా నిర్ణయించుదాం" అన్నాడు ఏ.ఎన్.

అందుకు ఇరువురూ ఆమోదించారు. ఓ ప్రముఖ కళాకారుడు టాస్ వేశాడు. గెలి చిన వ్యక్తి ఆనందంతో ఉబ్బితబ్బిబ్బు య్యాడు.

"మీకు మరో మోడల్ పీస్‌ని నెల రోజు



లలోపు అందజేయటానికి ప్రయత్నం చేస్తాం" అన్నాడు హర్షధ్వానాల నడుమ ఏ.ఎన్. అలా సాయంకాలందాకా కార్యక్రమాలు సాగుతూనే వున్నాయి. ఏ ఒక్కరికీ అసౌకర్యం కలగలేదు.

పత్రికలు ప్రముఖంగా ఈ వార్తలన్నింటినీ కవర్ చేశాయి. మొదటి రోజు అమ్మకాలు కళ్లు తిరిగేలా వున్నాయి. ఫ్యాక్స్ మెసేజ్‌లు వెళ్లాయి. కొత్త ఇండెంట్లు పెట్టారు.

ఆ రాత్రి బిజినెస్ సర్కిల్స్‌లో తీవ్ర సంచలనం కలిగింది.

"మనం కూడా అలాంటి షాప్ తెరిస్తే ఎలా వుంటుంది?" అనే ఆలోచన వారికి వచ్చింది. అయితే వారే తొందరపడదలుచుకోలేదు. కొత్త సినిమాకి ఓపెనింగ్స్ వచ్చినట్లు... మొదటిరోజు అమ్మకాలు చూసి కంగారు పడనవసరం లేదనుకున్నారు.

షా నుండి టెలిగ్రాం వచ్చింది. కేథరిన్ సైతం విడిగా ఇంకో టెలిగ్రాం పంపింది.

మరుసటిరోజు అందరికీ శెలవిచ్చాడు ఏ.ఎన్. ఆ తర్వాతి రోజు ఆదివారం. అప్పటిదాకా కష్టపడినవారంతా రెండు రోజులూ విశ్రాంతి తీసుకున్నారు.

మరో కొత్త మంచం ఆ చోటుని ఆక్రమించుకుంది.

ఈసారి దాని ధర లక్ష రూపాయల చిల్లర.

సూరి ఇంక ఆగలేకపోయాడు.

"బాబుగారూ, ఆ నా కొడుకులిచ్చేది డబ్బులేనా? చిల్లపెంకులాండి"

"అనుమానమా?" అన్నాడు ఏ.ఎన్.

"అనుమానమేనండి. అవి మంచినోట్లయితే ఆ మంచానికి అంత డబ్బు ఇస్తారేటండి. ఇప్పుడేమో లక్ష రూపాయలంటున్నారు. ఖచ్చితంగా ముదరా డబ్బేనండి" అన్నాడు.

"అదేం కాదు. అన్నీ మంచినోట్లే. నీకింకా కొన్ని విషయాలు అర్థం కావాలంటే టైం పడుతుంది"

"అదెట్టానో చెప్పండి" అన్నాడు.

"నీకు గజం బట్ట వంద రూపాయలు చెబితే అయిదుకిస్తావా అంటావ్. కాదు ఏభై అంటాడు. చివరికి పది దగ్గర ఆగుతాడు. ఇక్కడ అట్టా అంటే కుదరదు. పది రూపాయల వస్తువు వెయ్యి రూపాయలు చెబితేగాని ఆనదు"

"అంతేనాండి"

"అవునయ్యా.. దీన్ని అమ్మటంలేదు అని అన్నావనుకో అదే కావాలంటూ కూర్చుంటారు. గొప్పవాళ్లూ, బీదవాళ్లనే తేడా ఎలా తెలుస్తుంది? ఇలాంటి వస్తువుల్ని ఎక్కువ ధర చెల్లించి కొన్నప్పుడేకదా!"

"కొనేం చేసుకుంటారండి" అన్నాడు.

"ఏం చేసుకోరయ్యా ఇంట్లో పెట్టుకుంటారు"

"అంటే వస్తువుల్ని అవసరంకోసం కొనుక్కోరన్నమాట"

"అవును, అవసరాల కోసమైతే ఇన్ని వస్తువులెందుకయ్యా! ఒక మనిషికి లేదా ఓ కుటుంబానికి ఎన్ని అవసరమో అన్నే కొనుక్కుంటే పంటలూ, వస్తువులూ అందరికీ సరిపోతాయి.

"అవున్లెండి.. అయినా గాని అంతంత డబ్బు పొయ్యటానికి చేతులెట్టా వస్తయ్యండి" అన్నాడు.

"డబ్బు వాళ్ల దగ్గర గుట్టలు పడుంది" అన్నాడు.

"అంతేలెండి. ఏం చేసుకోవాలో తెలియక" అన్నాడు సూరి.

"నీక్కూడా అలాంటి అవకాశం వస్తుంది లేగాని.. నువ్వు కొన్నాళ్లు ట్రైనింగ్ తీసుకో








ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

ఏప్రిల్ చతుర నవల భూషణంగారి భోషాణం

**సమీక్షకుని పేరు :** ..................................................

**చిరునామా :** ..................................................

..................................................

..................................................

..................................................

# ఏరిన ముత్యాలు

★ మొత్తంగా యువజనుల ప్రత్యేకించి యువజన సంఘాల కర్తవ్యాలు ఒకేమాటలో చెప్పవచ్చు. అది నేర్చుకోండి అనేదే

-లెనిన్

★ వ్యక్తిగత హింసావాదం ప్రజలు కార్యాచరణలో పాల్గొనకుండా అరికడుతుంది. విప్లవ పురోగమనానికి ఆటంకంగా తయారవుతుంది

-స్టాలిన్

★ సంపద కోసం సుగుణాన్ని, అధికారం కోసం స్వేచ్ఛను అమ్ముకోకు

-బెంజిమిన్ ఫ్రాంక్లిన్

★ నిస్వార్థ పరత్వం మనిషిని గొప్పవాణ్ణి చేస్తుంది. స్వార్థ పరత్వం మోసగాణ్ణి చేస్తుంది

-పి.ఓ.రోజెస్

★ దుష్టచట్టాలు దుర్మార్గ పరిపాలనకు పరాకాష్ట

-ఎడ్మండ్‌బర్క్

★ ఏ కొంతైనా వాస్తవముంటేనే చతురోక్తి జనాదరణ పొందుతుంది

-రవీంద్రనాథ్ టాగూర్

★ ఏ విషయానికైనా ఒక నిర్ణీత సమయమూ, సందర్భమూ ఉంటాయి

-రిచ్‌మండ్

★ ఆడవాళ్లను పొగిడే మగవాళ్లకు ఆడవాళ్ల గురించి అంతగా తెలీదు. ఆడవాళ్ల గురించి తెగడే మగవాళ్లకు అసలేమి తెలీదు

-మేడమ్ డిసామ్

★ ప్రతి ఒక్కరూ అజ్ఞానే కాకపోతే వేరువేరు విషయాల్లో

-ఎర్.రోగర్స్

★ ప్రతి ఒక్కదానికీ దాని శరీరం దానికుంది. కాకపోతే ప్రతివారూ ఆ సౌందర్యాన్ని చూడలేరు

-కన్‌ఫ్యూషియన్

★ న్యాయం నశించిన చోట ప్రజాకంటక పరిపాలన ప్రారంభమౌతుంది

-విలియం విట్

★ నీ వారసునికి ఇవ్వతగిన కానుక జిజ్ఞాస మాత్రమే

-మగ్రోస్‌బార్టన్

★ సమాజం నేరాన్ని తయారు చేస్తుంది. నేరస్తుడు దానికి పాల్పడుతాడు

-వి.ఆల్ఫెయిరి

★ దుర్మార్గుడికి మేలు చేయడం, సన్మార్గుడికి హాని చేసినంత ప్రమాదకరం

-ప్లాటస్

సేకరణ: జక్కలవెంకన్న

వాలి. నేను మాట్లాడాను. సోమవారం నుంచి వెళ్లటమే"

"తర్వాతండి"

"ఫాస్ట్‌ఫుడ్ సెంటర్ పెడుతున్నాం. దాని మేనేజ్‌మెంటంతా నీదే. సరేనా? "

"అట్టాగేనండి. అయ్యగారు చదువు నేర్చుకుంటున్నారు కదండి! మరి నేనూ నేర్చుకుంటానండి"

"నేర్చుకుందువుగానిలే" అన్నాడు ఏ. ఎన్.

★ ★ ★

"అగ్రజా.. మనం అర్జెంటుగా పాస్‌పోర్ట్‌లు తీసుకోవాలి" అన్నాడు ఓ రోజున ఏ. ఎన్.

"ఎందుకు బ్రదర్"

"ఏ క్షణాన్నయినా మనకు షా నుండి పిలుపు రావచ్చు"

"ఇంతకీ మన భోషాణాన్ని ఏం చేసుంటాడంటావ్"

"ఇప్పటికే జల మార్గాన విదేశాలకు వెళ్తుండటమో, చేరిపోయి వుండటమో జరిగివుంటుంది. దానిని అమ్మటానికి మాస్టర్ ప్లానేదో వేస్తుంటాడు"

"అవును అతడు అందుకు సమర్థుడు"

"మనకు అతన్తో చాలా పనులున్నాయి. మనం తొందరలో షాని కలుసుకోవాలి" అన్నాడు సాలోచనగా.

ఇద్దరూ పాస్‌పోర్ట్ కోసం దరఖాస్తు చేసుకున్నారు. పోలీసు ఎంక్వైరీకి రావటం, అక్కడనుండి నెల రోజుల్లోగా పాస్‌పోర్ట్ వచ్చేయటం జరిగింది.

"దాంతో వెళ్లిపోవచ్చునా? "

"కుదరదు... వీసా కావాలి"

"అది ఎన్ని రోజుల్లో వస్తుంది"

"వచ్చేస్తుంది. అది పెద్ద కష్టంకాదు. కానీ మనం వెళ్లే దేశంలోనే స్థిరపడాలంటే మాత్రం కుదరదు"

"షాగారికి మన చిరునామా పంపారా? "

"అలాంటి విషయాల్లో ఎప్పుడూ ముందుంటాం. మనకు టెలిగ్రామ్ కూడా ఇచ్చాడుకదా"

"అవును... మర్చిపోయాం"

"ఇంక అతని ఫోన్‌కోసం ఎదురు చూద్దాం"

"మన సంస్థలు ఎట్లున్నవి? "

"సూపర్ సక్సెస్. ముఖ్యంగా టుడే అండ్ టుమారోకి పబ్లిక్ హాలిడేస్‌లో ఎక్కడలేని రద్దీ. సిటీలో ఎలైట్‌కి ట్యాంక్‌బండ్ దగ్గరికి రావటం, బిర్లామందిర్ చూడటం, మన షాప్‌ని దర్శించటం ఈనాటి క్రేజ్" అన్నాడు.

"మనం విదేశాలు వెళ్తే ఇక్కడ సమస్యలుండవా? "

"అలాంటిదేం వుండదు. ప్రతి ట్రాన్‌శాక్షన్‌నీ కంప్యూటర్‌కి ఫీడ్ చేయాలి. సేల్స్ డిపార్ట్‌మెంట్, పర్చేజ్ డిపార్ట్‌మెంట్, ఎకౌంట్స్ వాళ్లు వేరు వేరుగా వున్నారు. వీళ్లందరూ ఒకరినొకరు క్రాస్ చెకింగ్ చేస్తారు. ఎక్కడ ఏ తప్పు జరిగినా తెలిసిపోతుంది"

"మంచిది" అన్నాడు భూషణం.

షా ఓ రాత్రిపూట ఓ అరగంట మాట్లాడాడు. వెంటనే బయలుదేరి అమెరికా రావాలనేది అతని మాటల సారాంశం. భోషాణాన్ని అమెరికా చేర్చానని చెప్పాడు. త్వరలో పెద్ద వేలం పాట జరగబోతోంది. అందుకు వేదికని ఆ దేశానికి చెందిన ఓ సంస్థ ఆధ్వర్యంలో ఏర్పాటు చేసుకున్నారు.

అత్యంత పురాతనమైనవన్నీ అక్కడ వేలం పద్ధతిలో అమ్ముతారు. అలాంటిచోట అమ్మటం, కొనడం అంత సులభంకాదు. ముందుగా అడ్వాన్స్‌లు కట్టాల్సుంటుంది. ప్రపంచ వ్యాప్తంగా లభ్యమయ్యే అపురూప వస్తువుల వేలం జరుగుతుంది. ఈ వస్తువు

ఫలానా సంవత్సరం అంటే చాలదు. దానిని నిరూపించగలగాలి. అప్పుడు ఎంతైనా సరే కొనటానికి ముందుకొస్తారు. ఇలా వేలంకొచ్చేవాటిలో డైరీలూ, ఉత్తరాలు, బొమ్మలు మాత్రమేకాక ప్రముఖ వ్యక్తులు వాడిన కమోడ్లు కూడా వుంటాయి. వాటిని సైతం సేకరించి దాచుకునే వారున్నారు. ఈ విషయాలన్నింటినీ భూషణం ఏ.ఎన్ ద్వారా విన్నాడు.

"ఈ భోషాణాన్ని ఫలానా టైమ్‌ది అని ఎలా నమ్మించగలం"

"నీకు ఆ విషయంలో టెంక్షన్ వద్దు సోదరా! ఎందుకంటే అది మనల్ని దాటిపోయింది. షాకు ఇవన్నీ కొట్టినపిండి. చూస్తారుగా" అన్నాడు.

ఫ్లైట్ టిక్కెట్స్ కొన్నాడు. సూరిబాబుకి జాగ్రత్తలు చెప్పాడు.

"మేం వచ్చేంతవరకు జాగ్రత్త. షాప్స్‌ని ఓ కంట కనిపెట్టు. అలాగని అనవసరంగా వాళ్ల పనిమీద పెత్తనంవద్దు. మేం వచ్చేటప్పటికి నీ ట్రైనింగ్ పూర్తి అయిపోవాలి. మనం కొత్త బిజినెస్ ఆరంభించాలి. కనీసం మూడు నాలుగు ఐటమ్స్ స్పెషలైజ్ చేయటం నేర్చుకో"

ఉద్యోగస్థులందరికీ చెప్పవలసిన జాగ్రత్తలు చెప్పాడు.

"షాప్ ప్రిస్టేజి ముఖ్యం. అందరూ కోపరేటివ్‌గా వుండండి" అన్నాడు చివరిగా.

వాళ్లంతా విమానాశ్రయం వద్దకు వీడ్కోలు చెప్పటానికి వచ్చారు.

అందరూ చేతులూపుతుండగా విమానంలోకి వెళ్లటం, తలుపులు మూసుకోవటం, గాల్లోకి లేవటం జరిగిపోయాయి.

"నా జీవితంలో ఇదే మొదటిసారి విమానం ఎక్కటం" అన్నాడు భూషణం

"నాకు కూడా ఇదే మొదటిసారి" అన్నాడు ఏ.ఎన్. మెల్లగా సెటిలయ్యారు. భూషణానికి కిటికీ పక్కన సీటు వచ్చింది. అక్కడనుండి కిందికి చూస్తుంటే అతనికి థ్రిల్లింగ్‌గా వుంది.

"ఏమిటో మనం నిమిత్త మాత్రులం" అన్నాడు భూషణం.

★ ★ ★

ఎయిర్ పోర్ట్‌కి కేథరిన్ వచ్చింది. భూషణం చేతులు పట్టుకుని తన సంతోషాన్ని ప్రకటించింది.

"షా జీ రాలేదా" అన్నాడు ఏ.ఎన్.

"డాడీ ఈజ్ అదర్‌వైజ్ బిజీ" అంది.

కారు మెత్తటి రోడ్లమీద పరుగులు తీస్తుంటే అద్దాలనుండి చూస్తున్నాడు భూషణం. ఎటు చూస్తే అటు ఓ విశేషం కనిపిస్తోంది. ఆ రోడ్లు.. పాముల్లా జారిపోతున్న కార్లు... ఆకాశంలోకి ఎదిగిన భవంతులు... అలా వెళ్లి వెళ్లి ఓ హోటల్ ముందు ఆగింది. అక్కడి మనుషులంతా విచిత్రంగా కనిపిస్తున్నారు. తమకోసం రిజర్వ్ చేసిన సూట్‌లోకి చేరిపోయారు.

"షార్ప్‌లీ వనవర్ తర్వాత డాడీ ఇక్కడుంటారు. ఐ ఆల్సో జాయిన్ విత్‌మై ఫ్రెండ్స్. బై" అంటూ వెళ్లిపోయింది.

"సోదరా మన కంట్రీ ఈ స్థితికి చేరటానికి ఇంకెన్నాళ్లు పడుతుందంటావ్. ముఖ్యంగా ఈ రోడ్లు అద్దాల్లా వున్నాయి. ఇలాంటి రోడ్లు మన జీవితంలో అసలు చూడగలమా? "

"చాలా టైమ్‌పడుతుంది అగ్రజా. మన రాజకీయ నాయకుల్లో ఎక్కువ భాగం ఫ్యూడల్ కుటుంబాలనుండి వచ్చినవాళ్లు. వాళ్లకి ఎంత పీక్కుందామా అనే కాన్సెప్ట్ తప్పితే మిగతా విషయాలు పట్టవు. వీళ్లకి చందాలివ్వటం, రౌడీల్ని అసెంబ్లీలకీ, పార్లమెంట్లకీ పంపించటం, వాళ్లేమో కంట్రాక్టర్ల నుండి, సారా వ్యాపారుల నుండి ఫండ్స్ దండుకోవటం తప్ప రేపటి గురించి ఆలోచించరు. మన ఇండియన్ కాపిటలిస్ట్‌లు





తెర వెనకాల నుండి రాజకీయాలు నడిపిస్తారు తప్పించి తెరముందుకు రారు. సోషలిస్టులు అధికారాల్లోకి రాకపోతే పోయింది కనీసం కాపిటలిస్టులైనా అధికారంలోకి రావాలి"

"అప్పుడేమవుతుంది సోదరా? " అన్నాడు.

"బ్రిటీష్‌వాళ్లు వచ్చారు. వాళ్లు రైలు మార్గాలు నిర్మించారు. వంతెనలు కట్టారు. రోడ్లు వేయించారు. ఎందుకంటే అవన్నీ అవసరం. అవి లేకపోతే అభివృద్ధి వుండదు. ఆ తర్వాత మనవాళ్లు అధికారంలోకి వచ్చారు. వాళ్లుకట్టినవేవీ సరిగ్గా వుండవు. అందుకు వేరే కారణం ఏమీలేదు. ఇవి మనకి కూడా అవసరం అనే జ్ఞానం కంటే ఇందులో ఎంత లాభం వచ్చిందనే కాన్సెప్ట్. బడా కంట్రాక్టర్లని చూడండి. వాళ్లలో కాపిటలిస్ట్ ఔట్ లుక్ లేదు. వుంటే ఆ రైళ్లూ, బస్సులూ అవన్నీ అట్లా తగలడవు. ఇంకోరకంగా చెప్పాలంటే రాజీవ్‌గాంధీలో ఆ కేపిటలిస్ట్ ఇన్‌స్టింక్ట్ వుంది. అందుకే దేశాన్ని ఇరవై ఒకటో శతాబ్దంలోకి నడిపించాలనే తాపత్రయపడేవాడు"

"అంటే ఇక్కడ కుంభకోణాలుండవా సోదరా? "

"ఎందుకుండవు సోదరా! కుంభకోణం లేని చోటంటూ వుండదీ ప్రపంచంలో. దేశాల్ని కూల్చేసే కుంభకోణాలు, ఆయుధ అమ్మకాల కుంభకోణాలు, మార్కెట్ కుంభకోణాలుంటాయి"

ముఖ్యంగా మన దేశంలాంటి దేశాలమీద వారి చూపుంటుంది. మన రాజకీయ నాయకుల్ని సులభంగా కొనగలరు. వారి చెత్తని మనమీద రుద్దగలరు. అంతదాకా ఎందుకు! ఇండియన్ లిటరేచర్‌మీద వారి ప్రభావం అపారంగా వుంది. దేశాన్ని కమ్యూనిజం పాలుకాకుండా చూసుకునే బాధ్యత ఎప్పుడూ వారి భుజాలమీద వేసుకుంటారు. కోట్లాది రూపాయల ఫండ్స్ మనదేశానికి పంపిస్తారు. అందమైన పుస్తకాలు ప్రచురిస్తారు. చాలా రాడికల్‌గా మాట్లాడుతుంటారు. దేశంలో ఏ ప్రాంతంలో చూసినా స్వచ్ఛంద సంస్థలు పనిచేస్తుంటాయి. ఇవేవీ దేశాల్ని వాటి మానాన అవి బతకనీయవు"

భూషణం అనుమానంగా చూశాడు.

"సోదరా, నువ్వు చెబుతున్న విషయాలు నాకు అర్థం కావటంలేదు. ఇన్ని విషయాలు తెలుసుకున్నావ్‌కదా! ఇంతకీ నువ్వేం చదువుకున్నావ్... ఎందుకని రాజకీయాల్లోకి వెళ్లలేదు" అనడిగాడు.

ఏ.ఎన్ బిగ్గరగా నవ్వేశాడు.

"నేను తెలుసుకున్న విషయాలు చెప్పాను భయ్యా... ఇవి తెలుసుకోవాలంటే గొప్ప చదువులేం అవసరంలేదు. దేశాల్ని పరిపాలిస్తున్నవారు ఏం చదువుకున్నారు? కమ్యూనిస్ట్ పార్టీల్లోనూ అంతే. అందులో కొందరే మేధావులు. మిగతావారంతా మేధావుల భంగిమలిచ్చేవారు. ప్రచారం చేసుకునేవారు. కేంద్ర స్థానాల్లోకి చేరిపోయి చక్రాలు తిప్పుతుంటారు. అందుకే కమ్యూనిస్టుల రాజకీయాల గురించి వారికంటే పోలీసు అధికారులకీ, కాపిటలిస్టులకీ ఎక్కువ అవగాహన వుంటుంది. ఇదంతా నా పాండిత్యం ప్రదర్శించటానికి చెప్పటంలేదు సోదరా! మనం ఒక విషయం మీద కృషిచేస్తున్నామంటే దాని చుట్టూవున్న అనేక విషయాల గురించి తెలుసుకోవాలి. మనం చేసే పనుల్ని కనిపెట్టేది వాళ్లే. అవసరమైతే ఎదురు తిరిగేది వాళ్లే"

"నీ మేధస్సుకి దండాలెట్టేస్తున్నానయ్యా! చూస్తుంటే నువ్వు అధికారం దొరికితే ఇరవై అయిదో శతాబ్దంలోకి తీసుకు వెళ్లేటట్టున్నావ్"

ఏ.ఎన్ కళ్ల వెంట నీళ్లు వచ్చేంతవరకూ



నవ్వాడు.

కాలింగ్‌బెల్ మోగాకగానీ వాళ్లకి గంట గడిచిపోయిందనే స్పృహరాలేదు. షా వచ్చి కలిశాడు.

"ప్రయాణం ఎలా జరిగింది? "

"హాయిగా వచ్చాం"

"వెల్... ఇంకో పది రోజుల్లో ఇక్కడో గొప్ప వేలం జరగబోతోంది. దాన్లో మన భూషణంగారూ, భోషాణం పాల్గొనబోతు న్నారు. దానికి చెందిన బ్రోచర్స్ తయారుచే యించే కార్యక్రమంలో వున్నాం. మన భూషణంతో చాలా పనుంది. అతని పోర్ట్ ఫోలియో ఐ మీన్ ఉదయం లేచిన దగ్గ ర్నుండి పడుకునేదాకా ఏం చేస్తారో అన్నీ షూట్ చేయాలి. ఇలాంటి వాటిలో ప్రఖ్యాతి చెందిన ఓ డైరెక్టర్‌ని జర్మనీ నుండి పిలిపిం చాను. అద్భుతమైన డాక్యుమెంటరీస్ తీశా డాయన"

"కానీ... ఇండియన్ అట్మాస్ఫియర్..."

"టోటల్ స్కెచ్‌లు ఆయనకిచ్చాను మిస్టర్ ఏ.ఎన్. పూర్తి ఏర్పాట్లు చేశాం. ఇంక భూషణం నటించటమే"

"కానీ..."

"లాంగ్వేజ్ ప్రాబ్లమ్ లేదు. అనువాద కుల్ని పెట్టాను. కాకపోతే మనం చేయవల సినపనులు కొన్ని వున్నాయి. అందువల్ల భూషణాన్ని మనం కేథరిన్‌కి వదిలివేద్దాం. ఆ కార్యక్రమాలన్నీ తను చూసుకుంటుంది"

ఏ.ఎన్. భూషణంకేసి చూశాడు.

"మీకేం భయం అవసరంలేదు. ఎప్పుడు కావాలంటే అప్పుడు హాట్‌లైన్‌లో మాట్లాడు కోవచ్చు"

"ఇట్సాల్‌రైట్" అన్నాడు భూషణం.

"మా సోదరులు ఆంగ్లభాషని బాగా నేర్చుకున్నారు"

"అట్లయితే ఇంక ప్రాబ్లమ్ ఏమిటి? యు ఎంజాయ్ మైలార్డ్" అన్నాడు 'షా' నవ్వుతూ.

"ఓ. కే... లెట్స్‌గో" అన్నాడు షా. కేథరిన్ రాగానే ఆమెతోపాటు ఇద్దరు ఫ్రెండ్స్ వచ్చారు. వారు భూషణాన్ని పరిచయం చేసుకోగానే ప్రశ్నల వర్షం కురిపించటం మొదలుపెట్టారు.

"అగ్రజా... వెళ్ళిరానా..."

"గో ఎహెడ్ బ్రదర్" అన్నాడు.

కారులో కూర్చున్నాక అడిగాడు ఏ.ఎన్.

"భోషాణం బాగా చేరిందా? ఏమైనా డామేజ్ జరిగిందా? "

"నో డామేజ్. దాన్ని ఎంతకు ఇన్స్యూర్ చేశాననుకున్నావ్... ఇప్పుడు మనం ఎక్క డికి వెళ్తున్నామనుకున్నావ్. మీ ఫ్రెండ్ నిన్ను చూడాలంటేనూ..." అంటూనే సెల్ ఫోన్ తీసుకొని మాట్లాడాడు ఎవరితోనో.

కారు ఓ పెద్ద భవనం ముందు ఆగింది. 'షా' వెనక 'ఏ.ఎన్' నడుచుకుంటూ వెళ్ళాడు. అక్కడికి వెళ్ళాక తన ఫ్రెండ్ ఎవరో అర్థమైంది.

భోషాణం అక్కడ వుంది.

దాని చుట్టూ కొంతమంది మనుషులు న్నారు. వారేదో విషయం గురించి సీరియ స్‌గా చర్చించుకుంటున్నారు... 'షా'ని చూడ గానే వారందరి ముఖాలు నవ్వును పులు ముకున్నాయి.

"ఎనీ డౌట్స్" అన్నాడు 'షా'.

"నో... నో... స్లైట్ డిఫరెన్సెస్... అవి కూడా క్లియరయిపోతాయి" అన్నారు.

"ఓ. కె. క్యారీ ఆన్" అని ముందుకు నడిచి ఓ గదిలోకి తీసుకుపోయాడు. మెత్తటి కార్పెట్లమీద నడుచుకుంటూ వెళ్ళారు. కూర్చున్నాక చెప్పాడు.

"ఏం చేసినా అథెంటిక్‌గా చేయాలి. వాళ్లు ఆ భోషాణం వయసుని కొలుస్తు





న్నారు" అన్నాడు నవ్వుతూ.

"ఇండియాలో ఆడవారి వయసూ, మగ వారి జీతం గురించి అడగకూడదంటారు"

"ఇంతలో భోషాణం పురుషలింగమా? స్త్రీలింగమా? " అన్నాడు షా.

"రెండూనూ" అన్నాడు ఏ.ఎన్.

"అందులో ఒకతను హిస్టోరియన్. అంటే హిస్టరీని మథించినవాడు. ఇంకొకతను వృక్షశాస్త్రంలో పట్టా పొందిన మేధావి. ఇంకొకతను ఆర్కియాలజిస్ట్. మరొకతను ఇంకేదో విభాగానికి చెందినవ్యక్తి. ఆ భోషాణానికి వాడిన కలపను బట్టి ఎన్ని సంవత్సరాలుంటాయో చెబుతారు. ఇంకొకాయన అది ఏకాలంలో తయారు చేసిందో చెబుతారు. తవ్వకాల్లో ఇలాంటి అవశేషాలు లభించాయేమో చూస్తారు. వీరందరూ కన్ఫర్మ్ చేసి తమ అభిప్రాయాలు చెబుతారు"

"కానీ సర్. ఇంతమంది ఏకాభిప్రాయానికి రాగలరా? "

"రారు, మనకేమిటి నష్టం"

"నష్టమనికాదు"

"రాకూడదయ్యా. ఒకే అభిప్రాయం ఎందుకుండాలో ముందు నాకు చెప్పు"

"అవసరంలేదు"

"బికాస్ మనుషులందరూ ఒకటికాదు కాబట్టి. రెండవదేమిటంటే ఒకేవృత్తిలో వున్న వ్యక్తులకే సమాన అభిప్రాయాలుండవు. ఎవరికి వారికి తమ విభాగమే ఈ ప్రపంచాన్ని ఎనలైజ్ చేస్తుందని గట్టి నమ్మకం. సత్యశోధన తాము మాత్రమే చేస్తున్నామంటారు. వాళ్లను అజ్ఞానంలో వుండనిద్దాం. అయిదుగురు రచయితలూ, కవులూ ఓ చోట చేరితే అరవై అభిప్రాయాలొస్తాయి. అంటే కాంట్రడిక్షన్ అనేది తనకి తనతోనూ, తనకీ, మిగతావారికీ అన్న మాట. ఆ సూత్రం ప్రకారం ఈ భోషాణం నాలుగువందల సంవత్సరాలది కావచ్చు ఇంకా పాతది కావచ్చు మొగల్ ఎంపరర్స్‌ది కావచ్చు లేదా అమెరికానుండి ఇండియా వెళ్లింది కావచ్చు ప్రతి అభిప్రాయానికీ ఒక్కో ధరుంటుంది"

"అర్థమైంది సార్"

"ఏమిటి నేను ఇంటలెక్చువల్ ననా? "

"అది నిజమేననుకోండి..."

"పిచ్చివాడా ఒక్కోసారి ఇంత ఛాదస్తం ఎందుకు అనిపిస్తోంది. జస్ట్ పేపర్ ట్రాన్‌శాక్షన్. ఓడలమీదనుండి నూటయాభైకోట్ల గోధుమలో, ఎరువులో, గడ్డో వచ్చింది. ఎరువులు జల్లారు. గోధుమలు తిన్నారు. గడ్డి మేశారు. ఫినిష్"

"నిజమే అనుకోండి. కానీ..."

"నో బట్స్ ఆర్ ఇఫ్స్...ఏం జరుగుతుంది? కొద్ది రోజులు అల్లరి. తర్వాత సంవత్సరాల తరబడి కోర్టులో వాదాలు 'ఒన్‌ఫైన్‌డే' కొట్టి అవతల పారేస్తారు. డబ్బు సంపాదించటానికి ఇన్ని సులభ మార్గాలుండగా ఈ కష్టమంతా ఎందుకని? " అన్నాడు షా.

"అదనంగా మామూలు జనంమీద బతకటం సార్... పైగా చెడ్డపేరు. దిసీజ్ డిఫరెంట్ సర్. డబ్బులున్నవారితో గేమ్ ప్లే చేయటం. ఇంటలెక్చువల్ గేమ్"

"అఫ్‌కోర్స్" అన్నాడు షా.

"సర్ ఇండియాలో మీరు ఇడ్లీకి పేటెంట్ రైట్స్ తీసుకోమన్నారు కదా. మనం ఇడ్లీ విషయం తర్వాత ఆలోచించుదాం. ముందు మనం మన భోషాణం మోడల్ మీద పేటెంట్ రైట్స్ తీసుకోవాలని నాకుంది. వీలవుతుందా? "

"ఎందుకు వీలవదయ్యా... మీ వేపచెట్టు మీద పేటెంట్ హక్కులుపొందినప్పుడు భోషాణంమీద పొందటానికి అడ్డేముంది"

"అట్లయితే ముందు ఆ పని చేద్దాం సార్. వివిధరకాల సైజుల్లో భోషాణాలు తయారు చేయించుదాం. ప్రపంచ దేశాలన్నీ వీటిని ఆమోదిస్తాయి. ఇండియాలో అక్కడ క్కడా కొంతమంది అరుస్తారు. వీలయితే మనం ప్రభుత్వంమీద మన వత్తిడి తెద్దాం. 'కెంటకీ ఫ్రైడ్ చికెన్‌లా' భూషణమ్స్ భోషా ణమ్ ఇదీ మన మకుటం. ఎవరికే సైజు కావాలంటే ఆ సైజులో తయారుచేయిస్తాం. దేశవిదేశాలకు ఆర్డర్లు తీసుకుంటాం. పిండి కొద్దీ రొట్టె అన్నట్లు డబ్బుని బట్టి వజ్రాలు. కావాలంటే వజ్రాలు తాపడం చేస్తాం. బంగారం కావాలంటే బంగారం తాపడం చేస్తాం..." ఏ.ఎన్. చెప్పుకుపోతూ ఆగాడు.

షా దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

"ఏంటిసార్ ఆలోచిస్తున్నారు. హెవీ బడ్జెట్ అవుతుందనా? "

"కాదు, అడవులు తరిగిపోతాయని"

ఏ.ఎన్. కొద్దిగా షాక్ తిన్నాడు.

"సర్ మీరుగాని పూర్వాశ్రమంలో జర్నలి స్టుగాగానీ ఏదైనా లెఫ్ట్ పార్టీలో కార్యక ర్తగాగానీ పనిచేశారా? "

"వాళ్ళకేనా ప్రకృతిమీద ప్రేమ" అన్నాడు షా.

"మనకి లాభం కావాలి తప్ప అడవులు ఏమైతే మనకేమిటి? అడవులు కాలిపో వటం లేదా? అందరూ నరుక్కుపోవటం లేదా? అరుదైన వృక్షజాతులు నశించిపోవ టంలేదా? "

"గుడ్. నేను రేపు రాబోయే పరిణామాల గురించి మాట్లాడుతున్నాను బాబూ. రేపు ఖచ్చితంగా జరగబోయేదిదే. అప్పుడు మనం దాన్ని ఎలా ఎదుర్కోవటం అనేదాని గురించి ఆలోచించాలి"

"గురువుగారూ- ఆ విషయం గురించి ఎక్కువ ఆలోచించకండి. పత్రికలవలన ఎన్ని వందల వేల అడవులు నరికేస్తున్నారో చూస్తూనే వున్నాం. వాటిని వద్దనటం లేదు. అలాంటి పరిస్థితులు వస్తేనే ఆల్టర్ నేటివ్ కోసం ఆలోచిస్తారు. ప్రపంచంలో పెట్రోలు లేకపోతే ఈ కార్లూ, విమానాలు ఆగిపోతాయా? ఆగవు. నీళ్ళతో నడిపి స్తారు. సముద్రాలు సైతం ఎండిపోయా యనుకోండి. గాలితో నడిపిస్తారు. జస్ట్ ఎగ్జాంపుల్ చెప్పాను. చెక్కతో కాకుంటే ప్లాస్టిక్ భోషాణాలు... లేదా రాతి భోషా ణాలు... లేదా ఇంకేదైనా మెటీరియల్‌తో చేస్తాం. అయినా ప్రపంచమంతా మన భోషాణం దగ్గర ఆగిపోవు. కొంతకాలం దాకానే మన రాజ్యం. ఆ తర్వాత ఇంకో టేదో వస్తుంది. అటు పరుగులు తీస్తారు"

షా మెచ్చుకోలుగా చూశాడు.

"నా పరీక్షలో నువ్వు నెగ్గావయ్యా" అన్నాడు.

"థాంక్యూ సర్" అన్నాడు ఏ.ఎన్.

"అయితే మనం బిజినెస్ గురించి మాట్లా డుకుందాం. ఇదంతా కంబైన్డ్‌గా చేద్దాం. కాకపోతే కంట్రీవైడ్‌గా పార్టనర్‌షిప్ ఫిక్స్ చేసుకుంటే బాగుంటుంది. నీకేం కంట్రీస్ కావాలో కోరుకో"

"ముందు ఛాన్స్ మీకే షాగారూ. ఇందులో ఫైనాన్షియల్ కమిట్‌మెంట్ మీది. మీరు ఏం చెబితే అది చేయటానికి నేను తయారుగా వున్నాను. నేను నిమిత్త మాత్రుణ్ణి.

"దటీజ్ ఇండియన్ ఫిలాసఫీ కదూ" అన్నాడు షా.

ఏ.ఎన్. నవ్వాడు.

"ఓ.కే. ఫిఫ్టీ ఫిఫ్టీ ఎక్సెప్ట్ ఇండియా"

"ఓ.కే. సార్"

"ఇండియావరకు నీకు పూర్తిగా వదిలే స్తున్నా" అన్నాడు. ఎందుకని షాని అడగ లేదు ఏ.ఎన్.

"సో... ఫ్రమ్ టుమారో ఈ విషయం




మెటీరియలైజ్ అయ్యేట్లు చూస్తాను. బట్ వన్‌థింగ్. పేటెంట్ పొందటం పెద్ద కష్ట మైన విషయం కాదు. ఐ హేవ్ మై ఓన్ డౌట్స్... ఇది ఎంతవరకు క్లిక్ అవుతుందా అని. చాలా మాన్‌పవర్ అవసరం అవు తుంది. అదంతా పెద్ద సమస్య కాదు. దీనిని ప్రమోట్ చేయటం ఎట్లా? మరి కొన్ని డిటైల్స్ వర్కవుట్ చేయగలవా. లేదా ఏదైనా యాడ్ కంపెనీని సంప్రదించు దామా? "

"నాకు రెండురోజులు టైమ్ ఇవ్వండి. స్థూలంగా కొన్ని పథకాలు చెబుతా. అప్పుడు అవసరమైతే ఏడ్ కంపెనీలను సంప్రదించుదాం"

"ఇట్సాల్ రైట్" అన్నాడు.

"మనం వెళ్దాం. ఇంకొన్నిపనులున్నాయి"



కేథరిన్ జర్మన్ డైరెక్టర్‌కి భూషణాన్ని పరి చయం చేసింది.

"మిమ్మల్ని కలుస్తున్నందుకు నాకు చాలా సంతోషం కలుగుతోంది. మీద్వారా ఒకా నొక కాలపు సంస్కృతితో మాట్లాడుతున్నా ననే ఫీలింగ్ నాకుంది. మీరు మీ జ్ఞాపకాల గురించి చెప్పండి. మీ పెద్దలు మీకు చెప్పిన విషయాలను గుర్తుకు తెచ్చుకోండి. ఎవ్విరి థింగ్... జస్ట్ మీరు మాట్లాడటం మాకు కావాలి. ఇలా మా అందరిముందూ మాట్లా డటమంటే మీకు ఇబ్బందిగా అనిపిస్తే ఏకాంతంగా ఓ గదిలో కూర్చుని మాట్లా డండి" అన్నాడు.

భూషణం ఓ గదిలోకి వెళ్లాడు.

ఎందుకో ఇన్ని రోజుల తర్వాత తను రామాపురంలో వున్నట్లనిపించింది. సంవత్స రాలుగా తనకు సుపరిచితమైన ఆ ఇల్లు... అందులోని ప్రతి అంగుళం గుర్తొచ్చింది. కొద్దిసేపు ఏంమాట్లాడాలో అర్థంకాలేదు.

తన ఎదురుగా ఏ.ఎన్. నిలబడినట్లుగా ఊహించుకున్నాడు.

ఇంక మాట్లాడటం మొదలుపెట్టాడు.

బహుశా మొట్టమొదటిసారిగా అంత దీర్ఘంగా మాట్లాడటం... తనకు సహజంగా వచ్చిన భాషతో ఆరంభమై... ఆంగ్లాన్ని మేళవించుకొని బాల్యంతో ఆరంభమై అలా అనర్గళంగా సాగింది. తనకు తెలిసిన వ్యక్తుల గురించి వారి అలవాట్లు, వ్యక్తిత్వం, తమ పెద్దల 'ఇగో', వారి ప్రవర్తనలు, వారి లోని మంచితనం, రాక్షసత్వం, దివాణాల లోని స్త్రీల పరిస్థితి... ఇలా ఒకటి కాదు ఒక సమగ్ర చిత్రాన్ని అందించే ప్రయత్నం చేశాడు.

ఆ మొత్తం కథనంలో లేనిదల్లా అఖిల. ఆమెతో తనకు గల అనుబంధం గురించి, ఆమె తిరస్కారం గురించి ప్రపంచానికి తెలి యచేయటం భూషణానికి ఇష్టం లేకపో యింది. అయితే యవ్వనంలో తన ఫీలింగ్స్ గురించి చెప్పాడు. ఆ కేసెట్స్‌ని అనువదిం చారు.

కేథరిన్, జర్మన్ డైరెక్టర్ ఆసాంతం విన్నారు. 'థ్రిల్లింగ్ ఎక్స్‌పీరియన్స్' అనుకు న్నారు.

"ఎనీవే. మీ హృదయం మాకు అర్థం అయింది. ఏం చేయాలో మిమ్మల్ని ఎలా

ప్రెజెంట్ చేయాలో నాకు ఓ ఐడియాని చ్చారు. లెటజ్ స్టార్ట్ టుమారో" అన్నాడ తను.

కేథరిన్‌తో హోటల్‌కొచ్చేశాడు.

అప్పటికి ఏ.ఎన్. వచ్చేశాడు.

"ఏం సోదరా... ఎలా వుంది? "

"ఇట్స్ నైస్. ఈ రోజంతా నేను మాట్లా డుతూనే వున్నాను. నా జీవితంలో ఇంతగా ఎప్పుడూ మాట్లాడలేదనుకుంటాను" అన్నాడు భూషణం.

"సో... ఇంక మీరు నిమిత్తమాత్రులు కారు"

"అలా కాదు సోదరా నువ్వు లేకుండా నేను లేను. ఉండాలని కోరుకోను" అన్నాడు నిజాయితీగా.

"సరదాకి అన్నాను సోదరా. నేనున్నా లేకపోయినా కూడా మీరు పదిమందిలో ఆత్మవిశ్వాసంతో నిలబడగలగటమే నాకు కావాలి. మేం వేరే కార్యక్రమంలో బిజీగా వున్నాం"

"జీవితం చాలా విచిత్రమైంది సోదరా. ఇంతకుముందెప్పుడూ మా ముందు రకర కాల కళాకారులు తమ ప్రతిభను ప్రదర్శిం చవలెనని ఆరాటపడేవారు. ఇప్పుడు మేము నటించవలసి వస్తున్నది"

"జీవితమే ఓ నాటకం అన్నారు పెద్దలు"

"అవును సోదరా. ఇదంతయూ పెద్ద నాటకములానే తోస్తున్నది. మేం ఇంతకు ముందెరగని ప్రదేశాలూ, ప్రాంతాలూ, పాత్రలూ ఓహ్... అనిర్వచనీయం... మాకు నిద్ర ముంచుకు వచ్చుచున్నది"

"నిద్రపోవాలి సోదరా ఎందుకంటే రేపు నిద్రలేమి మీ ముఖంలో కనిపించరాదు" అన్నాడు ఏ.ఎన్.

★ ★ ★

షూటింగ్ స్పాట్‌లో పెద్ద హడావుడి లేదు.

లైటింగ్ కూడా చాలా తక్కువగా వుంది. కెమేరాలు మాత్రం మూడున్నాయి. ఇంటి సెట్‌ను చూస్తుంటే భూషణానికి రామా పురం గుర్తుకువచ్చింది.

"మీరు ప్రత్యేకంగా నటించాల్సిన అవస రంలేదు. ప్రధానంగా మీ దినచర్యను తీస్తున్నాం. లాన్‌లో తిరగటం, చదువుకో వటం, వ్యాయామం. మీ గదిలో మీరు ధ్యానంలో సంతోషంగా వుండటం. ఇలా మీ ఫీలింగ్స్‌ని చూపిస్తాం. తర్వాత కెమేరాకేసి చూస్తూ మేమడిగిన ప్రశ్నలకు జవాబులు చెప్పండి. రేపు భోషాణం దగ్గర షూట్ చేద్దాం" అన్నాడు.

భూషణం తలూపాడు. కేథరిన్ ఫ్రెండ్స్ వచ్చారు. అందరూ టైట్ జీన్స్‌లో వున్నారు. వారికి భూషణం స్పెషల్ ఎట్రా క్షన్ అయ్యాడు. ఆ డైరెక్టర్ కొన్ని అద్భుత మైన షాట్స్ తీసుకున్నాడు. అంతకుముందే అతని దగ్గర సూర్యోదయం, పూలు విచ్చుకో వటం, మంచు బిందువులు, గడ్డిపరకలమీద సగర్వంగా నవ్వటంలాంటి షాట్స్ వున్నాయి. మంద్రమైన స్వరంతో చెప్పించిన వ్యాఖ్యానం వుంది. రీరికార్డింగ్ కోసం ప్రత్యే కంగా రూపొందించిన సంగీతం వుంది.

ఇవిగాక మొత్తం షూటింగ్ అయ్యాక కావ లసినవిధంగా సంగీతాన్ని సమకూర్చటానికి ప్రముఖులు వస్తున్నారు.

గ్యాప్ నడుమ భూషణం వచ్చి కేథరిన్ వాళ్ళతో కూర్చుని కబుర్లు చెబుతున్నాడు.

"హీ ఈజ్ రియల్లీ ఎ వండ్రఫుల్ డైరె క్టర్. కేవలం ఒకదేశపు ప్రధానమంత్రులూ, రాష్ట్రపతులూ, ఇలాంటి వ్యక్తుల జీవితాల్ని ఆయన తీస్తారు. లేదా గ్రేట్ డైరెక్టర్స్





గురించి, మీరు చాలా లక్కీ" అందా అమ్మాయి.

"కావచ్చు.. అయినా మేము సైతం ఒకా నొక దేశానికి ప్రధానులంతటి ప్రముఖులమే కదా" అన్నాడు నవ్వుతూ.

"అవును. మీ ప్రాంతమంతా ఒకనాడు మీ ఆధీనంలోనే వుందికదా" అంది కేథ రిన్.

"ఓసారి మా సోదరులతో మాట్లాడాలి"

సెల్ ఫోన్ ఇచ్చింది...

"సోదరా... ఏం చేస్తున్నారు? "

"షూటింగ్ మొదలైందా? ఎలావుంది అనుభవం"

"మేము నటించుటలేదు. జీవించు చున్నాం. ఎందుకంటే ఇది మా పాత్రేకదా"

"అవునవును. జీవించండి. రాత్రికి కలు సుకుందాం"

"అలాగే"

రాత్రి హోటల్ కి వచ్చాక ఎక్కువసేపు మాట్లాడలేదు. అలసిపోవటంతో నిద్రలోకి జారిపోయాడు.

రెండోరోజు భోషాణం దగ్గర కొన్ని షాట్స్ తీసుకున్నారు. అతనికి ఎలాంటి సంగీతం నచ్చుతుందో, అతని ఆహారపు అలవాట్లు ఏమిటో వివరంగా అడిగారు. వాటికి జవాబులు చెప్పాడు.

"ఈ భోషాణంతో మీకున్న అనుబంధం ఏమిటి? " అనే ప్రశ్నకు ఓ క్షణం ఆలోచన ల్లోకి జారిపోయాడు.

"తరతరాలుగా మాకు వారసత్వంగా వస్తున్న వాటిల్లో అదొకటి" అన్నాడు.

★ ★ ★

ట్రేడ్ ఫెయిర్ లాంటి 'వేలం' పాట ఆరంభం అయింది.

రకరకాల వస్తువులు అక్కడ ప్రదర్శిస్తు న్నారు. వాటికి చెందిన వివరాలు, వీడియో చిత్రాలు, పేపర్ కటింగ్స్, మేధావుల అభిప్రా యాలు అన్నింటినీ ప్రదర్శిస్తున్నారు.

"బ్రిటన్ యువరాజునీ, అతని కుటుం బాన్నీ, ఆ దేశప్రజలు ఎంత ఆరాధనగా చూసుకుంటారో ఆర్.ఎమ్.పురం ప్రాంత ప్రజలు 'భూషణం'గారిని అంత ప్రేమగా చూసుకుంటారు. అతనికి తరతరాలుగా సంక్రమిస్తున్న వాటిల్లో అరుదైన ఈ 'భోషాణం' ఒకటి. భోషాణం ఇండియన్ ట్రెడిషన్. ఇది బహుశా పదమూడు వందల సంవత్సరంలో పుట్టిందంటారు. కాలక్రమంలో అనేకానేక మార్పులు చెందిన ఈ భోషాణం గత చరిత్రకు గుర్తు. మీ కళ్ళ ముందు కనిపిస్తున్న ఈ అద్భుతం ఏ సంవ త్సరంలో తయారైందనే విషయంలో భిన్నా భిప్రాయాలున్నా... ఇదో రేర్ మాస్టర్ పీస్ అనటంలో ఎవరికీ సందేహంలేదు"

అందరూ వస్తున్నారు. బ్రోచర్స్ చూస్తు న్నారు. భూషణాన్ని "హలో" అని పలకరి స్తున్నారు. భూషణం గంభీరంగా నవ్వాడు. మొదటి రెండురోజులు ఎగ్జిబిషన్. మూడో రోజున పాటలు ఆరంభం **అవుతాయి.**

ఒక్కో పీస్ ని ఆఫర్ చేస్తున్నారు.

జనంనుండి ప్రతి స్పందన ఓ మోస్తరుగా వుంది.

భోషాణం రంగంమీదకు వచ్చేసరికి కల కలం ప్రారంభం అయింది. వేలం మొద లైంది. షా చిరునవ్వు చెదిరిపోలేదు. కేథ రిన్ ఉత్కంఠతో చూస్తోంది. ఏ.ఎన్. చిద్వి లాసంగా వున్నాడు. అంకెలు చెబుతు న్నారు. అక్కడ ఆగిపోయింది.

ఇండియన్ కరెన్సీలో జస్ట్ థర్టీఫైవ్ క్రోర్స్..

భూషణం ముఖంలో చిరునవ్వు స్థానంలో ఆశ్చర్యం చోటుచేసుకుంటోంది.

"ఏముందిందులో... కొన్ని చెక్కలు... వాటిని చిత్రిక పట్టినదెవరో తెలియదు.



మేకులు కొట్టిందెవరో తెలియదు. రంగులు ద్దిందెవరో... శిల్పాలు చెక్కిందెవరో తెలియదు. అందరూ కాలగర్భంలో కలిసిపోయారు. వారి పేర్లు తెలియవు. చస్తే కాల్చటానికి మాత్రమే పనికొస్తుందనుకున్న భోషాణం... ఇంటికి అరిష్టమనుకున్న భోషాణం. ఖండాంతరాలు దాటి ఇన్ని కోట్లను యజమానికి తెచ్చి పెడుతున్నదంటే... ఇది నాటకజగత్తుకాక మరేమిటి? తిమ్మిని బొమ్మిని చేయటం కాక మరేమిటి? అయ్యారే... ఇది విచిత్రమా? మూర్ఖత్వమా? మరేమైనానా? అహో... ఇది సంతోషమా... గగుర్పాటా... ఏదైతేనేం మిత్రులారా జోహార్లు" అనుకున్నాడు భూషణం.

ఏ.ఎన్ కృష్ణుడిలా నవ్వాడు.

మిగతా కార్యక్రమాలన్నీ పూర్తిచేసుకున్నాక అందరూ హోటల్‌కి చేరుకున్నారు.

"లెటజ్ సెలబ్రేట్ టుమారో" అనుకున్నారు. ఈ వార్తను అంతర్జాతీయ వార్తా సంస్థ అన్నిదేశాలకు పంపింది.

బి.బి.సి. వారు వార్తల్లో చెప్పారు. సామాన్యులు ముక్కుమీద వేలేసుకుంటే, సంపన్న వర్గం కొద్దిగా షేక్ అయి, ఆ వార్తని ఆసాంతం చదివారు.

"అదిసరే షాజీ. నాకిప్పుడు నిజంగానే అనుమానంగా వుంది. ఆ భోషాణం కొన్ని వందల సంవత్సరాల నాటిదే అయుంటుందేమో..." అన్నాడు ఏ.ఎన్.

"కావచ్చు"

"నాకెందుకో బాధగా వుంది. సంతోషంగానూ వుంది"

"బాధ ఎందుకు? అంత ధర పెట్టి కొనుక్కున్నవారిమీద జాలీ లేదా ఇంత డబ్బు వస్తుందనుకుంటే, ఇరవైలక్షలకు అమ్మివుండేవాణ్ణి కాదనే సారోనా? "





"ఛ... ఛ... అలాంటిదేంకాదు. ఒకసారి మన చేతినుండి వెళ్ళిపోయాక ఇంక దాని గురించి ఆలోచించేపనిలేదు. ఇది కొన్నవారికి రేపు ఇంకో వందకోట్లు రావచ్చు లేదా నష్టం రావచ్చు ఎందుకో భోషాణం తిరిగి ఇంకొకరి చేతికి మారుతుందంటే బాధగా అనిపించింది"

"చేతులు మారితేనే వస్తువుకి విలువ పెరుగుతుంది. అదే మనిషిని తీసుకుంటే చేతులు మారినకొద్దీ విలువ తగ్గిపోవచ్చు" అన్నాడు.

"కొన్ని సందర్భాల్లో మీరు చెప్పింది కరెక్టే. ఇంక మనకు మిగిలింది భోషాణం పేటెంట్ రైట్స్."

"ఇటీజ్ అండర్ ప్రాసెస్. ఇప్పుడు మనం ఎలా దాన్ని జనంలోకి తీసుకువెళ్ళటం అనేది ఆలోచించారా? "

"ఆలోచించాను"

"చెప్పండి..."

"భూషణం కప్ క్రికెట్, టెన్నిస్ పోటీలు జరుగుతాయి. వాటిని మనం స్పాన్సర్ చేస్తాం. ఇవి ప్రపంచస్థాయి పోటీలు. వీటి నిర్వహణభారం మొత్తం మనదే. ఎవరు కాంటాక్ట్ చేయాలన్నా మనల్నే చేయాలి. ఇంతకుముందెన్నడూ కనీవినీ ఎరుగని బహుమతులుంటాయి. ఇది ఓ ఆలోచన..."

"ఇంకా..."

'భూషణం' మ్యూజిక్ అవార్డ్సు... భూషణం టాప్ టెన్ పిక్చర్స్ ఆఫ్ ది డికేడ్, ఇది ఆయా దేశాలకన్నింటికీ ప్లస్ ప్రపంచవ్యాప్తంగా. వీటన్నింటికీ ప్రత్యేకంగా డిజైన్ చేసిన భోషాణం అవార్డ్సు ఇస్తాం. కప్ తయారీ అద్భుతంగా వుండాలి. ఇట్స్ సింబల్ ఆఫ్ ప్రిస్టేజి అనుకోవాలందరూ..."

షా ఆలోచించాడు.

"నువ్వు చెప్పింది బాగానే వుంది. అయితే మల్టీ నేషనల్ కంపెనీల్తో మనం పోటీప

డలేం. ముఖ్యంగా టెన్నిస్ పోటీలలాంటివి ఈ స్థితిలో మనం చెయ్యలేం. క్రికెట్ ఓ.కె... కానీ వరల్డ్ కప్ కాదు. ముందు నాలుగుదేశాల టోర్నమెంట్ నిర్వహిద్దాం. ఎనీహౌ గుడ్ సజెషన్"

"ఇంకో విషయం సార్... మనం వెంటనే కొన్ని వందల పీసెస్ తయారుచేయించి పెట్టుకుందాం. ఇవి కేవలం ఇన్ని వందలు మాత్రమే దొరుకుతాయి. ఆ మోడల్ని క్లోజ్ చేస్తున్నాం అని ప్రకటిస్తాం... అందుకు ఏదో ఒక సందర్భం ఎన్నుకుందాం"

"బాగానే వుంది"

"ప్రస్తుతం ఇండియాలో మేం చేయాల్సిన పనులు చాలా వున్నాయి. ముఖ్యంగా మేం అర్జెంటుగా ఆర్ట్ ఎగ్జిబిషన్ ఏర్పాటు చెయ్యాలి. అలాగే 'మైకేల్ జాక్సన్'లాంటి కళాకారుణ్ణి తీసుకొచ్చి మ్యూజికల్ నైట్ ప్లస్ ఫ్యాషన్ పెరేడ్ నిర్వహిస్తాం"

"ఫ్యాషన్ పెరేడా? "

"అవును. అందాల పోటీలు అని పేరు పెడితే వ్యతిరేకత ఎక్కువగా వుంది. అందుకని ఫ్యాషన్ పెరేడ్" అంటున్నాం. వివిధ దేశాలనుంచి వచ్చే ఫ్యాషన్స్ని ప్రదర్శిస్తాం. ఆడవాళ్లేకాదు, మగవాళ్లలో కూడా ఈ కాన్సెప్ట్ని డెవలప్ చెయ్యాలి. అంతేకాదు నడివయసువారినీ, ముసలివారినీ కూడా ఆహ్వానిస్తాం. వాళ్ళంతా కూడా ఏయేరకాల దుస్తులు తొడుక్కోవచ్చో చెప్పాలి. అలాగే పిల్లలు. అంటే మొత్తం మానవజాతి అంతా సరికొత్త ఫ్యాషన్ ప్రపంచంలోకి వచ్చేయాలి"

"నైస్... సరే ఇండియాకి టిక్కెట్లు రిజర్వ్ చేయిస్తాను. ఇక్కడ కార్యక్రమాలు కంప్లీట్ చేసుకొని మేం ఇండియా వస్తాం" అన్నాడు షా.

భూషణం కూడా షాని అభినందించాడు.

"మీతోపాటు కేథరిన్కి నేను థాంక్స్ చెప్పుకోవాలి" అన్నాడు.

కేథరిన్ "ఇందులో నేను చేసిందేమీలేదు' అంది.

"ఇట్సాల్ రైట్. ఈలోగా మీరు చూడాల్సినవన్నీ చూసెయ్యండి. అన్నీ చూశాక ఇండియా వెళ్లవచ్చు కేథరిన్ మీ వెంట వుంటుంది" అన్నాడు షా.

స్వేచ్ఛా ప్రతిమతో మొదలుపెట్టి నయాగరా జలపాతం చూశారు. షాపింగ్ చేశారు. స్టూడియోస్ చూశారు. అక్కడ సినిమాలకు చెందిన అనేకానేక విశేషాలు గమనించారు. కొందరు తెలుగువారిని కలుసుకున్నారు. వారందరూ "మీరు మా తెలుగువారు కావటం మా అదృష్టం" అన్నారు.

"మేం ఇండియా వచ్చినప్పుడు తప్పకుండా కలుసుకుంటాం" అన్నారు.

"మా ఇళ్లల్లో కూడా భోషాణాలుండేవి. పెద్ద పెద్ద మంచాలుండేవి. మొన్నా నడుమ ఇంటి గుమ్మం ఇస్తానంటే ఎన్నో లక్షల రూపాయలిస్తామని వచ్చారంట. మావాళ్లు ఇవ్వలేదనుకోండి" అన్నారెవరో.

"వెనకటి కలప ఇప్పుడు దొరకదండి. అంతా మారుజాతి. మొన్నీమధ్య మా ఇల్లు పడగొట్టి రీమోడల్ చేయించారు. అంతకు ముందు దాకా మీ కలప అంత చేస్తుంది, ఇంత చేస్తుందన్నారు. తీరా అమ్మబోతే సగానికి సగం అడిగారు. అమ్మకం అనేది గొప్ప ఆర్ట్. అందరికీ అది కుదరదు" అన్నారింకొకరు.

కొంతమంది లంచ్ చేయమన్నారు. కొంతమంది ఏవేవో కానుకలిచ్చారు.

"మళ్ళీ వస్తారా... వస్తే ముందుగా తెలియచేయండి. మన తెలుగువాళ్లందరం కలుసుకుందాం. తెలుగు మహాసభలకు మిమ్మల్ని పిలిపించాలని మేం డిమాండ్ చేస్తాం" అన్నారు.

ఒకాయన మాత్రం...



"భూషణంగారూ మనదేకులమంటారు" అన్నాడు.

ఏ.ఎన్. ఆయనకేసి చూసి...

"ఏ దేశమేగినా ఎందుకాలిడినా... గుర్తుంచుకో నీ కులాన్ని అన్నారెవరో... భూషణంగారిది తెలుగు కులమే... తెలుగు రక్తమే... మీకు ఇష్టం లేకున్నా" అన్నాడు.

విమానం గాల్లోకి లేచాక భూషణానికి ఏదో గుర్తొచ్చింది.

"అవును సోదరా. కులం అని అడిగితే అలా సమాధానం చెప్పావేమిటి? "

"నిజం చెప్పమంటావా అగ్రజా... చాలా మొరటుగా సమాధానం చెప్పాలనుకున్నాను. ఖండాంతరాలు దాటొచ్చారు. పొట్ట కూటికోసం కూలీలు వలసలు వెళ్ళినట్లు వీళ్ళందరూ ఇండియాని వదిలి ఇక్కడికి వచ్చారు. అయినా కూడా కులాన్ని వదల్లేరు. ఇక్కడ వీళ్లు మరిచిపోదామన్నా ఇండియాలో కొంతమంది వీళ్లకి గుర్తు చేస్తూనే వుంటారు. ఇంకొకసారి చెబుతున్నాను. మన ఇండియాని వదిలివచ్చినవారికి దేశభక్తి లేకపోతేపోయింది. తామూ కూలివాళ్లమనే స్పృహ లేకపోతే పోయింది. కనీసం కాపిటలిస్ట్ ఐడియాలజీ కూడా లేదు. వస్తువులు అమ్ముకోవాలంటే కులం పనికిరాదు. మేధస్సును అమ్ముకోవాలన్నా కులం పనికిరాదు. ఈ చిన్న విషయాన్ని అర్థంచేసుకోలేని వారు మధ్యయుగాలనాటి ఫ్యూడల్ పెత్తందార్లే" అన్నాడు.

ఓ క్షణం భూషణం ఏ.ఎన్. కేసి చూశాడు.

ఏ.ఎన్. మాత్రం సీరియస్‌గా ఆలోచిస్తుండిపోయాడు.

విమానం గాల్లో తేలుతూ భారతదేశం కేసి దూసుకెళ్తోంది.



"అయ్యా మీరు లేకపోయేటప్పటికి నాకు చాలా బోర్ వచ్చేసిందయ్యా" అన్నాడు సూరిబాబు ఇద్దర్నీ చూడగానే.

"ఎలా వున్నాయి మన షాప్స్"

"ఆటికేటండి. అదిరిపోతున్నాయి"

"మరి నీ ట్రైనింగ్ ఎంతవరకొచ్చింది? "

"రోజూ వెళ్తున్నానండి"

"అట్లయితే మనం త్వరలో ఫాస్ట్‌ఫుడ్ సెంటర్ తెరుద్దామా? "

"మీ ఇష్టమండి" అన్నాడు సూరి.

ఇంక ఆ పనుల్లో మునిగిపోయాడు. ఇంకో సెంటర్‌లో లీజ్‌కి తీసుకొన్నారు ఓ బిల్డింగ్‌ని. వాటి డెకరేషన్స్ పూర్తిచేశారు. షాని కాంటాక్ట్ చేసి కేథరిన్‌ని పంపించమన్నారు. ఆ సెంటర్‌ని ప్రారంభించేది కేథరిన్.

అందులో లభించేది అత్యాధునికవంటలే కాకుండా సూరి స్పెషల్ ఐటమ్స్ పులిహోర, దద్ధోజనం, గంజి, పచ్చిపులుసు ఇంకా స్పెషల్ పికిల్స్ పార్శిల్ విభాగం ప్రత్యేకంగా ఏర్పాటుచేశారు. కస్టమర్స్ కూర్చోవటానికి స్పేషియస్ హాల్ వుంది. అక్కడ ప్రతి ఒక్కరికీ అందమైన గెటప్స్ వున్నాయి. ప్రతి ఒక్కరూ అత్యంత మర్యాద పూర్వకంగా ప్రవర్తిస్తారు.

ప్రారంభోత్సవానికి పంపిన ఇన్విటేషన్ కార్డ్స్ చూసి జనానికి మతిపోయింది. భాగ్యనగరంలో భోజన స్వర్గం ఏర్పడిందనే ఫీలింగ్‌తో పాటు లాలాజలం వూరింది.

ప్రారంభోత్సవం అట్టహాసంగా జరిగింది.

పులిహోర రుచి చూశాక కేథరిన్ సూరిబాబు చేతులు పట్టుకొని ఊపేసింది. "సింప్లీ ఎక్సలెంట్" అంది. ఆమేకాదు అన్నం మిగిలిపోతే నిమ్మకాయపిండి పులిహోర చేసుకునే మధ్య తరగతి వాళ్ళు కూడా మొదటిరోజు టేస్ట్ చూద్దాం అని వచ్చి తిని అదిరిపోయారు.

ధర చాలా ఎక్కువగా వుంది. అదేం




టిరా పులిహోర ఇంత టేస్ట్‌గా వుంది. నా కొడుకు ఇందులో మత్తుమందేవన్నా కలిపా డంటావా? అసలు ఆ టీ తాగితే మతిపో యింది. సమస్యేలేదు. కొడుకులు ఏ భంగో, గంజాయి ఎసెన్సో వేసుంటారు"

"అదేంకాదు. మీకు పొరిగింటి పుల్లకూ రంటే రుచి. ఇంట్లో పెళ్ళాలు చేసే వంట కాలు బాగుండవుగానీ, డబ్బులు పోసి మెక్కొస్తే రుచిగానే వుంటాయి" అన్నారు ఆడవాళ్ళు.

"అది సరేనయ్యా... ఫారినర్సో, నార్త్ వాళ్ళో తిన్నారంటే అర్థముంది. మీరు కూడా వెళ్ళి పులిహోర తినిరావటం ఏమిటయ్యా"

"ఇంకా నయం. ముందు ఇడ్లీ తింటానని కూర్చున్నాడు. పండగ పూట కూడా పాత మొగుడేనా అని ఏ దేశం పోయినా ఇడ్లీని మాత్రం వదలం"

"మనం భోంచేశాం. బౌల్‌లో యిచ్చాడు. అట్లాంటి 'సూప్' మన జీవితంలో తాగ లేదు. కాకపోతే కొంచెం కాబేజి వాసనొ చ్చింది"

"ఓర్నీయబ్బ... అదా మా నాయనమ్మ చేసేది. కాబేజిని కడిగి ఆ నీళ్ల పారబొయ్య కుండా కొద్దిగా ఉప్పూ, కారం తగిలించేది. జుర్రుకుంటూ తాగేవాళ్ళం"

"అంటే టోటల్‌గా డిష్‌లన్నీ మనవే"

"అవున్రా. మెదడు వుండాలిగాని మన వంటకాలు ఈ ప్రపంచంలో ఏ వంటకాల కైనా ధీటుగా వుంటాయి. మనం తెల్లారి లేస్తే కెంటకీఫ్రైడ్ చికెన్లూ, పిజ్జాలు, బర్గర్లూ అని ఏడుస్తున్నాం"

"బర్గర్ అంటే భయం. అరగవు. మొన్నో బర్గర్ తిని సాయంకాలం దాకా వాంతి చేసుకుంటూనే వున్నా. అస్సలు ఈ ఆహార పదార్థాలు మన ఆరోగ్యాల్ని చెడగొట్టడానికే వచ్చాయి"

"అవును మరి. అమెరికావాడు ఏది చేస్తే అది మనకి గొప్ప. నా కొడుకులు మన వేరుశనగపప్పుల్ని, మన కార్న్‌ఫ్లేక్స్‌ని, నీట్‌గా పేక్‌చేసి అమ్ముతుంటే ఎగబడి కొనుక్కుంటున్నాం. ఇన్నాళ్ళకి మొనగాడె వడో దొరికాడు. మన వంటకాల్ని గురి చూసి కొడుతున్నాడు"

ఓ పదిరోజులపాటు ఎక్కడ చూసినా ఇవే చర్చలు. ఇంక ఎలైట్ చర్చల్లో సైతం ఇవే అంశాలు చోటుచేసుకున్నాయి. ప్రేమ జంటలు 'టాంక్‌బండ్'మీదకు కాక 'సూరీస్' సూప్ కోసం పరుగులు తీస్తున్నాయి. కేథ రినా వెళ్ళబోయేముందు ఓ ప్రపోజల్ పెట్టింది.

"ఇలాంటి సెంటర్‌ని లండన్‌లో తెరిస్తే బాగుంటుంది" లండన్ మాట వినిపించ గానే భూషణం ఏదో పుస్తకం చదువుకుం టున్న వాడల్లా తలెత్తి చూశాడు.

"అవును సర్. ఒక్క లండన్లోనే కాదు. ఇంకో రెండు మూడు చోట్ల ప్లాన్‌చేయటం మంచిది. ఫ్లైట్‌లో పంపిస్తా. ఇండియన్ స్టైల్ వంటకాలకి ఇప్పుడు విపరీతమైన పేరుంది. ఈవెన్ వైట్‌హౌస్‌లో ఇండియన్ ఛెఫ్స్ వుంటున్నారు"

"దిసీజ్ డ్రెస్ రిహార్సల్. డెఫినెట్‌గా మనం లండన్‌లో ఓ ఫాస్ట్‌ఫుడ్ సెంటర్ తెరవబోతున్నాం" అన్నాడు ఏ.ఎన్.

కేథరిన్ వెళ్ళిపోయాక భూషణం అడి గాడు.

"సోదరా... మనం లండన్‌లో ఫాస్ట్‌ఫుడ్ సెంటర్ తెరుద్దామా?"

"అవును అగ్రజా... 'లండన్'లోనే తెరు స్తున్నాం. అక్కడయితే ఏదైనా అమ్మవచ్చు దేన్నయినా కొనుక్కోవచ్చు కూడా"

భూషణానికెందుకో శరీరం పులకరిం చింది. ఏదో జరగబోతుందనే భావం నిలు వెల్లా ఆవరించుకుంటోంది.

"సోదరా... నా మనసులో చాలా ఆలో

చనలున్నాయి. స్లో స్టడీ అండ్ విన్ ది రేస్ అన్నారు పెద్దలు. 'షా' మనందరికీ పెద్దన్న లాంటివాడు. అతని సహకారంతో మనం చేయాల్సిన పనులు చాలా వున్నాయి. 'లండన్'లో మనం ఫాస్ట్‌ఫుడ్ సెంటర్ తెర వటమేకాదు. కొంతకాలం అక్కడే వుండబో తున్నాం. అవసరమైతే అక్కడి పౌరసత్వం తీసుకుంటాం"

"మనకి ఇస్తారంటావా? "

"ఇవ్వకపోవటానికి మనమేం హంత కులం కాదు. కిడ్నాపర్స్‌కాదు. దేశం సొమ్ము దగాచేసి విదేశీ బ్యాంకుల్లో నిల్వచే సుకున్న మోసగాళ్ళం కాదు. ఇక్కడ అల్లర్లు చేసి విదేశాలు పారిపోతున్న వాళ్ళం కాదు. ఇలాంటివాళ్ళకే ఆయా దేశాలు గేట్లు తెరు స్తున్నప్పుడు మనలాంటివారికి సిటిజన్‌షిప్ ఇవ్వటానికి అభ్యంతరం ఏముంటుంది... అందులోనూ మన వెనక 'షా' వున్నారు. అన్నీ ఆయన చూసుకుంటారు"

"అవును... ఇంతకీ ఎన్నాళ్ళు పడుతుం దంటావ్ సోదరా"

"చూద్దాం... మీ మనసు నాకు తెలుసు అగ్రజా. ఇవన్నీ ఎంత త్వరగా పూర్తిచేసు కుంటే అంత మంచిదని చూస్తున్నాను. నేను 'ఆర్ట్ ఎగ్జిబిషన్ ఏర్పాట్లు చూస్తాను. మన ప్రఖ్యాత చిత్రకారులు రామ్‌గారిని కల వబోతున్నాను" అన్నాడు.

★ ★ ★

"రాబాబూ... మీరు సాధిస్తున్న విజయా లగురించి వింటున్నాను. ఈ ప్రపంచపు తీరుని బాగా అర్థం చేసుకున్నట్లు కనిపిస్తు న్నావు" అన్నారు ఆర్టిస్ట్ రామ్ చిరునవ్వుతో.

"అంత గొప్ప వ్యక్తిని కాదు సార్. ఆర్ట్ ఎగ్జిబిషన్ ఏర్పాటు చేద్దామని ఇంతకు ముందు మీతో అన్నాను. మీరు మాకు చేసిన ఉపకారానికి నేను వెలకట్టలేను. ఏం చేయమంటారో చెప్పండి. ఆర్ట్ ఎగ్జిబి షన్‌కయ్యే ఖర్చులన్నీ మా సంస్థ భరి స్తుంది. కాకపోతే నా విన్నపం ఒకటే. యంగ్ ఆర్టిస్టులీ... పేద ఆర్టిస్టుల చిత్రాల్నీ ఎంకరేజ్ చేద్దాం. వాటిని మాగ్జి మమ్ ప్రమోట్ చేయటానికి ట్రైచేస్తాను. ఇందులో వచ్చే ప్రతి పైసా ఆర్టిస్ట్‌లకే చెందు తుంది. ముఖ్యంగా మీ చేతుల మీదుగా అలాంటివారందరూ సత్కరించబడాలి"

"తప్పకుండా"

"మరి మీరు ఆ ఆర్టిస్టులందరినీ కాంటాక్ట్ చేయాలి. నేను మీకు అందుబాటులో వుంటాను. ఫాక్స్ మేసేజ్‌లు పంపుదాం. ఇంటర్‌నెట్‌ని ఉపయోగించుకుందాం. కార్య క్రమం ఎలా చేయాలనేది పూర్తిగా మీకు వదిలేస్తున్నాను"

"అలాగే... ముందు మన క్రిటిక్ రావ్‌ని పిలుద్దాం. అతనయితే మంచి సలహాలు యిస్తాడు. తనలో గొప్ప హ్యూమర్ అండ్ హ్యూమన్ ఎలిమెంట్ వుంది. కొత్తగా వస్తున్న చిత్రకారుల గురించి అతనికే బాగా తెలుసు. ఈ పోటీలో పాల్గొనటానికి ఇంకొందరికి అవకాశం యిద్దాం"

"అలాగే సర్" అన్నాడు ఏ.ఎన్?

"పోటీ అన్నాను కదూ... ఆ మాట విత్‌డ్రా చేసుకుంటున్నాను. ముందు పత్రిక లకి ప్రకటనలిప్పించండి. ఈ ఆర్ట్ ఎగ్జిబిష న్‌లో ఎవరైనా పాల్గొనవచ్చు తమతమ చిత్రాలు పంపవచ్చు అని. ఏమాత్రం బాగున్నా ఇందులో ప్రదర్శిద్దాం"

"చిన్న డౌట్ సర్"

"ఏమిటది? "

"ఇలా చేయటం వలన క్రిటిక్స్‌కి కోపం వస్తుందేమో"

"రానివ్వండి. ఒకనాడు మేం కూడా అమె చ్యూర్ ఆర్టిస్ట్‌లమే. మెల్లగా అన్నీ నేర్చు కున్నాం. ఇప్పుడు నలుగురూ మా చిత్రాల్ని బాగున్నాయంటున్నారు. నేనొకటడుగు




తాను. ఈజ్ దేర్ ఎనీ గ్రేట్ క్రిటిక్ ఇన్ ఇండియా ఆర్ ఇన్ ఎబ్రాడ్"

ఏ.ఎన్. మాట్లాడలేదు.

"నేను కేవలం ఆర్ట్ గురించి అడగటం లేదు. లిటరేచర్‌లో గొప్ప క్రిటిక్ వున్నాడా? గొప్ప ఎడిటర్ ఉన్నాడా? ఉన్నానని గుండెలమీద చెయ్యి వేసుకు చెప్పగలరా? అంతేకాదు గొప్ప రచయితలూ రచయిత్రులూ ఉన్నారా? గొప్ప సృజనవుందా? వీటన్నింటినీ కొలవటానికి ఏవన్నా కొలబద్దలున్నాయా? "

ప్రశ్నల వర్షం కురిపిస్తుంటే ఏ.ఎన్. ఆయనకేసి చూస్తుండిపోయాడు.

"అంటే నేను 'గొప్ప' వాటిని గుర్తించకపోవటమో, తిరస్కరించటమో కాదు. ఆ కాన్సెప్ట్‌ని అడ్డంపెట్టుకుని అమెచ్యూర్‌గా కామెంట్స్ చేసేవారి గురించి నా ఆవేదన. ఈ ఎగ్జిబిషన్‌కి వంద చెత్త చిత్రాలు రావచ్చు ఒక్కటి మంచి చిత్రం వస్తే చాలు. మనం మంచి కావాలంటే దొరకదు. సెర్చ్ చేయాలి. సముద్రంలో అన్నీ ముత్యాలు దొరికితే ఇంక వాటికి విలువేముంటుంది. సెర్చ్ చేసే ఓపిక లేనివాడు 'చెత్త' గురించి మాట్లాడకూడదు. అసలు దేన్నయినా 'చెత్త' అనటం అనవసరం. ప్రకృతి సూత్రం ఒకటుంది. సర్వైవల్ ఆఫ్. ది ఫిట్టెస్ట్. ఏది అవసరమో అది వుంటుంది. లేనిది అనివార్యంగా తప్పుకుంటుంది. అందుకే అధికార స్థానాల్లో కూర్చునేవారు ఏదో చెడిపోయిందని రోదించే కంటే... బాగున్నదానిని హైలైట్ చెయ్యాలి. ప్రతి కళారూపంలోనూ అదెంత అపరిపక్వంగా వున్నా... అందులో ఆ కళాకారుడికి తపన వుందా లేదా అనేది తెలుస్తుంది. అది గుర్తించి అలాంటివారిని తయారుచేస్తే గొప్పగా రూపుదిద్దుకుంటారు"

ఏ.ఎన్. మౌనంగా ఆయన మాటలు వింటున్నాడు.

ఆయన ఉద్వేగంనుండి తేరుకున్నాక అన్నారు.

"ఏమిటీ ఇంత ఎగ్జయిటయ్యాను. నా తొలినాళ్లలో ఎదుర్కున్న విమర్శలు గుర్తొచ్చుంటాయి. ఇవి బొమ్మలా, రోడ్డుమీద వేసేవాళ్ళు ఇంతకంటే బాగా వేస్తారు" అన్నాడు. నేను కోపం తెచ్చుకున్నాను. నాకు తెలుసు బాబూ నిజమైన చిత్రకారులు అలా రోడ్డున పడినవాళ్లే. ఇప్పటికీ అలాంటి కామెంట్లు వింటూనేవున్నా. చాలామంది యువకులు బాధపడుతుంటారు. ఎవడైనా సరే తననితాను సర్వజ్ఞుడిగా ప్రకటించుకోవటంలో బోల్డంత హాస్యముంది. హాస్యాన్ని అనుభవించండి. ఆరోగ్యంగా వుంటారు అని సలహా చెబుతుంటాను" అని నవ్వారాయన.

ఏ.ఎన్. మనస్ఫూర్తిగా నవ్వాడు.

"ఓ.కే.సార్. మీరు చెప్పినట్లే చేద్దాం. మళ్ళీ కలుస్తాను" అని వచ్చేశాడు.

పత్రికలో ప్రకటించగానే ఎన్నెన్నో చిత్రాలు రావటం మొదలయ్యాయి. వాటన్నింటినీ రావ్, రామ్, ఏ.ఎన్.లతోపాటు కొంతమంది ఆర్ట్ లవర్స్, క్రిటిక్స్ పరిశీలించారు. ఏమాత్రం స్పార్క్ వున్నా వాటన్నింటినీ సెలక్ట్ చేశారు. అందరూ చర్చించాక ఓ నిర్ణయం తీసుకున్నారు.

"మొత్తం ఎగ్జిబిషన్ వారం రోజులపాటు జరుగుతుంది. అందులో ఏరోజుకారోజు చిత్రాలు ప్రదర్శిస్తారు. ఒకసారి ప్రదర్శించినవి రెండో రోజు వుండవు. మొత్తం రెండు ఆడిటోరియమ్స్‌లో వీటిని ఎగ్జిబిట్ చేస్తారు. కొనదలిచినవారు సాయంకాలం నుండి పాటలో పాల్గొనవచ్చు ప్రఖ్యాత చిత్రకారులతోపాటు మామూలు చిత్రకారుల వరకు అందరి చిత్రాలూ పక్కపక్కనుంటాయి. స్పెషల్ ఇంట్రడక్షన్స్ వుండవు. వేలం అయ్యాక మాత్రమే ఆయా చిత్రకారుల్ని

పరిచయం చేయటం జరుగుతుంది. అదీ చిట్టచివరిరోజు వేదికమీద"

ఈ నిర్ణయాన్ని ప్రెస్‌మీట్‌లో చెప్పారు.

ఎగ్జిబిషన్ ప్రారంభం అయింది. ట్రిమెండస్ రెస్పాన్స్. అనేకమంది చూడటానికి వచ్చారు. ప్రతిరోజూ కొన్ని పదుల చిత్రాలు అమ్ముడుపోతున్నాయి. కొన్ని వేల రూపాయలనుండి లక్ష చిల్లరదాకా అమ్ముడుపోయిన చిత్రాలున్నాయి. ట్రెడిషనల్ ఆర్ట్‌నుండి మోడ్రన్ ఆర్ట్‌దాకా అన్నింటినీ ఆదరించారు.

ప్రతిరోజూ ఈ ఎగ్జిబిషన్ గురించి ప్రత్యేక వ్యాసాలు రాయటానికి ఆర్ట్ క్రిటిక్స్‌ని నియమించాయి పత్రికలు. నార్త్ పత్రికల రిపోర్టర్స్ కూడా వచ్చారు. ఛానల్స్ వారు వచ్చారు.

చివరిరోజున సభ అద్భుతంగా జరిగింది. నవ చిత్రకారులు వేదికమీద కొచ్చారు. తమతమ చిత్రాల్ని ప్రదర్శించే అవకాశం దొరకదనుకునేవాళ్ళం అనీ, ఇంత ధరకు తమ చిత్రాల్ని కొనటం జీవితంలో ఊహించని అద్భుతంగా పేర్కొన్నారు.

రామ్‌గారు మాట్లాడుతూ,

"ఎవరిది ఏ చిత్రమో ఆర్ట్ గురించి అవగాహన ఉన్నవారికి తెలుసు. ఈ ఎగ్జిబిషన్‌లో గొప్ప సీనియర్ ఆర్టిస్టుల చిత్రాల కంటే అమెచ్యూర్ చిత్రకారుల చిత్రాల్ని ఎక్కువ ధరకి కొన్న సందర్భాలున్నాయి. అంతెందుకు నా చిత్రాన్ని మూడువేలకు మాత్రం తీసుకున్నారెవరో. వారికి నేను తెలియదు. నాకు బోల్డంత సంతోషం కలిగింది. మమ్మల్ని మేం అంచనా వేసుకోవటానికి ఈ ఎగ్జిబిషన్ అవకాశం కలిగించింది"

చివరిగా ఏ.ఎన్ క్లుప్తంగా మాట్లాడాడు.

"ఈ కార్యక్రమాన్ని విజయవంతం చేయటానికి సహకరించిన వారందరికీ మా ధన్యవాదాలు తెలియచేసుకుంటున్నాం.

ఇదే సమయంలో మీ అందరికీ ఇంకో విషయం చెప్పాలనుకుంటున్నాను. అత్యంత త్వరలో... ఇంకో ఆర్ట్ ఎగ్జిబిషన్ జరగబోతోంది. అందులో పాల్గొనేవారికి ఫ్యాన్సీ బహుమతులుంటాయి. కాకపోతే ఆ పోటీలు జరగబోయేది... ఇలాంటి ఆడిటోరియమ్స్‌లో కాదు"

పిన్‌డ్రాప్ సైలెన్స్.

ఏ.ఎన్. ఒక్కొక్క మాటని వత్తిపలికాడు.

"రోడ్లమీద"

అతనేమంటున్నాడో అర్థంకాలేదు.

"యస్... రోడ్లమీదే. ఇవి అమ్మకానికి కుదరవు. అయినా సరే ఇందులో పాల్గొనేవారికి కనీ, వినీ ఎరుగని బహుమతులుంటాయి. ఎవరైనా ఇందులో పాల్గొనవచ్చు. అందరికీ ఆహ్వానం. థాంక్యూ"

అప్పుడు మొదలైంది కలకలం.



ఏ.ఎన్. గంభీరంగా ఉన్నాడు.

భూషణం నిమిత్తమాత్రుడిలా చూస్తున్నాడు.

వారిముందు రకరకాల పత్రికలు పడుతున్నాయి. వాటినిండా ప్రశంసలు, విమర్శలు, ప్రత్యేకవ్యాసాలు. ఇంకా పాఠకులనుండి వచ్చిన ఉత్తరాలు వున్నాయి. కళారంగాన్ని

ఓ కుదుపు కుదిపాడు ఏ.ఎన్.

ఎగ్జిబిషన్ అయిన మరుసటిరోజునుంచి దళారులు తయారయ్యారు. తమతమ బయోడేటాలు తెచ్చారు. తమ పుస్తకాలు, పొందిన సన్మానాలు, తీయించుకున్న ఫోటోలు, ఇంకేవేవో రికమండేషన్స్ తీసుకొచ్చారు.

కొన్ని సంస్థలవారు సన్మానం చేస్తామన్నారు.

ఇంకొందరు చందాలు అడిగారు.

"నాటకరంగం దీనస్థితిలో వుంది. ఉద్ధరింపబడాలంటే మీరు పూనుకోవలసిందే" అన్నారు.

"లైఫ్ టైమ్ ఎఛీవ్‌మెంట్ అవార్డులు ప్రవేశపెట్టమన్నారు". "'సెలక్షన్' బోర్డులో మేముంటాం. మొత్తం కార్యక్రమాలు మేం నిర్వహించి పెడతాం" అన్నారు.

"మనవాళ్ళున్నారు వాళ్ళని గుర్తించాలి, గౌరవించాలి" అన్నారు.

ఒకటి రెండు కాదు అన్నిరంగాల వారూ తమతమ రంగాల్ని ఉద్ధరించాల్సిందేనంటూ వత్తిడి చేశారు.

కొంతమంది 'సీనియర్లు' ఉత్తరాలు రాశారు. ఈ శతాబ్దపు మాస్టర్ పీస్‌ల సంకలనాలు తెస్తే బాగుంటుందని.

ఇంకొందరు తను శిష్యుల్ని పంపించారు. వారు గురువుల కీర్తి గురించి ప్రముఖంగా చెప్పారు.

ఈ రద్దీ తట్టుకోలేకపోయాడు ఏ.ఎన్.

"సోదరా... మనం ఒక్క నెలరోజులు భాగ్యనగరం నుండి మాయం అవుతున్నాం"

"ఎక్కడికి వెళ్దాం" అన్నాడు భూషణం.

"న్యూజీలాండ్" అన్నాడు.

రెండురోజులు నిద్రపోయారు హాయిగా.

ఆ తర్వాత రెండురోజులు న్యూజిలాండ్‌ని చుట్టివచ్చారు.

"మొన్నటి కార్యక్రమంలో మిమ్మల్ని కనిపించకుండా చెయ్యటానికి కారణాలున్నాయి సోదరా. ఇంక మన సెకండ్ వెంచర్ ఫ్యాషన్ పెరేడ్... దానిలో నేను కనిపించను. తెరవెనక వుంటాను. తెరముందు మీరు వుంటారు"

"కానీ... నేను ఫ్యాషన్‌కి సరిపోతానా?"

"అదే తమాషా... అల్ట్రామోడ్రన్, అతిపురాతనం, రెండూ పక్కపక్కనుంటేనే అందం. వెర్రెక్కిపోతారు. చూస్తుండండి. ఇక్కడనుంచే మనం స్కెచ్ గీసుకుందాం"

ఏ.ఎన్. ఆ ఏర్పాట్లలో వున్నాడు.

ఓ రాత్రి 'షా' ఆనందంగా చెప్పాడు ఫోన్లో.

"డన్ మిస్టర్ ఏ.ఎన్. మన భోషాణానికి పేటెంట్ దారులం మనమే. వచ్చేస్తున్నా. ఇంక తుఫాన్ వేగంతో పనులు జరిగిపోవాలి"

'య్యా' అంటూ గాల్లోకి లేచాడు ఏ.ఎన్.

"ఏమైంది సోదరా"

"మన భోషాణానికి పేటెంట్ రైట్స్ యిచ్చారు"

"నిజంగానా?"

"అవును..."

భూషణం గంతులేశాడు. అరగంటవరకు ఆ ఆనందాన్నుంచి బయటకు రాలేకపోయాడు. "నమ్మశక్యంగా లేదు సోదరా" అని ఏ.ఎన్.ని పట్టుకు ఊపేశాడు.

"అరె... ఎంత ఆశ్చర్యం. ఎందుకూ పనికిరాని ఓ బల్లచెక్కకి ఇంతటి క్రేజా? ఎన్నిసార్లు దానిపక్కగా నడిచాను. ఎన్నిసార్లు దానిని బద్దలుచేసేయాలనుకున్నాను. నా పేరుతో పోటీపడుతుందని ఎన్నిసార్లు కోపం తెచ్చుకున్నాను. అలాంటిది ఈరోజు ఎన్నెన్ని మాయలు చేస్తోందో చూసుకుం

టుంటే... ఓహోహో" అని తనలోతనే మాట్లాడుకున్నాడు.

"సోదరా... నీ మేధస్సుకి తలవంచి అభి వందనాలు అర్పిస్తున్నా, నా కంటే చిన్నవా డివేకావచ్చు ఈ రోజున కావలసింది మేధస్సు అని అర్థంచేసుకున్నా. అది వుంటే ఎన్ని అద్భుతాలైనా చేయవచ్చు నీలో కేవలం మేధస్సు మాత్రమే కాదు వున్నది. పట్టుదలవుంది. శ్రమించే తత్వంవుంది. నిన్ను నేను ఒక్కముక్కలో ఆరాధిస్తున్నా. ఐలవ్‌యూ మై ఫ్రెండ్... ఫిలాసఫర్ అండ్ గైడ్" అన్నాడు ఉద్వేగంతో.

"అగ్రజా... మనందరం నిమిత్తమా త్రులం"

"అలా అనకు సోదరా... నువ్వు కృష్ణ పరమాత్ముడిలాంటి వాడివి. అన్నీ నువ్వే... నేను అర్జునుడిలాంటి వాడిని. అన్ని అహం కారాలూ వదిలేసి చెబుతున్నా నీ పాదాలకు నమస్కరించాలనుంది. చిన్నవాడివైతేనేం అనుమతించు"

"వాటికి నేను వ్యతిరేకిని అగ్రజా" అన్నాడు ఏ.ఎన్.

★ ★ ★

'షా' వచ్చేశాడు.

అందరూ కలసి 'ఇండియా' వెళ్ళిపో యారు.

'భోషాణాల'ని తయారుచేయటంపై క్వాలిటీ విషయంలో ఏమాత్రం రాజీపడటా నికి వీల్లేదు. ముందు మనం మంచి సంద ర్భాన్ని చూడాలి. అది ప్రపంచవ్యాప్తంగా అందరికీ సంబంధించినదైతే బాగుంటుంది. పెద్ద ఫంక్షన్‌లో వాటిని విడుదల చేయిం చుదాం. ఆ పీసెస్‌కి ధర కూడా సామాన్యు లెవరికీ అందుబాటులో వుండకూడదు" అన్నాడు షా.

"అలా అయితే ఎన్ని దేశాలున్నాయో అన్ని పీసెస్ మాత్రం తయారుచేద్దాం. ఇలాంటి అరుదైన మోడల్ దేశంలో ఒకరి దగ్గర మాత్రమే వుంటుంది. దానికి ఎంత ధర వుండాలో ఆయా దేశాల వారే తేల్చు కుంటారు" అన్నాడు ఏ.ఎన్.

"అంతేకాదు. 'భూషణమ్ కప్' క్రికెట్ పోటీలగురించి ప్రాథమిక చర్చలు జరి పాను. భారత్, పాకిస్థాన్, మరికొన్ని దేశాలు పాల్గొనవచ్చు వాటికి చెందిన ఫార్మాలిటీస్ అన్నీ పూర్తి చేసే బాధ్యత అందరికీ అప్పచెప్పాను. ఇంక మనం చేయ వలసిందల్లా ప్రపంచవ్యాప్తంగా టూర్ చేయటం. ఎక్కడికక్కడ మన మనుషుల్ని అపాయింట్ చేసుకోవటం" అన్నాడు 'షా'.

"అలాగే"

"కేథరిన్ మీ సూరి విషయంలో చాలా ఇంట్రెస్టింగ్‌గా వుంది. లండన్‌లో గొప్ప రెస్టారెంట్ ఏర్పాటు చేయాలంటోంది. అందుకు చెందిన పనులన్నీ తనే చూసుకుం టానంది. నీ ఇష్టం అని చెప్పాను"

"బాగుంది సార్... మనం ఫ్యాషన్ పెరే డ్‌ని పూర్తిచేస్తే ఇంక ఇతర పనుల్లో నిమగ్నం అయిపోవచ్చుననుకుంటున్నాం. ఎవరి పనులు వారికి అప్పచెబుదాం. ముందు ఈ 'భోషాణం' విషయం గురించి ఎనౌన్స్ చేయాలి. అందుకు ఏర్పాట్లు చేద్దాం"

"అది ఢిల్లీలో అయితే బాగుంటుందేమో"

"అలానే చేద్దాం"

★ ★ ★

దేశంలో ఈ వార్త విన్నవారందరూ ఆశ్చ ర్యపోయారు.

భోషాణానికి 'పేటెంట్' ఇవ్వటం ఏమి టని? కొంతమంది హర్షం వెలిబుచ్చారు. ఇంకొంతమంది 'భారతదేశం'లో పుట్టిన ఈ భోషాణం తయారు చేసుకోవటానికి ఎవరి కైనా హక్కు వుండాలి. చెట్లు విత్తనాల





నుండి వస్తున్నాయి. అలాంటి విత్తనాల మీద పేటెంట్ హక్కులంటున్నారు. ఇప్పుడు భోషాణాలకు హక్కులు. రేపటి నుండి వంకాయకూరకి, పచ్చిపులుసుకి కూడా పేటెంట్ హక్కులంటే సామాన్యులు బతకటం సాధ్యపడుతుందా అన్నారు.

మేధావులు ఇంకొందరు ఈ వాదనని అంగీకరించలేదు.

"భోషాణం నిత్యజీవితావసరం కాదు. దీనిని వ్యతిరేకించేవారు భోషాణాలను కొన కుండా వుంటే సరిపోతుంది" అన్నారు.

'ఫ్యాషన్ పెరేడ్' మీద కూడా నిరసన ధ్వనులు వినిపించాయి.

"అందాల పోటీలకు మరోరూపం ఇవి" అన్నారు.

"అందంగా వుండాలనుకోవటం తప్పు కాదు. ఫ్యాషన్లను వ్యతిరేకించే వారు మరీ ఛాదస్తులు. 'ఫ్యాషన్' అనేది కాలాన్ని బట్టి మారుతుంటుంది. ఈ రోజు మన బట్టలు, క్రాఫ్ ఇవేవీ భగవంతుడు నిర్ణయించినవి కాదు. అన్నికాలాలకూ సరిపోయేవికాదు. అందుకని ప్రజల ప్రాథమిక హక్కులమీద దాడిచేయటం యిది. మీరు కట్టుకుంటున్న బట్టలు కూడా ఓ ఫ్యాషన్‌కి చెందినవే" అన్నారు ఇంకొందరు.

పత్రికలు ఇలాంటి విషయాల్ని చర్చించ మని పాఠకులకు విజ్ఞప్తి చేశాయి. దాంతో రకరకాల అభిప్రాయాలు వెల్లువలా వచ్చిప డ్డాయి.

"ఇదంతా సామ్రాజ్యవాద దేశాలు మార్కె ట్లకోసం విసురుతున్న వల" అన్నారు కొందరు.

"ఈ పరిణామాల్ని ఎవరూ ఆపలేరు. దేశంలో అనేకానేక సమస్యలుంటే ఈ ఫ్యాషన్స్‌మీద చర్చ అనవసరం" అని ఒకా యన అభిప్రాయం.

'ఫ్యాషన్ పెరేడ్' అనుకున్నట్లుగా జరి గింది.

ట్రెమండస్ రెస్పాన్స్. అందులోనూ కొన్ని కోట్ల రూపాయల వ్యయంతో నూట ఏభై సంవత్సరాలక్రితం జరిగిన ఓ యధార్థగా థను తెరకెక్కిస్తున్న నిర్మాతలు తమ చిత్రం లోని దుస్తుల్ని ప్రదర్శించారు. ఎంతమందో ప్రముఖ మోడల్స్ ఈ కార్యక్రమంలో పాల్గొ న్నారు. చుట్టుపక్కల దేశాలనుండి సైతం 'డిజైనర్స్' వచ్చారు.

'భూషణం' మరోసారి వార్తల్లోని వ్యక్తి అయ్యాడు.

పత్రికలు సంపాదకీయాలు రాశాయి.

"కాదేదీ కవితకి అనర్హం' అన్నాడు మహా కవి. ఈ రోజు ఏ విషయం తీసుకున్నా ఆయన మాటలు తలపుకొస్తాయి. వస్త్రప్ర పంచం ఓ మహాసాగరంలాంటిది. ఆయా కాలాల్లో సంస్కృతులను అధ్యయనం చేయ టానికి దుస్తులు సైతం దోహదంచేస్తాయి. అందులోనూ 'వస్త్రప్రపంచం విషయంలో మనదేశానికి గొప్ప ప్రావీణ్యతవుంది. అగ్గిపె ట్టెలో పెట్టగల చీరలు నేసిన ఎందరో చేనేత కళాకారుల గురించి మన చరిత్ర చెబుతోంది. ఈనాటికీ అలాంటి కళాకా రులు మనకు కనిపిస్తున్నారు. మొత్తంమీద ఇండియన్ యూత్‌లో ఫ్యాషన్ కాన్సెప్ట్ పెరిగింది. ఫ్యాషన్ టెక్నాలజీ విస్తృతం అవుతోంది. రకరకాల ఇన్‌స్టిట్యూట్స్ వెలుస్తు న్నాయి. ఇవన్నీ అనివార్యమైన పరిణా మాలు. కాకపోతే ఈ నాణానికి మరో ముఖం, ఈ దుస్తులకు అవసరమైన ముడి సరుకును ఉత్పత్తి చేస్తున్న ప్రత్తిరైతుల ఆత్మహత్యలు. మరో ముఖం చేనేత కార్మి కుల ఆకలి చావులు. ఈ ఫ్యాషన్ హోరులో అవేవీ ప్రజలను కదిలించలేవు. ఇదే అసలు సిసలు విషాదం"

ఇంకో పత్రిక మరో కోణంనుండి సంపా దకీయం రాసింది.

"ఇండియా ఇంకేమాత్రం పేదదేశం కాదు. ఇప్పటివరకూ ఆ విషయాన్ని మన సినిమాలూ, సినిమా తారలూ, వారి వైభవాలూ నిరూపిస్తున్నాయి. ఫ్యాషన్స్ ప్రతి క్షణమూ మారిపోతున్న ప్రపంచంలో ఇంకా మడికట్టుకుని కూర్చోవటం ఎవరికీ సాధ్యం కాకపోవచ్చు"

"ఫ్యాషనంటే నగ్నత్వంగా భావించబడుతున్న రోజుల్లో నిండుగా బట్టలు ధరించటం కూడా ఫ్యాషనే అని చెబుతున్న ఇలాంటి కార్యక్రమాల్ని ఆహ్వానించక తప్పదు"

"ఏమిటో... కాలం మారిపోయింది" అని అంగీకరించక తప్పని వారు కొందరు. మొత్తంమీద ఫ్యాషన్ పెరేడ్ కొత్త ఆలోచనల్ని రగిలించింది.



'షా', ఏ.ఎన్., భూషణం ఆ గదిలో కూర్చున్నారు.

"ఇప్పటివరకూ జరిగిన కార్యక్రమాల్ని సమీక్షించుకుంటే నాకో విషయం అర్థమైంది. మిత్రుడు భోషాణానికి పేటెంట్ రైట్స్ తీసుకోమన్నప్పుడు వర్కవుటవుతుందా అనే అనుమానం కలిగింది. కనీసం దాని ఖర్చులు దానికి రాకపోతాయా అనుకున్నాను. ఇప్పటివరకూ జరిగిన వ్యాపారం చూస్తే దిగ్భ్రాంతికరమైన కొన్ని నిజాలు తెలుస్తున్నాయి" అంటూ కొన్ని రిపోర్టులు తీశాడు.

దానిప్రకారం భారతదేశంలో ఈ భోషాణాల అమ్మకం అన్ని దేశాల్లోకంటే ఎక్కువగా వుంది. మధ్యతరగతివారు 'డ్రీమ్' చేస్తున్న వస్తువుల్లో ఇది చేరిపోయింది. 'భూషణం' ఓ స్టేటస్ సింబల్‌గా మారాడు. ఈ అవార్డులు 'ప్రిస్టేజియస్'గా భావిస్తున్నారు.

"నా అంచనా ప్రకారం 'భోషాణం' ఆలోచన ఇండియాలో ఫెయిలవుతుందనుకున్నాను. అందుకే నీకు బోనస్‌గా యిచ్చాను. అదెంత పొరపాటో ఇప్పుడు తెలిసింది, నేను నిర్వహించిన సర్వేలను బట్టి.

ప్రపంచదేశాలు 'ఇండియా'కేసి ఎందుకు చూస్తున్నాయో, ఇక్కడ పెట్టుబడులు పెట్టడానికి ఎందుకు ముందుకొస్తున్నాయో అర్థం అయింది.

విదేశీ పెట్టుబడులు పెద్దపెద్ద పరిశ్రమల్లోకి రావటం లేదు. ఫుడ్, ఫ్యాషన్, సినిమా, హాస్పిటల్స్ ఇలాంటి వాటిమీద ఇన్‌వెస్ట్ చేస్తున్నారు. భారతీయుల్లో వస్తువులపట్ల వ్యామోహం వుంది! తప్పించి ఎవేర్‌నెస్ లేదు. వారిని ప్రకటనలద్వారా తేలిగ్గా ఆకర్షించవచ్చు. ఇంత విశాలమైన దేశంలో కాలూనితే కొన్ని వందల కోట్లు ప్రతి సంవత్సరం తీసుకుపోవచ్చు. ఇంకొక ముఖ్యమైన విషయం. 'ఒకటి కొంటే ఇంకొకటి ఫ్రీ' అంటే చాలు. ఆస్తులు అమ్ముకునైనా తమకు అక్కరలేనివి కొంటారు" అన్నాడు 'షా'.

"గురువుగారూ... ఇండియాని మాకు వదిలేసినా, ఈ ఆదాయంలో సగం వంతు మీకే ఇస్తున్నాం" అన్నాడు ఏ.ఎన్.

"సరదాగా అన్నాను మిత్రమా... నాకింకా చాలా వ్యాపారాలున్నాయి. ఎంజాయ్ చెయ్యండి"

"ఏమిటి ఎంజాయ్ చెయ్యటం ఇంతవరకు పెళ్ళీ పెటాకులు లేవు. డబ్బు సంపాదించాలనే యావతోనే గడిచిపోతోంది"

"మంచి అమ్మాయిని చూసి ప్రేమించండి"

"అంత తీరికేది"

"లేకపోతే వధువు కావలెను అనే ప్రకటన ఇవ్వండి" అన్నాడు షా.

"అదే అవుతుందేమో. మా అగ్రజుడు భగ్నప్రేమికుడు. జీవితాంతం వివాహం లేకుండా ఆ జ్ఞాపకాల్తో బతకాలనుకుంటు





న్నాడు. మా సూరిబాబుని భార్య విడిచిపెట్టింది. ఇంక నేను ఇక ఆ విషయం గురించి ఆలోచించాలి"

"భూషణంగారి గురించి మొదటిసారిగా వింటున్నాను. ఇంతకూ ఎవరా అమ్మాయి? ఎందుకని పెళ్ళికాలేదు, చెప్పండి" అన్నాడు షా.

"అదో పెద్దకథ. ఆ అమ్మాయి ప్రస్తుతం లండన్‌లో వుంటోంది. ఎక్కడుంటుందో కూడా తెలియదు. మా తర్వాతి మజిలీ లండన్. అక్కడ మేం కొంతకాలం వుండాలనుకుంటున్నాం. అందుకు తగ్గ ఏర్పాట్లు చెయ్యాలి. అవసరమైతే గ్రీన్‌కార్డ్ లాంటివి ఎరేంజ్ చేయాలి. మేం అక్కడే సెటిల్ అయినా ఆశ్చర్యంలేదు"

"అది పెద్ద సమస్య కాదు. ఇవాల్టి రోజుల్లో ఎక్కడున్నా ఒకటే. ప్రపంచం బాగా దగ్గరైంది. ఇంక నేను ఆ పనిలో వుంటాను" అన్నాడు షా.

వారిద్దరినుండి సెలవుతీసుకొని వెళ్ళాక అతనికి కేథరిన్ గుర్తొచ్చింది. ఇంతవరకూ కేథరిన్ పెళ్ళి గురించి ఆలోచించలేదు తను. వాళ్ళ మదర్ వుంటే ఎలా వుండేదో. ఇంతవరకూ కేథరిన్ ఎవరినీ లవ్ చేసినట్లు లేదు. డేటింగ్ చేసినట్లు కూడా లేదు.

డిఫరెంట్ గర్ల్. తనకీ ఎప్పుడూ బిజినెస్ మీద దృష్టి. ఈస్థటిక్స్ అంటే ప్రాణం. భూషణాన్ని చూసిన కొత్తలో ఎప్పుడూ అతని గురించే మాట్లాడేది. తన ఫ్రెండ్స్‌కి అతన్ని చూపించాక అనేకసార్లు వారి మాటల్లో భూషణం పేరు దొర్లింది. భూషణాన్ని ప్రేమిస్తుందా అనుకున్నాడు. వారిద్దరికీ వయసు విషయంలో తేడా వుంటుంది. అయినా ఈకాలం ఆడపిల్లలు, ముఖ్యంగా పెద్దకుటుంబాలనుండి వచ్చే పిల్లలు అలాంటి విషయాలు పట్టించుకోరు. తనంతట తాను చెబుతుందేమో అనుకున్నాడు. కేథరిన్‌కి అలాంటి ఆలోచన వున్నట్లు లేదు.

ఇంక ఆలస్యం చేయటం మంచిది కాదు. వెంటనే కేథరిన్‌తో ఈ విషయం మాట్లాడాలి అనుకున్నాడు. 'షా' ఒకటనుకుంటే ఇంక ఆలస్యం చేయడు. కేథరిన్‌కి ఫోన్ చేశాడు.

"డాడీ... ఎలా వున్నారు? " అంది.

"నీ గురించే ఆలోచిస్తున్నానమ్మా. నీ మారేజ్ చేస్తే ఎలా వుంటుందా అని"

"నా మారేజ్ మీరు చేస్తారా. నన్ను చేసుకోనివ్వరా? "

"నువ్వు చేసుకునేటట్లు కనిపించలేదుగా. అందుకనే నేను చేయాలనుకుంటున్నాను"

"చేసుకుంటానులెండి నాన్నగారూ" అంది.

"అదేంటమ్మా ఇండియాలో పిల్లలకయితే ఈ వయసుకి ఇద్దరు పిల్లలు పుట్టివుండేవాళ్ళు"

"నీకు చిన్న పిల్లలు కావాలా డాడీ"

"అదేం కాదుగానీ ఆలోచించు. నీ అంతట నువ్వు ఫలానా కుర్రవాడు కావాలంటే నాకెలాంటి అభ్యంతరంలేదు"

"ఆలోచిస్తాను నాన్నా" అంది.

"గుడ్... మంచిపిల్లవి"

అదే సమయంలో భూషణం ఏ.ఎన్‌లు అదే విషయం గురించి చర్చించుకుంటున్నారు.

"ఎందుకు సోదరా! వారికి మా ప్రేమ గురించి చెప్పావ్"

"ఎప్పటికైనా తెలియాల్సిందే కదాని చెప్పాను. మీరు కూడా ఆలోచించండి. ముందు అగ్రజులవారు వివాహమునకు అంగీకరిస్తే మా లైన్ క్లియరౌతుంది"

"చాలా రోజులుగా నిన్ను అడగాలని అనుకున్నా అడగలేకపోయాను. మాకంటే ఎవరూ లేరు. ఉన్నవారు దూరంగా



ఎక్కడో వున్నారు. ఇంక చిన్నా చితక బంధువులుంటే వారిని మేము ఏనాడూ దగ్గరకు చేర్చలేదు. ఎన్ని కష్టములు పడ్డనూ మేమూ వారి సహాయాన్ని ఆశించ లేదు. మీ పరిస్థితి ఏమిటి? మీరు మాకు ఏవిధముగా బంధువులు? మీ వాళ్ళ ఎవరూ లేరా? మీరు కూడా మాలాగా ఒక్కరుగానే జీవించుచున్నారా? "

ఏ.ఎన్ మాట్లాడలేకపోయాడు.

"ఇష్టం లేకపోతే చెప్పవద్దు. అది మీ వ్యక్తిగత విషయం. కాకుంటే వివాహం చేసుకోవాలనే ఆశ పడుతున్నారు. వివాహ మంటే అటు ఆరుతరములు ఇటు ఆరు తరములను చూస్తారంటారు. ఇలా ఏక్ని రంజన్ అంటే పిల్లనిచ్చుటకు భయపడు దురు. అయితే మన పరిస్థితివేరు మనది అగ్రకులం. ఇప్పుడు ఆర్థికముగా మంచి స్థితిలో వున్నాము. కాబట్టి ఎవరైనా ముందుకు రావచ్చు ఏమంటారు? " అన్నాడు భూషణం.

అప్పటికీ ఏ.ఎన్ మాట్లాడలేదు.

"భయ్యా నీ పేరుమీద కూడా నాకు అను మానం వుంది. అది నీ నిజం పేరేనా? "

ఏ.ఎన్ నవ్వాడు.

"అదేంటి సోదరా ఇన్ని రోజుల తర్వాత ఈ అనుమానాలు వస్తున్నాయి"

"వేరే రకంగా అనుకోవద్దు బ్రదర్. మాట వచ్చిందికాబట్టి అడుగుతున్నా. నిజం మాట్లాడితే నువ్వు ఎవరివైనా ఎక్కడనుంచి వచ్చినా నా సోదరుడివి. నీ పెళ్లి నేను చేస్తాను. నా తమ్ముడివంటాను. దానికేం ప్రాబ్లమ్‌లేదు. అసలు చెప్పబాకు సోదరా. నువ్వెవరివయితే ఏమిటి? ఇంతకాలం నీ వాళ్ళ గురించి తలుచుకోలేదు. అందుకని నీకు ఎవరూ లేరనుకుంటున్నా. అంతే. ఆయనన్నట్లు వెంటనే మనం వధువు కావా





లని ప్రకటనే ఇద్దాం" అన్నాడు భూషణం.

"నేను మీ విషయం అడిగితే నాకు పెళ్లి చేస్తానంటారేమిటి? "

"ఇంతకుముందు చెప్పానుకదా! రోజులు నీ దయవల్ల బాగానే గడుస్తున్నాయి. మంచి అమ్మాయిల్ని చూసి నీకూ ఆ సూరి గాడికి పెళ్లిళ్ల చేస్తాను. మీ పిల్లలు నా దగ్గర ఆడుకుంటారు. మీరు నన్ను కాదన రుకదా"

"అట్లాకాదు అగ్రజా. మీకూ ఓ తోడు కావాలి"

"నో.. నో... సింగిల్‌మాన్‌గా నేను జీవిస్తా"

"అంటే మీ వంశం మీతోనే అంతంకా వాలా? మీకు వారసులు అవసరంలేదా? " అన్నాడు.

భూషణం బిగ్గరగా నవ్వాడు.

"రామాపురంలోవున్న భూషణం కాదు నీ ముందుంది. నా గదిలో నేను ఇదే ప్రపంచం అనుకున్నప్పుడు చాలా మొరటు అభిప్రాయాల్తో వున్నాను. ఇప్పుడు ఇంత తిరిగాక, ఇంతమందిని చూస్తున్నాక, డబ్బు ఎలా ఫ్లో అవుతుందో తెలుసుకున్నాక, మీ అంతగా కాకపోయినా మనుషుల్ని అర్థం చేసుకుంటున్నాక చెబుతున్నా...

ఇదంతా చెత్తయ్యా... వంశం.. పరువు, ప్రతిష్ట.. నిలబెట్టడం తరాలకు పాకటం, ఈవెన్ లవ్.. ఇవన్నీ బుడగలా చిట్లిపోయే విలువలే"

ఏ.ఎన్. ఆశ్చర్యంగా చూశాడు.

"ఇన్ని రోజులుగా ఇన్ని భావాలు దాచుకు న్నారుకదూ!"

"లేదు చెప్పుకోలా బయటికి? సందర్భం రావాలి. ఇంకేం కోరికలు లేన ప్పుడు బతుకు ఎందుకంటావా... ఫన్... చూద్దాం... జీవితం మనముందుకు ఇంకెన్ని చిత్రాల్నీ, వాస్తవాల్నీ తెస్తుందో"

"సోదరా... ఇదో గేమ్ అనుకుంటే బాధ

వుండదు. నిజానికి మీ గదిలో మీరు కూర్చున్నప్పుడే మీలో అలాంటి స్థితి వచ్చింది. పక్కవాడి సంపదని, కీర్తిని చూసి టెంప్ట్ కాకపోవటంలోనే మనిషి ఎదుగుతున్నట్లు అర్థం. మీరెన్ని చెప్పినా నా అభిప్రాయం మాత్రం ఒకటే. మీరు పెళ్లి చేసుకోవాలి. మీకంటూ ఓ తోడు కావాలి. అంతే"

"చూడబ్బాయ్! ఈ క్షణం వరకూ నాకు అలాంటి ఆలోచనలేదు. రేపు కలుగుతుందేమో చూద్దాం. మీ అందరూ హాయిగా సంసారాలు చేసుకుంటుంటే నేను కూడా టెంప్ట్ కావచ్చు తిరిగి నా వంశం, వారసులు అనొచ్చు అనకూడదనేం లేదుగా. పార్టీలు మారటం, భావాలు మార్చుకోవటం ఎప్పుడూ వున్నవేగా? "

"థాంక్యూ సోదరా! ఎన్ని రోజులకు ఆ మాత్రం గ్యారంటీనిచ్చావు. మాకు అదే పదివేలు. ఇంక మనం చలో లండన్"

"అంటే ఇండియన్ అమ్మాయిని నువ్వు పెళ్లి చేసుకోవా? "

"ఏమో మనల్ని ఎవరు చేసుకుంటారో మనకేం తెలుసు"

భూషణం బిగ్గరగా నవ్వాడు.

"తమ్ముడూ నువ్వు చాలా గడుసువాడివి. నన్ను కమిట్ చేయించావ్ గానీ నీ గురించి ఒక్క రహస్యం రాబట్టలేకపోయాను"

"అలా అనకు బ్రదర్. నీముందు నన్ను నేను విశ్లేషించుకునే రోజు ముందుంది"

"అది సరే నేను కేథరిన్‌తో ఓసారి మాట్లాడాలనుకుంటున్నాను"

"ఈ రాత్రికే మాట్లాడుదువుగాని సోదరా" అన్నాడు ఏ.ఎన్.

★ ★ ★

"హలో కేథరిన్ నేను భూషణాన్ని మాట్లాడుతున్నా..."

"హాయ్ ఎలా వున్నారు? "

"నైస్ నువ్వెలా వున్నావ్? "

"హాపీగా వున్నాను"

"నిన్నో విషయం అడగాలనుకుంటున్నాను"

"అడగండి.. అందులో సందేహం ఎందుకు? "

"నా తమ్ముడిగురించి నీ అభిప్రాయం ఏమిటి? "

"హి ఈజ్ ఎ నైస్ గై" అంది నవ్వుతూ.

"అతనంటే నీకు ఇష్టమేనా? "

"మీరంటే కూడా బోల్డంత ఇష్టం"

"థాంక్యూ కేథరిన్. డైరెక్ట్‌గా అడుగుతున్నాను. నువ్వు అతన్ని ప్రేమించగలవా? ఐమీన్ అతన్తో జీవితం పంచుకుంటావా? "

అవతల నిశ్శబ్దం.

"కేథరిన్ ఏమిటి మాట్లాడవు. హర్టయ్యావా? "

"దేనికి సార్ హర్ట్ కావటం? "

"అదే మా తమ్ముడ్ని లవ్ చేయగలవా అని అడిగానుకదా అందుకు కోపం వచ్చిందేమోనని"

"నేను ఆలోచిస్తున్నది మా డాడీ గురించి. ఆయన కూడా ఫోన్ చేసి పెళ్లెప్పుడు చేసుకుంటావ్ అన్నారు. నన్ను చేసుకోనివ్వరా అన్నాను. ఇప్పుడు మీరేమో ఏ.ఎన్‌ని లవ్ చెయ్యగలవా అంటున్నారు. నేను కన్‌ఫ్యూజ్ అవుతున్నా"

"ఎందుకు? "

"మీరందరూ గుర్తు చేసేదాకా ఈ విషయాలు నాకు తెలియలేదు కదా! ఇంతకూ నేను ఆడపిల్లనేనా అని"

భూషణం బిగ్గరగా నవ్వాడు.

"నువ్వు మంచి జోక్స్ వేస్తావ్. సరే

ఏమాత్రం అవకాశం వున్నా మా తమ్ముడ్ని లవ్ చేస్తే బాగుంటుంది. నాకో పని అయి పోతుంది"

"అంటే ఆయన ఎవర్నీ లవ్ చెయ్యరా?"

"చేస్తే నేను పూనుకోవటం ఎందుకు?"

కేథరిన్ మృదువుగా నవ్విన సవ్వడి.

"ఓకే కేథరిన్.. గుడ్‌నైట్.. ఇంకోసారి చెబుతున్నా తమ్ముడెంతో నువ్వూ అంతే. అందుకే అడిగాను. ఇందులో ఎలాంటి ఫోర్స్, రికమండేషన్స్ లేవు. లవ్ వీటిన్నింటికీ అతీతమైంది కాబట్టి ఆలోచించు. మనందరం మంచి స్నేహితులుగానే వుందాం" అన్నాడు భూషణం.

"థాంక్యూసర్, గుడ్‌నైట్" అంది కేథరిన్.

ఫోన్ పెట్టేశాక ఆలోచనల్లోపడింది. ఇంతకూ ఏ.ఎన్‌పట్ల తన అభిప్రాయం ఏమిటి? ఇంతవరకూ కేవలం బిజినెస్ మాన్‌గానే తెలుసు. అలానే చూసింది. అతన్ని జీవితంలోకి ఆహ్వానించటానికి అభ్యంతరాలేమైనా వున్నాయా? అనుకుంది.

తమకి కులం లేదు. దేశంలేదు. వీటన్నింటినీ ఎప్పుడో అధిగమించారు. సో అలాంటి అభ్యంతరం లేదు. భావాలు ఆధునికమేనా? ఆధునికమే!

తెలివి తేటలు కలవాడేనా? కలవాడే!

అందగాడా? అందవిహీనుడు మాత్రం కాదు.

ఇంకేమిటి ప్రాబ్లమ్.. లాంగ్వేజ్ ప్రాబ్లమ్ లేదు. కల్చర్ ప్రాబ్లమ్ లేదు. కొన్ని అలవాట్లు మారొచ్చు. ఫుడ్ విషయంలో తేడాలుండవచ్చు ఇవన్నీ అధిగమించలేనివేం కావు. కాకపోతే ఉన్న సమస్య ఒకటే..





ఏ.ఎన్‌కి తనంటే ఇష్టమా? కాదా?

ఇదే సమస్య. అసలు సమస్య. ముందు అది తెల్చుకోవాలి. అంటే డాడీని కన్సల్ట్ చెయ్యాలి. వెంటనే ఫోన్ అందుకుంది.

"డాడీ.. నేను"

"ఏమిటి విషయం. చాలా ఆనందంగా వున్నట్లున్నావ్"

"భూషణం సార్ ఫోన్ చేశారు. ఆయనే మంటున్నారంటే నా తమ్ముడ్ని లవ్ చెయ్యగలవా అని"

"నువ్వేం చెప్పావ్?"

"అందుకే మీతో మాట్లాడుతున్నది. నేను లవ్ చేస్తే సరిపోతుందా?"

"లవ్ చెయ్యాలికదా?"

"చేశాననుకోండి. చాలదు కదా?"

"ఎందుకు చాలదు. అదే సరిపోతుంది"

"అలాకాదు డాడీ... ఏ.ఎన్ నన్ను లవ్ చెయ్యాలికదా"

"అవునవును. అందుకే మీరు భూషణం సార్‌తో మాట్లాడండి"

"ఏం మాట్లాడమంటావ్?"

"వాళ్ల బ్రదర్‌కి ఇష్టమా? లేదా? అడగండి"

"నాకు ఇష్టం లేదనుకో"

"అవునుకదా! సారీ డాడీ ఇందాక లిస్ట్‌లో నీ పేరు రాసుకోలేదు. నువ్వు కాదనవని అనుకున్నాను"

"చూడు కేథీ.. నీ లైకింగే నా లైకింగ్. నేను వెంటనే ఏ.ఎన్‌ని కనుక్కుంటాను. బహుశా రేపు ఉదయం నీతో మాట్లాడతాను"

"ఎర్లీమార్నింగ్... వెన్‌ది సన్‌రైజ్" అంటూ ఏదో అనబోతుంటే...

"స్వీట్ డ్రీమ్స్ బేబీ" అంటూ ఫోన్ పెట్టేశాడు.

ఇప్పటికిప్పుడు భూషణంతో మాట్లాడాలా

లేక డైరెక్ట్‌గా ఏ.ఎన్‌తోనా అని కొంచెంసేపు ఆలోచించాడు.

ఫోన్ రింగవుతుంటే భూషణం లేచాడు.

"భూషణం స్పీకింగ్"

"షాని మాట్లాడుతున్నా"

"చెప్పండి సార్. కేథరిన్‌తో మాట్లాడాను"

"నీ బ్రదర్‌తో మాట్లాడారా? "

"లేదు"

"ముందు చేయాల్సింది ఆ పనికదా..."

"అవుననుకోండి"

"అలాగయితే ఓ పని చేయండి. ఏ.ఎన్. ఉన్నాడా? "

"బయటికి వెళ్లాడు. అరగంట తర్వాత వస్తాడు"

"అయితే మీరు నిద్రపోకుండా వెయిట్ చెయ్యగలరా? "

"తప్పకుండా? "

"రాగానే అతని అభిప్రాయం తెలుసుకోండి. అతను సరేనంటే చేయాల్సిన పని ఒకటుంది. మర్చిపోకుండా చెయ్యాలి"

"చెప్పండి..."

"ఎర్లీ మార్నింగ్ కేథరిన్‌కి ఫోన్‌చేసి ఈ మాటలు చెప్పమనండి. ఐ లవ్ యు"

ఫోన్ డిస్కనక్ట్ అయింది. నిద్ర ముంచుకొస్తోంది. అంటే అప్పుడే కేథరిన్ తన డాడీతో మాట్లాడింది. ఆమెకి బ్రదరంటే ఇష్టమే. ఇంతకీ ఏ.ఎన్ ఏమంటాడో... ఇంకెవరినైనా ప్రేమించానంటాడా? కేథరిన్ తనకు ఇష్టం లేదంటాడా? కులం గురించి గానీ, దేశం గురించిగానీ మాట్లాడతాడా? ముందు ఇటునుండి ఏమీ కనుక్కోకుండా తొందరపడి కేథరిన్‌కి ఫోన్ చేయటం తప్పు...

ఇప్పుడితను కాదంటే వాళ్లు ఏమీ అనక పోవచ్చు గానీ, రిలేషన్స్ దెబ్బ తింటాయేమో! అఖిల తిరస్కారాన్ని తనింతవరకూ భరించలేక పోతున్నాడు. అలాంటిది ఇప్పుడెలా?

క్షణాలు యుగాల్లా గడుస్తున్నాయి. నిద్ర ఎగిరిపోయింది. పది... ఇరవై... ముప్పై... గంట... రాడే... ఏమైపోయాడు. భయంకలిగింది. కనీసం ఫోన్ చేసేవాడు. ఏమైనా జరిగిందా? అసలు నువ్వు ఎవరు అనడగటంతో బాధపడ్డాడా? ఇన్ని రోజులు ఏమీ అడక్కుండా ఇప్పుడు అడగటం ఏమిటి?

నాలుకమీద శని వుండటం అంటే ఇదేనేమో. ఇంక కనిపించడా? ఇదంతా కలేనా? నిన్నటి భోషాణం, నేటి ఏ.ఎన్. ఇదంతా కలేనా? మరో అరగంట... ఇంక కదిలిస్తే ఏడ్చేసేలా వున్నాడు. మంచంమీద పడుకోవాలనిపించలేదు. లేచి బయటికి వెళ్లాలి. ఏదోకటి చేయాలనుకున్నాడు.

మంచం దిగాడు. అప్పుడు వినిపించింది కాలింగ్ బెల్. వెళ్లి తలుపు తీశాడు. ఎదురుగా అతనే.

"ఎక్కడికి పోయావ్. కనీసం ఫోనయినా చేసి చెప్పలేవా? నేను ఎంత టెన్షన్‌తో ఛస్తున్నానో తెలుసా? "

ఏ.ఎన్. ఆశ్చర్యపోయాడు.

"టెంక్షన్ ఎందుకు సోదరా? "

"ఏమో... నీకేమైనా అయిందేమోనని... నామీద కోపం వచ్చిందేమోనని... లక్ష ఆలోచనలు"

"సారీ భయ్యా... నిద్రపోయుంటావ్. డిస్టబ్ చేయటం ఎందుకనుకున్నా. ప్లీజ్..." అన్నాడు.

భూషణం నీళ్లతో ముఖం కడుక్కుని వచ్చాడు.

ఎలా ఆరంభించాలా అని కొంచెంసేపు ఆలోచించాడు.



"అలా కూర్చో" అన్నాడు. ఏ.ఎన్. కూర్చు న్నాడు.

"నీకు చెప్పకుండా తొందరపడ్డానయ్యా... నువ్వేమనుకోవుగా"

"ఏ విషయం గురించి మాట్లాడుతున్నారో నాకు అర్థం కావటంలేదు"

తలవంచుకొని గబగబా చెప్పాడు.

"కేథరిన్‌తో మాట్లాడా. నా బ్రదర్‌ని లవ్ చెయ్యగలవా అని. ఆ అమ్మాయి షాకి ఫోన్‌చేసి చెప్పిందనుకుంటా. షా ఇప్పుడే ఫోన్‌చేసి చెప్పాడు. రేపు ఉదయం నువ్వు కేథరిన్‌కి ఫోన్‌చేసి చెప్పాలి"

"ఏం చెప్పాలి"

"సూర్యోదయంలోపే. లేస్తూనే నీ మాటలు వినాలి"

"ఏమని సోదరా"

"ఐ లవ్ యూ అని"

ఏ.ఎన్. ఆశ్చర్యంగా చూశాడు భూషణం వంక.

"ముందే చెప్పాను. నాకు ఆ అమ్మాయి సరేనంటుందా లేదా అనే ఆలోచన తప్పించి నీకు ఇష్టమా కాదా అనే ఆలోచన రాలేదు. నీ ప్రేమ గురించి చెప్పలేదు కాబట్టి ఎవరినీ ప్రేమించి వుండవనుకున్నాను. ఇలా చేయటం తప్పే. నా పరువు కోసం నువ్వు ఆలోచించవద్దు. నీకిష్టం లేకపోతే రేపు ఉదయం ఫోన్ చేయాల్సిన అవసరంలేదు. నేను షాతో మాట్లాడతాను. దీనికంతటికీ కారణం నేను. క్షమించమని..."

ఏ.ఎన్. భూషణాన్నే చూస్తున్నాడు.

"ఇంక నాకు నిద్రొస్తోంది. నేను పడుకుంటాను" అని దుప్పటి తీసుకొని ముఖం కనిపించకుండా కప్పేసుకున్నాడు. ఏ.ఎన్. లేచి తాపీగా డ్రెస్ ఛేంజ్ చేసుకున్నాడు. ముఖం కడుక్కుని వచ్చి మంచంమీద వాలిపోయాడు.





అప్పటికే భూషణం గురక పెడుతున్నాడు.

నవ్వొచ్చింది ఏ.ఎన్.కి.

అతను ఆ రాత్రి చాలాసేపు ఆలోచిస్తూ కూర్చున్నాడు.



ఉషోదయం...

"సూర్యుడి తొలికిరణాలు నేలను తాకుతున్న క్షణాలు.. పక్షులు నిద్రలేచి కబుర్లలో పడిన సమయం... నిద్రలో ఓ పక్కకు దొర్లింది కేథరిన్... ఎవరో చెవిలో చెబుతున్నారు గుసగుసగా.

"ఇంకా కలలేనా రాజకుమారీ... నీ కోసం సందేశం రాబోతోంది. లే... నిద్రనుండి మేలుకో"

మరోసారి బద్ధకంగా కదిలింది...

తిరిగి ఎవరో చెవుల దగ్గరకు చేరి అతిమెల్లగా చెబుతున్నారు.

"నీ కోసం సందేశం రాబోతోంది"

చటుక్కున కళ్లు తెరిచింది. ఫోన్ కనిపించింది. చెవులు రిక్కించింది. మౌనంగానే వుంది. దుప్పటి విసిరేసి లేచి కిటికీ దగ్గర కొచ్చింది... ఓ పువ్వు నవ్వింది.

ఏదో శబ్దతరంగం... ఫోన్ మోగింది. వెళ్ళి తీసింది...

"ఐ లవ్ యు కేథరిన్"

ఫోన్ డిస్కనెక్ట్ అయింది. ఒక్క క్షణం ఏం విందో అర్థం కాలేదు. ఆ కంఠస్వరంలో ఏదో భావోద్వేగం. గొంతు ఎవరిదో అర్థం కాలేదు. గుసగుసగా చెప్పినట్లు. ఎవరు? ఎందుకిలా చేయటం? డాడీ అలా చెప్పరు. చెప్పినా కట్ చేయరు. భూషణమా? కాదు. బుగ్గలు ఎరుపెక్కుతుండగా అనుకొంది... అతనేనా!

ఫోన్ రింగయింది... తీసింది. కొద్ది క్షణాల నిశ్శబ్దం... ఫోన్ కట్ అయింది. "కేథరిన్ మీరేనా? "

"అవును. మీరు..."

"ఏ.ఎన్... ఐ లవ్ యూ కేథరిన్... ఈ రెండు ముక్కలు నీ నోటినుండి వింటే బాగుంటుందనుకుంటాను"

కేథరిన్ చిరునవ్వుతో ఫోన్‌ని ముద్దు పెట్టుకుంది. ఫోన్ డిస్కనెక్ట్ చేసింది.

"చెప్పేశావా" అంటున్నాడు భూషణం.

ఏ.ఎన్. మరో లోకంలో వున్నాడు.

అప్పుడు మోగింది ఫోన్... భూషణం అందుకున్నాడు.

"థాంక్యూ కేథరిన్... త్వరలో కలుసుకుంటున్నాం"

ఈసారి కేథరిన్ షాకయి, సిగ్గుపడింది అంతలోనే... గురకలు పెట్టి నిద్రపోతున్న షా గదిలో రెండు ఫోన్లు ఒక్కసారి మోగాయి.

"వెరీగుడ్ మార్నింగ్ డాడీ" కేథరిన్ గొంతు సెల్‌లో.

"షాజీ... ప్రేమకి పేటెంట్ తీసుకున్నారు పిల్లలు"

రెండు ఫోన్లూ అంతలోనే మూగబోయాయి.

★ ★ ★

"అదిరిపోయే న్యూస్ చెప్పారు సార్. ఇంక మీ పెళ్లికి చూడండి. ఇంతకుముందెప్పుడూ జరగనివిధంగా చేయాలి. వచ్చిన వారందరికీ వందరకాల వంటలు చేయాలి. పాటలు పాడించాలి. డాన్స్‌లు చేయించాలి" ఉత్సాహంగా చెప్పుకుపోతున్నాడు సూరి.

కేథరిన్ వచ్చేసింది. షా, భూషణం, ఏ.ఎన్.లు కూర్చున్నారు. ఏ.ఎన్. మాట్లాడాడు.

"సర్. ఇది నా అభిప్రాయం మాత్రమే. మీరు ఏం చెబితే అలా చేద్దాం. మనం అనేక కార్యక్రమాలు లావిష్‌గా చేశాం. అలా చేయటం అవసరం. అది బిజినెస్‌లో భాగం. ఇది మాత్రం ఎంత సింపుల్‌గా జరిగితే అంత మంచిది. ఎందుకంటే ఇది మా ఇద్దరికి చెందిన విషయం. కేథరిన్‌కి గ్రాండ్‌గా చేసుకోవాలనుకుంటే నాకు అభ్యంతరం లేదు. అలాగే మై బిలవ్‌డ్ బ్రదర్... గౌరవనీయులైన షాగారూ. మీరు కూడా మాకు చెందినవారు. మీకూ కొన్ని ఆశలుంటాయి. ఎలా చేయమంటే అలా చేద్దాం"

షా చిరునవ్వుతో కూతుర్ని చూశారు.

"హీ హిజ్ రైట్ డాడ్... తర్వాత మీ ఇష్టం"

షా భుజాలు ఎగరేశాడు. "ఎలా చేసుకున్నా ఇది పెళ్లే. మీరిద్దరూ కలిసి జీవించటం ప్రధానం గానీ మిగతా విషయాలు నా దృష్టిలో లీస్ట్ ఇంపార్టెన్స్ కలవి..."

"కనీసం హనీమూన్‌కైనా వెళ్తారా? "

అన్నాడు భూషణం.

"నేను మాత్రం అంగీకరించటంలేదు" అన్నాడు సూరి.

"నీ పెళ్లికి ఆకాశమంత పందిరివేద్దాం. నువ్వే. వెయ్యిరకాల వంటలు చేసి స్వయంగా వడ్డిద్దువుగాని" అన్నాడు భూషణం.

"అయ్యా మీకు చెప్పటానికి సిగ్గుపడ్డాను"

"ఏంటి ఎవరినన్నా లవ్ చేశావా? "

"కాదండి. మా బావమరిదిగాడు వచ్చాడు. మా ఆవిడ కబురు చేసింది.

నేను రమ్మంటే వచ్చేస్తానందండి"

"నువ్వేమన్నావ్? "

"మీ అందరికీ చెప్పకుండా నేనేమంటా నండి. అదే చెప్పి టిఫిన్ పెట్టించి పంపిం చానండి"

"నీకు ఇష్టమైతే తెచ్చుకో"

"తెచ్చేసుకుంటానండి. ఇంక భూషణం గారు..." అంటుండగా ఏ.ఎన్. సైగ చేశాడు.

"మీరెల్లమంటే నేను మనూరెళ్లి అందర్నీ చూసొస్తానండి. వచ్చేటప్పుడు మా ఇంటి దాన్ని తీసుకొస్తానండి" అన్నాడు.

"అలానే... నువ్వు కూడా హనీమూన్‌కి వెళ్ళిరా... ఇంక అందరం లండన్ వెళ్ళిపో వాలి" అన్నాడు ఏ.ఎన్. అందరూ నవ్వారు.

★ ★ ★

హనీమూన్ ట్రిప్‌లో కేథరిన్ అడిగింది.

"భూషణం లవ్‌స్టోరీ చెప్పండి"

ఏ.ఎన్. జరిగిందంతా చెప్పుకొచ్చాడు. అంతా విన్నాక కేథరిన్ "సో... ఆమె లండ న్‌లోనే వున్నారా? "

"ఉండి వుంటారు. ఆమెను చూస్తే భూష ణంలో ఛేంజ్ వస్తుందనినేననుకుంటున్నా"

"ఆమె గురించి ఎంక్వయిరీ చేశారా? "

"లేదు"

"చేస్తే బాగుండేదేమో"

"భూషణం మాటల్ని బట్టి అతనికి ఇష్టం లేదు. ఆ అమ్మాయి భూషణాన్ని తిరస్క రించటం వెనక చాలా కారణాలున్నాయి. ముఖ్యంగా వారి ఆర్థిక పరిస్థితి. వారి వంశం అరాచకంవల్ల కొలాప్సయింది. అత నిలో ఏ ప్రత్యేకతా లేదని ఆమె అభి ప్రాయం. బహుశా ఇప్పటికీ అలాంటి అభి ప్రాయంలోనే వుంటుంది. అందుకే ఆ అమ్మాయి తనంతట తను భూషణాన్ని చూడటానికి రావాలి"

"అలా రావాలంటే డబ్బు చాలదా? "

"డబ్బుకేం కొరత. బోల్డంత వుంది"

"మరింకేమిటి? ఏం కావాలి? "

"హోదా... రాచరికం... ఇప్పుడవన్నీ పోయాయికదా... ఎక్కడనుంచి తేవటం? " అన్నాడు.

అప్పుడు నవ్వింది కేథరిన్.

"ఎందుకు నవ్వుతున్నావ్ కేథీ"

"మిస్టర్ 'ఏ', ఆ దేశంలో ప్రతిదాన్నీ అమ్ముతారు"

"అట్లయితే మనం భూషణం చిరకాలకోరి కను తీర్చే ప్రయత్నం చేద్దాం" అన్నాడు ఏ.ఎన్.

★ ★ ★

లండన్‌లో గ్రాండ్‌గా 'హోటల్' ప్రారం భించారు. దానికో అందమైన పేరు తగిలిం చారు. డిజైనింగ్‌లో రామ్ గారి శైలినే కొద్ది పాటి మార్పులతో చేశారు. అక్కడి ప్రము ఖుల్ని ఆహ్వానించారు.

అందులోని ప్రధాన ఐటమ్ పులిహోర. అది అక్కడివారిని విశేషంగా ఆకట్టుకుంది. వారి రుచులకు తగ్గ చిన్న చిన్న మార్పులు చేశారు. ప్రారంభానికి ముందే ఎలక్షన్ సర్వేలాగా కొంతమందిని ఎన్నుకున్నారు. అన్ని వయసులవారూ, అన్నిరకాల ఆదా యాలవారూ అందులో వున్నారు. వారంద రికీ రకరకాల వంటకాలు రుచి చూపించి అభిప్రాయాలు చెప్పమన్నారు. వాటన్నిం టినీ కంప్యూటర్‌కి ఫీడ్ చేశారు. ఉప్పు ఎంత వుండాలో, పులుపు ఎంత వుండాలో ఓ అవగాహన కొచ్చారు. అలాగే పచ్చిపులు సుకేదో మంచి పేరుపెట్టి 'దిసీజ్ ఇండి యన్స్ ఫేవరేట్ డిష్" అన్నారు. లొట్టలేసు కుంటూ తిన్నారు.





చూస్తుండగానే విపరీతమైన ప్రచారం వచ్చింది.

భూషణం రెస్టారెంట్‌లో కూర్చునేవాడు. అతనుకూడా వారికో ఆకర్షణ అయ్యాడు. ఇదంతా లైన్లో పడ్డాక కేథరిన్ ఓరోజు చెప్పింది.

"రేపు ఉదయం మనం ఓ చోటుకి వెళ్తున్నాం"

"మనం అంటే..."

మీరూ, నేనూ, భూషణంసర్"

"ఎందుకు? "

"చూస్తారుగా" అంది.

ఉదయం లేచాక కారులో ముగ్గురూ బయలుదేరారు. అదో పెద్ద ఆక్షన్‌హాల్‌లా కనిపించింది. కొంతమంది వ్యక్తులు కనిపించారు. కేథరిన్ అంతకుముందే ఆ ఫార్మాలిటీస్‌ని పూర్తి చేయించింది.

"ఏమిటిది? " అనడిగాడు భూషణం.

కేథరిన్ ఎవరితోనో మాట్లాడడానికి వెళ్ళింది.

నాకూ తెలియదు. కేథరిన్ డీటైల్స్ చెప్ప లేదు.

అయిదు నిముషాల తర్వాత తిరిగి వచ్చింది కేథరిన్.

"ఇంకా సస్పెన్సా? " అన్నాడు ఏ.ఎన్.

కేథరిన్ నవ్వింది. భూషణం కేసి చూస్తూ చెప్పింది.

"భూషణం సార్ 'లార్డ్' అవుతున్నారు"

"లార్డా'? ఎలా? "

"ఇక్కడ లార్డ్ షిప్స్ వేలం వేస్తారు. వాటిని కొనుక్కున్న వారు ఆ ప్రాంతపు 'లార్డ్'గా గుర్తించబడతారు.

దానివలన ఉపయోగం ఏమిటి? ఆ ప్రాంతంమీద ఏమైనా హక్కులుంటాయా? '

"అలాంటివేం వుండవు. భూషణం గారి పేరుముందో, వెనుకో అలాంటివి తగిలించుకోవచ్చు"

"అంటే ఇండియాలో బిరుదులు ఇచ్చినట్లు... లేదా ఇప్పించుకున్నట్లా... యూనివర్సిటీలనుండి డిగ్రీలు తెచ్చుకున్నట్లు. ఐ మీన్ డాక్టర్ డిగ్రీలు... అలాంటివేనా? "

అక్కడి పరిస్థితి నాకు తెలియదు. ఇక్కడ మాత్రం వీటికి విలువ ఇస్తారు. మనం ఎన్ని లార్డ్ షిప్స్ కొందాం.

"ఎన్నయినా కొనుక్కోవచ్చా? "

"ఆహా! నీ దగ్గర డబ్బుంటే కొనుక్కోవచ్చు 'లార్డ్' కావటానికి పుట్టుకతో పని లేదు. ఈ దేశపు పౌరసత్వం వున్నవారు ఎవరైనా అర్హులే" బ్యాంక్‌లో డబ్బులుంటే చూసుకుని కొందరు ఆనందపడతారు. ఇంకొందరు స్థలాలు కొంటారు. అలాగే కొంతమంది లార్డ్‌షిప్‌లు కొంటారు. సో... మన భూషణం గారికి కనీసం రెండు టైటిల్స్ కొందాం"

"ఏం అగ్రజా... మీరు లార్డ్ కాబోతున్నారు..."

"అవును సర్. డబ్బులు లేకపోతే క్రెడిట్ కార్డులైనా అంగీకరిస్తారు."

"చెప్పేదేముంది. నేను..."

"అర్థమైంది అగ్రజా... కేథీ... రెండు టైటిల్స్"

"రెండు నిముషాల్లో భూషణం సర్ లార్డ్ అవుతారు" అంది.

"లార్డ్ ఖలీద్ షరీఫ్... నైట్, గ్రాండ్‌ప్రియర్ టెంపరల్ ఆర్డర్, షరీఫ్ ఆఫ్ కేమ్‌స్టర్... ఇలా వుంటాయి. మీరు చూస్తుండండి. నేను టైటిల్స్‌తో వస్తాను" అని వెళ్ళింది.

ఆమె అన్నట్టుగా జస్ట్ రెండు నిము

షాలు.. భూషణం 'లార్డ్' అయ్యాడు.

"ఈ దేశం దేన్నయినా అమ్ముతుంద"న్న కేథరిన్ మాటలు గుర్తొచ్చాయి ఏ.ఎన్.కి.

★ ★ ★

భూషణం జీవితంలో మరో అధ్యాయం మొదలైంది.

తను ఫుడ్ సెంటర్‌కి వచ్చే తీరికలేకుండా పోయింది.

ముందుగా 'మేయర్ గెస్ట్'గా ఆహ్వానించబడ్డాడు. చాలా గొప్ప స్వాగతం లభించింది. మీరు మా ఆతిధ్యం స్వీకరించటం మా అదృష్టం అన్నాడు మేయర్. భూషణం తన సహజ గంభీరశైలిలో తల వూపాడు. అక్కడికి వచ్చిన వారందరూ తనని తాను పరిచయం చేసుకోవటానికి పోటీలు పడ్డారు. పత్రికలు ప్రముఖంగా ఈ వార్తను కవర్ చేశాయి. టీ.వీల్లో ప్రసారం అయింది.

లార్డ్ 'భూషణం'గారికి సెక్రటరీలు అవసరం అయ్యారు.

అందులో ఒకతను స్పీచ్ రైటర్. ఆయా ఫంక్షన్స్ స్వభావాన్ని బట్టి ఉపన్యాసం తయారుచేస్తాడు. ముందుగా రిహార్సల్స్ చేస్తాడు. ఆ తర్వాత గొప్పగా నటిస్తాడు. చప్పట్లు మోగుతాయి.

స్టార్ హాస్పటల్స్‌ని భూషణం విజిట్‌చేస్తున్నారు. అక్కడి రోగుల్ని పలకరిస్తున్నారు. సదుపాయాలగురించి అడిగి తెలుసుకుంటున్నారు. రెడ్‌క్రాస్ సంస్థలకి వేదికల విరాళాలు ప్రకటిస్తున్నారు.

రోజూ ఉత్తరాలు వస్తుంటాయి

"సర్ మీగురించి, మీ టైటిల్స్ గురించి పత్రికల్లో చదివి ఆనందిస్తున్నాం. మీలాంటి ప్రముఖుల పరిచయాల కోసం మేం ఎదురుచూస్తున్నాం. దయచేసి మీరు టైటిల్స్ కొనవద్దు. మేం మీకు మీ వ్యక్తిత్వానికి సరిపోయేవిధంగా గొప్ప టైటిల్స్ ఇవ్వటానికి తయారుగా వున్నాం. మీరు చేయవలసిందల్లా దయతో వాటిని ఆమోదించటమే"

లార్డ్ భూషణంపేరు 'హూ ఈజ్ హూ' అనే పుస్తకంలో ప్రచురించారు.

'లంచ్ క్లబ్స్' లోకి ఆహ్వానిస్తున్నారు. ముందుగా భూషణం తినటం ఆరంభించాక మిగతా వారందరూ మొదలుపెడతారు. పెళ్ళిళ్ళకీ, పుట్టినరోజులకీ, పార్టీలకూ ఆయనకు ఆహ్వానం అందుతుంది. ఆయనలేని సభ బోసిపోతుంది.

"హలో యువర్ లార్డ్‌షిప్" అని సంబోధిస్తారు.

"అయ్యగారూ... మా దగ్గరకూడా 'లంచ్' చేయవచ్చుండి" అంటారు సూరిబాబు దంపతులు.

"బొత్తిగా తీరటం లేదయ్యా...చూద్దాంలే"

ఎవరైనా భూషణానికి ఏదైనా చెప్పాలనుకుంటే, అర్జీలు పెట్టుకుంటే సెక్రటరీలు వినయంగా చెబుతారు.

"లార్డ్ ఆఫ్ హార్ పోర్‌విల్ రిసీవ్ యువర్ మెసేజ్.."

ఓరోజు ఓ ప్రముఖ పబ్లిషర్ వచ్చాడు. అతనికి అపాయింట్‌మెంట్ ఇచ్చినరోజున వచ్చి కలిశాడు.

"చెప్పండి"అన్నాడు.

"మీ జీవితగాథను నేనుపుస్తకంగా ప్రచురించాలనుకుంటున్నాను" అన్నాడు.

"కానీ నేను రచయితనుకాను" అన్నాడు భూషణం.

"రచయిత కానవసరంలేదు. కావాలంటే రచయితలను మేమే ఎరేంజ్ చేయగలం.




లేదా మీరు ఎవరినైనా ఏర్పాటు చేసుకున్నా మంచిదే. మాకు మాత్రం మీ జీవితం గురించిన పుస్తకం కావాలి. మీరు డిక్టేట్ చేయవచ్చు లేదా పూర్తిగా ఆ రైటర్‌కి ఇలా వుంటే బాగుంటుందని చెప్పి పూర్తి బాధ్యత వదిలేయవచ్చు"

"ఎలా బాగుంటుందో నేను చెబితే పుస్తకాలు అమ్ముడుపోతాయా? "

"ఆ విషయంలో మేం పూర్తిశ్రద్ధ తీసుకుంటాం. పబ్లిసిటీ ఇస్తాం. కాకపోతే మా బుక్ సేల్స్ బాగుండాలంటే సెన్సేషనల్‌గా వుండాలి"

"అంటే నిజాలు చెప్పాలా? "

"అది మా ఇష్టం. మాకు కావలసింది సెన్సేషన్. అది నిజాలద్వారా వస్తుందనుకుంటే సరే. లేదా అబద్ధాల ద్వారా వస్తుందంటే అంతకంటే మంచిది"

"అబద్ధాలు రాయటంవలన కోర్టు ఇబ్బందులు రావా? "

"రావచ్చు రావాలి. సాధారణంగా జ్యూరిస్‌డిక్షన్ పరిధిని మనమే నిర్ణయిస్తాం కాబట్టి ఇబ్బందిలేదు. మీకు ట్రేడ్ సీక్రెట్ చెబుతున్నాను. మన పుస్తకంలో వచ్చే సెన్సేషనల్ ఎపిసోడ్స్‌ని ముందే లీక్ చేస్తాం. దాంతో సంచలనం కలుగుతుంది. ఈ పుస్తకాన్ని విడుదల కాకుండా చూడాలనుకుంటారు. కోర్టు ఇంజక్షన్ ఆర్డర్ తెస్తారు. లేదా అదీ మన పబ్లిసిటీ అవుతుంది. ఆ తర్వాత రిలీజ్ అయితే హాట్ కేక్స్‌లా అమ్ముడుపోతాయి"

"ఇంత చరిత్ర వుందా? "

"అవును. మీకు ఎట్రాక్టివ్ అడ్వాన్స్ ఇస్తాం. రాయల్టీ ఇస్తాం. బెస్ట్ సెల్లర్స్ లిస్ట్‌లో వుండేందుకు ప్రయత్నంచేస్తాం. సో... మీరు ముందుగా మాకు పుస్తకం రాయటానికి అంగీకరిస్తే మిగతా ఏర్పాట్లను నేను చూస్తాను" అన్నాడు పబ్లిషర్.

భూషణం ఆలోచించాడు కొంతసేపు.

"నా నిర్ణయం తర్వాత చెప్పొచ్చుగదా" అన్నాడు.

"మీ ఇష్టం మీ ఆటోబయోగ్రఫీ రాయాలనుకుంటే ఆ అవకాశం కేవలం మాకు మాత్రమే ఇవ్వాలి. ఇంతకంటే మేం మిమ్మల్ని ఇంకేం కోరం"

"ఇట్సాల్ రైట్... త్వరలోనే మీకు ఈ విషయం గురించి మా నిర్ణయం తెలియచేస్తాం" అన్నాడు.

ఈ విషయం మొత్తం ఏ.ఎన్.కి చెప్పాడు.

"సోదరా, నువ్వు ఒక్కపని చెయ్యవు. రోజుకొకడు వచ్చి బాదేస్తున్నాడు. మనకి అన్నిరంగాల లొసుగులు తెలిసిపోతున్నాయి. నా జీవిత చరిత్రని రాయమని తల తిని వెళ్లాడో పబ్లిషర్"

"రాసేయ్ బ్రదర్"

"ఏంటి రాసేది. అది చాలా సెన్సేషన్ కలిగించాలంట. కావాలంటే రైటర్‌ని ఎరేంజ్ చేయగలనన్నాడు"

"ఇంకేమిటి బాధ. నోరు తెరచి మాట్లాడండి. వాళ్లే సెన్సేషన్‌ని క్రియేట్‌చేస్తారు" అన్నాడు ఏ.ఎన్.

"నాకెందుకో రామాపురం వెళ్లిపోవాలనిపిస్తోంది" అన్నాడు భూషణం దిగులుగా.

"అప్పుడేనా? ఏమైంది? "

"నా జీవితం నాదికాకుండా పోయిందిగా సోదరా..."

"ఇప్పుడక్కడ ఏమీలేదు సోదరా. 'షా'జీ ఆ ఇంటిని మొత్తం కూలగొట్టించేశాడు. మీ ప్రాణనేస్తం భోషాణం ఎక్కడెక్కడో తిరుగుతోంది. ఇంక మీదంటూ అక్కడేం లేదు"

భూషణం తల వంచుకున్నాడు.

"అగ్రజా... ఇప్పటికైనా పోయిందేంలేదు. మీకు కావలసింది తోడు. ఎవరో ఒకర్ని చూసి మీ అర్ధాంగిగా చేసుకోండి. అప్పుడింత నిరాశ కలగదు" అన్నాడు ఏ.ఎన్.

భూషణం తల దించుకునే వున్నాడు.

★ ★ ★

అద్భుతమైన పార్టీ జరుగుతోంది.

భూషణం మామూలుగానే ప్రత్యేక అతిథిగా ఆహ్వానించబడ్డాడు. ఎవరెవరో వచ్చి పరిచయం చేసుకుంటున్నారు. పార్టీ మెల్లగా ఊపునందుకుంటోంది. భూషణం ఓ పక్కకి తిరిగి ఎవరో చెబుతుంటే వింటున్నాడు.

"ఎక్స్‌క్యూజ్ మి" అన్నారెవరో.

"జస్టె మినిట్" అంటూ పక్కకు తిరిగాడు.

"మీకో వ్యక్తిని పరిచయం చేస్తాను" అని వెళ్ళి వెంటబెట్టుకొచ్చాడు.

"మీట్ ది లార్డ్ ఆఫ్ మేనర్స్... లార్డ్ ఖలీద్ షరీఫ్... భూషణం..." అంటున్నాడు.

భూషణం బొటనవేలునుండి మొదలయిందో ప్రకంపనం... తన ఎదురుగా నిలబడింది అఖిల!

"హలో..."

భూషణం తడబడ్డాడు ఏమనాలో తెలియక.

"మేడమ్ వారితో మాట్లాడుతుండండి" అని వెళ్ళిపోయాడతను.

అఖిల కళ్ళు క్షణకాలం చిన్నబోవటాన్ని గమనించాడు.

"ఇద్దరికీ ఏం మాట్లాడాలో అర్ధంకాలేదు. భూషణానికి ఇలాంటి సంఘటన జరగవచ్చుననే ఊహ అప్పుడప్పుడు వచ్చిందిగానీ అఖిలకు ఏమాత్రం ఊహించని సంఘటన"

"బాగున్నారా" మాటలు పెగల్చుకుని అడిగాడు తెలుగులో. అఖిల మాట్లాడలేదు.

"బహుశా మాతృభాష మరిచిపోయి వుంటారు" అన్నాడు ఆంగ్లంలో. అప్పుడు కనిపించింది ఆమెలో కదలిక.

"లేదు... లేదు"

"నేను గుర్తున్నానా?"

తలూపింది.

"మీరు ఒక్కరే వచ్చారా?"

నవ్వింది.

"పిల్లలెంతమంది?"

"నాకు పిల్లలు లేరు"

"ఎందుకనో తెలుసుకోవచ్చా?"

మాట్లాడలేదు.

"సారీ... మీకు అంగీకారమైతే పార్టీ పూర్తయ్యాక మా ఇంటికి ఆహ్వానిస్తున్నాం"

అఖిల తలూపింది. అయితే వస్తుందా... రాదా అనేది భూషణానికి అర్థంకాలేదు. పార్టీ జోరుగా సాగుతోంది.

★ ★ ★

అఖిల తలవంచుకుని కూర్చునుంది.

భూషణం అటూఇటూ పచార్లు చేస్తున్నాడు. ఆగి ఆమెను చూశాడు.

"అఖిలా...నేను ఇండియా వెళ్ళిపోతాను"

"ఎందుకు వెళ్లటం... నేను కనిపించినందుకా..."

"అవును. కనీసం జీవితంలో ఒక్కసారైనా నిన్ను చూడాలనుకున్నాను. ఒకప్పుడు నిన్ను చూడకుండానే చచ్చిపోతానేమో అనిపించేది. అఖిలా ఒక్కమాట అడుగుతాను చెప్పు. నన్ను కాదని వెళ్లినందుకు నేను బాధపడను. అది ఎలాగో జీర్ణం చేసుకు




న్నాను. ఇన్ని సంవత్సరాలపాటు ఇక్కడే జీవించావ్. ఒక్కసారైనా ఇండియా ఎందుకు రాలేదు?

చిన్నతనంలో మనం లక్ష అనుకోవచ్చు. అవన్నీ జరగవు. కానీ ఆ బంధం విలువలే నిదవుతుందా? నీ బావగా కాకపోయినా, సాటిమనిషిగా, ఓ స్నేహితుడిగా ఎలా వున్నావని అడుగుతూ ఓ ఉత్తరం ముక్క రాయవచ్చునే. అందుకుకూడా నేను తగనా?

నిజమే. నాకు సంస్కారంలేదు. నావన్నీ గతకాలపు భావాలు. మరినువ్వు కోరుకున్న ప్రపంచం అంత గొప్పదా అఖిలా... నీకు నన్ను ఎలా పరిచయం చేశారో గుర్తుందా? ది లార్డ్ ఆఫ్ మేనర్స్... షరీఫ్ ఆఫ్ కామ్ స్టర్ నైట్, ఇవన్నీ నడివీధిలో కొనుక్కు న్నాను. అంతమాత్రాన సంస్కారవంతుడినై పోయానా... నువ్వు కలలుగన్న ప్రపంచపు నిజస్వరూపం నేను చూశాను. అందులో నాకు గర్వపడాల్సిందేమీ కనిపించలేదు. అంతే నేను చెప్పదలచుకుంది. దయతో మా ఇంటికి వచ్చారు. ధన్యవాదాలు తెలి యజేసుకుంటున్నా. ఈ స్పీచ్ మాత్రం ఏ సెక్రటరీ తయారు చేసివ్వలేదు అఖిలా..." అన్నాడు.

తిరిగి అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు.

అఖిల కళ్లలో నీళ్లు... వాటిని చూసి భూషణం ద్రవించాడు.

"ప్లీజ్...అఖిలా నువ్వు కన్నీళ్లు పెట్టు కుంటే నేను భరించలేను. ఇన్నిసంవత్సరాల తర్వాత నిన్ను చూసిన ఉద్వేగంలో ఏదో మాట్లాడాను. నన్ను క్షమించు. అంతేగాని నువ్వు బాధపడితే నా గుండెని ఎవరో నలు పుతున్నంత బాధ కలుగుతోంది."

అఖిల కన్నీళ్లు తుడుచుకుంది.

ఇంక తట్టుకోలేక అతని హృదయం మీద వాలిపోయి భోరున ఏడ్చేసింది. భూషణం ఆమె తల నిమురుతుండిపోయాడు.

తేరుకున్నాక అఖిల తన గురించిన విశే షాలు చెప్పింది.

ఆమె అంకుల్ చచ్చిపోయాడు. లండన్ వచ్చాక జీవితం ఆనందంగానే గడిచిపో యింది. కొత్తప్రాంతాలు చూడటం, కొత్తవ్య క్తులని కలుసుకోవటం, పార్టీలకు హాజరుకా వటం, తరచుగా పార్టీలివ్వటం, హై సొసై టీలో తిరగటం, ఇవన్నీ మొదట్లో ఆనం దంగా అనిపించినా రానురానూ మొహం మొత్తింది. ఏదో అసంతృప్తి వెంటాడటం మొదలయింది.

పెళ్లీ, కుటుంబం, వాటికి పెద్ద ప్రాము ఖ్యతలేని వాతావరణంలో పిల్లల్ని కనాలనే తపన లేదు. పిల్లలు పుట్టకపోవటం అనే విషయం గురించి అప్పట్లో లోతుగా ఆలో చించే తీరిక లేదు. తీరా వాళ్ల అవసరం తెలిసొచ్చాక చేదునిజం తెలిసింది.

"నాకు పిల్లలు పుట్టే యోగంలేదు. అది తెలుసుకున్న రోజున నువ్వు గుర్తొచ్చావ్. నీకు జరిగిన అన్యాయమే నాకు శాపంలా తగిలిందా అనుకున్నాను. తర్వాత నేను కాదనటం వలన నీకు మంచే జరిగిందని తృప్తి పడ్డాను. నువ్వు ఎవరో ఒకరిని చేసు కుని పిల్లల్నికని వారితో హాయిగా గడుపు తావని అనుకున్నానే గాని ఇలా మిగిలిపో తావనుకోలేదు" అంది.

"నాకు అందరూ గుర్తొచ్చేవారు. ముఖ్యంగా రామాపురం చెరువు దగ్గర నా మాటలకి నీ ముఖంలో కనిపించిన ఫీలిం గ్స్ని మరిచిపోలేదు. నేను చేయగలిగిందే మీలేదు అనుకున్నాను. తర్వాత ఇండియా రావాలనిపించినా ఎలా వస్తాను? నేను ఏం సాధించానని రావాలి? గర్వంగా చెప్పు కోవటానికి నా దగ్గరేం మిగిలింది? సంసా

రమా? పిల్లలా? వ్యక్తిగత విజయాలా? నేననుకున్న వైభవాలు నాకే విసుగు కలిగించినప్పుడు అన్నింటినీ చంపుకొని బతకటం అలవాటు చేసుకున్నాను"

భూషణం చేష్టలుడిగి చూస్తున్నాడు.

"బావా! ఇక్కడ డబ్బూ, స్కాండల్స్, సెక్సు తప్ప, ఇంకేం లేదు. నీకు తెలుసా... నేను రెండు పెళ్లిళ్ళు చేసుకున్నాను. ఏదీ సక్సెస్ కాలేదు. ఇప్పటికీ ఎవరో ఒకరు పెళ్లి చేసుకుందామంటారు. ఐ డోంట్ వాంట్ ఎనదర్ మాన్. మగవాళ్ళమీద నమ్మకంపోయింది. అందుకే నేనూ, నాగది... కొంచెం ఫిలాసఫీ ఇదీ నా బతుకు"

"ఈ ప్రపంచంలో సుఖమే లేదంటావా?'' అన్నాడు భూషణం.

"ఎలావుంటుంది? సుఖాలన్నీ కొందరు సొంతం చేసుకుంటుంటే ఆ పదానికి విలువ ఎక్కడనుంచి వస్తుంది. నా వరకునేను ఒకటే అనుకుంటాను. నేను 'సుఖం' అనే ఫీలింగ్‌ని అనుభవించానేమో గాని సుఖం అంటే నాకు తెలియదు"

"ఏది ఏమైనా నిన్ను చూసినందుకు తృప్తిగా వుంది. ఇంక నేను లండన్‌లో ఉండాల్సిన అవసరమేలేదు"

"అలా అనకు బావా. పెళ్లిచేసుకో. పిల్లల్నికను. అందరిలా బతుకు" అంది.

"పిల్లలెందుకు అఖిలా?"

"అదేంటి బావా ఆనందంకోసం...మన తోనే మనదంటూ ఈ ప్రపంచంలో ఏదీ లేకుండాపోవటం బాధని కలిగించదా?"

"ఎంతమాత్రం కలిగించకూడదు. నాతోనే నావంశం అంతం కావాలి. నావంశం అంతం అయితే మానవజాతి అంతంకాదుగా" అన్నాడు భూషణం.

అఖిల నవ్వింది.

"అవును అఖిలా! మనస్ఫూర్తిగా చెబుతున్నాను. వంశం, కులం, వర్గం ఇవన్నీ మాయలు. ఇవి ఎంత త్వరగా ధ్వంసం అయితే అంత బాగుంటుంది.

★ ★ ★

భూషణం నిర్ణయం అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేసింది. మరోసారి ఆలోచించమని అందరూ కోరారు. కానీ మృదువుగా తిరస్కరించాడు.

"సోదరా... నాకు మనదేశం వెళ్లిపోవాలనుంది. దయచేసి అభ్యంతరం చెప్పకండి. నేను మళ్లీ ఏకాంతంలోకి జారిపోవాలి.

ఆ బతుకుమీద ఎప్పుడో ఒకప్పుడు విసుగు వస్తుంది. అప్పుడు ఇంకోరకమైన దారిలో వెళ్తాను. మీరందరూ వున్నారు. ఎప్పుడు కావాలంటే అప్పుడు నేను రావచ్చు లేదా మీరు రావచ్చు ఇదంతా నేను అనుకుంటే జరగలేదు. నేను ఆపాలనుకున్నవేవీ ఆగలేదు. ఎందుకో అఖిలను చూసిన క్షణంలో నాకు పారిపోవాలనిపించింది. ఆమెను చూడగలననే నమ్మకం నాకుంది గానీ, ఇలా చూస్తానను కోలేదు" అన్నాడు భూషణం...

'షా' వచ్చి భూషణానికి ఏదోవిధంగా నచ్చచెప్పాలని ప్రయత్నం చేసి విఫలం అయి వెళ్లిపోయాడు. కేథరిన్ ప్రయత్నం చేసింది. చిరునవ్వుతో తన నిశ్చితాభిప్రాయాన్ని చెప్పాడు. అయినా అందరిలోనూ ఏదో మూల ఆశ భూషణం ఆగిపోతాడేమోనని.

'ఇండియా' వెళ్లటానికి టిక్కెట్ బుక్ చేశారు.

ఇంక రెండురోజుల్లో భూషణం వెళ్లిపోతాడు. ఏ.ఎన్. మామూలు మనిషిగా కనిపించటంలేదు. అతను ఎంతో ఉద్వేగాన్ని అనుభవిస్తున్నాడు.

ఆరాత్రి...

లండన్‌లో వెన్నెల కురుస్తోంది.




ఆరుబయట 'లాన్'లో ఇద్దరే కూర్చు న్నారు.

భూషణం కళ్లల్లో ప్రేమ నిండివుంది.

"సోదరా. నీకో నిజం చెప్పాలి. లేకుంటే ఇండియా వెళ్లినా నన్ను నేను క్షమించుకో లేను" అన్నాడు భూషణం.

ఏ.ఎన్. ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

"నేను అఖిలను ఎంత ప్రేమించానో... అంత ద్వేషించాను. ఆ విషయం ఇంతవ రకు ఎవరికీ చెప్పలేదు. నాకు కాకుండా పోయింది ఇంకెవరికీ దక్కకూడదనుకు న్నాను. అంతలోనే నన్ను చూసి నాకు దిగులు కలిగేది. ప్రేమించిన వ్యక్తిమీద ఇన్ని శాపనార్థాలు ఎలా పెట్టగలిగేవాడినో నాకు అర్థమయ్యేదికాదు... కానీ ఏకాంతం నన్ను బాధ పెట్టేది. పేదరికం నన్ను రెచ్చ గొట్టేది. వాటినుంచే మరింత మొరటుతనం వచ్చింది. కానీ జీవితంలో ఒక్కసారైనా అఖిలను చూడాలనుకున్నాను... ఎలానో తెలుసా..."

భూషణం కంఠంలో జీర...

కొద్ది క్షణాలసేపు మాట్లాడలేకపోయాడు.

"ఒక విడోగా... అవును భర్త చచ్చిపో యిన ఆడదిగా నేను చూడాలని అంతరాం తరాల్లో కోరుకున్నాను. ఆమె నా ముందు నిలబడి 'బావా నిన్ను కాదని నేను చాలా తప్పు చేశాను' అని భోరున ఏడుస్తుంటే ఇన్ని సంవత్సరాల వేదనను కడిగేసుకుందా మనుకున్నాను. ఆమెను తిరిగి నా జీవితం లోకి ఆహ్వానించాలనుకున్నాను. ఇవన్నీ దుర్మార్గమైన ఆలోచనలే. నాకు తెలుసు. కానీ వాటిని జయించలేకపోయాను. నా లోపల ఇంత కుళ్లు వుంచుకుని పెద్దమని షిలా చెలామణి అయ్యాను. ఇప్పుడు కూడా నేను నీముందు నా తప్పులు అంగీకరించలే కపోతే మనిషిగా మిగలను మిత్రమా..."

"కానీ,!...

నేనేం కోరుకున్నానో దాదాపుగా అలాంటి దృశ్యమే నా కళ్లముందు ఎదురైనప్పుడు తట్టుకోలేకపోయాను.

నన్ను నేను ధ్వంసం చేసుకోవాలనే ఉద్రేకం కలిగింది. నీకు జరిగిన అన్యాయా నికి నాకు పిల్లలు పుట్టలేదేమో అని అఖిల అంటున్నప్పుడు సిగ్గుతో చితికిపోయాను.

అదే నిజమైతే నా శాపనార్థాలన్నీ నిజం కావాలి. వాటికి అంత శక్తి వుందో లేదో నాకు తెలియదు. కానీ మనిషిగా నన్ను నేను ప్రక్షాళనం చేసుకోవాలి. తరతరాలుగా ఇలాంటివో, ఇంతకంటే భయంకరమైనవో తప్పుల్ని మా పెద్దలు చేశారు. వాటిని అంగీకరించాలి. సిగ్గు పడాలి. సవరించుకో వాలి. మనుషులకి మనుషులే చేస్తున్న అన్యాయాలు అంతమైపోవాలి. సోదరా... నన్ను నిప్పుల్లో కాల్చేసిన ఇలాంటి ఘట నలు ఎన్నెన్నో... అందుకే నన్ను ఈ లార్డ్ షిప్‌ల నుండి, పార్టీలనుండి, మర్యాదల నుండి దూరంగా వెళ్ళనీయండి.... చెప్పు సోదరా... నన్ను చూస్తుంటే అసహ్యం కలి గితే అదే చెప్పు. నేనిప్పుడు ప్రశంసనూ-వి మర్శనూ అర్థం చేసుకోగల స్థితిలో వున్నాను...

ఏ.ఎన్. చాలాసేపు మాట్లాడలేదు.

"వెళ్దాం సోదరా. కేథరిన్ ఎదురుచూ స్తుంటుంది."

"అగ్రజా. ఈ రాత్రి ఇలానే కరిగిపోనీ యండి. ఇంక మరికొన్ని గంటలు మాత్రమే మాతో కలిసి వుంటారు. మీ హృదయాన్ని నాముందు పరుచుకున్నప్పుడు నన్ను నేను మీముందు పరిచయం చేసుకోకపోతే నేరం అవుతుంది. నేను మాట్లాడే సమయం వచ్చింది అగ్రజా.... మాట్లాడతాను...."

ఏ.ఎన్. ఆరంభించాడు...



"ఈ ప్రపంచం మొత్తం బాధపడుతున్నది ఒక విషయంలో అని నేననుకుంటాను. 'ఐడెంటిటీ' క్రైసిస్. దానినుండి వస్తున్న పరిణామాలే సిద్ధాంతాలూ, చర్చలూ, జీవితాలూ అన్నీనూ...

నేను మీ దాయాదిని కాదు. మీ తమ్ముడ్ని కాదు. మీ కులం, గోత్రం, ప్రాంతానికి చెందిన వ్యక్తిని అసలేకాను. నేను ఈ దేశంలో వెనకబడ్డ కులంలో జన్మించాను. నా కులం బీ.సీ. కావచ్చు, ఎస్.సీ. కావచ్చు ఎస్.టీ. కావచ్చు..

అనేక అవమానాలకు గురయ్యాను. ఎందరిచేతనో తిరస్కరించబడ్డాను. "మేధస్సు" కొంతమంది ఉన్నత వర్గాల సొత్తుగా ప్రచారం చేస్తుంటే రగిలిపోయాను.

నేను రచయితని, కవిని. నేను నా జీవితానుభవాల్ని ప్రజలకు తెలియచెప్పాలనుకున్నాను.

ఆశ్చర్యం... నా భాషని వెక్కిరించారు. నా అనుభవాల్ని వెక్కిరించారు. ఎవరూ దగ్గరకు తీయలేదు.

క్రూరమైన విమర్శలు చేశారు. సాహిత్యం, కళలు, మేధస్సు అన్నీ కొందరి స్వంతంగా భావించారు. "మీకు ఏమీరాదు" అని బహిరంగంగా ప్రకటించారు.

నాకప్పుడు తెలియదు. ఇదంతా ఐడెంటిటీ క్రైసిస్‌లో భాగమని.

నేను కార్యకర్తని, నేను ప్రేమికుడ్ని, నేను సగటు మనిషిని. ఎక్కడకు వెళ్లినా ఇవే నన్ను అడ్డుకున్నాయి. నాలో నేను దహించుకుపోయిన నేను మనుషుల్ని అర్థం చేసుకునే ప్రయత్నం మొదలుపెట్టాను.

నేనూ ఏదో చేయగలననిపించింది.

ఏదోకటి చేయాలనే ఆవేశం నన్ను మీ ముందుకు తీసుకొచ్చింది. మీరూ, మీ భోషాణం నాకు సాధనాలుగా ఉపయోగపడ్డారు. నేను అనుకున్న దానికంటే ఈ దేశంలో ఎక్కువ బలహీనతలున్నాయి. దేశంలోనే కాదు ప్రపంచమంతా ఇదే పరిస్థితి. వస్తువుల ప్రవాహంలో కొట్టుకుపోతున్నారు. ఫ్యాషన్ భావజాలంతో కొట్టుకుపోతున్నారు.

నిన్నటి దాకా డబ్బు సంపాదించటం, కీర్తి సంపాదించటం ఎంతో కష్టం. ఈ రోజుకీ సామాన్యులకి అది కష్టమే. కానీ కీర్తీ, డబ్బూ తెల్లవారేసరికి సంపాదించే మార్గాలు ఈ వ్యవస్థలో వున్నాయి.

ఒక సామాన్యుడు ఇలాంటివి చేయగలడని నిరూపించటం కోసం చేశాను. ఒకప్పుడు ఎవర్ని కలవాలని కలలు కనేవాడినో, ఎవరిని ఆరాధించేవాడినో అలాంటివారు డబ్బు సంపాదించాక నా చుట్టూ తిరిగారు. నన్ను ఆకాశంలోకి ఎత్తేయటానికి తయారయ్యారు. నేను అంగీకరించలేదు.

భావాల పేరుతో, ప్రాంతాల పేరుతో, కులం, అభిమానం ముసుగులో ఎవరేం చేసినా, చరిత్ర మాత్రం క్షమించదు. నేను కోరినవన్నీ జరుగుతున్నాక నాలో కొత్త ఆలోచనలు వచ్చాయి. ఎప్పటికప్పుడు 'సోదరా ఇదీ నా జీవితం' అని చెప్పి వెళ్లిపోవాలనుకునేవాడ్ని.

'మన ఆలోచనలు గొప్పగా వుంటాయని' మీరన్నప్పుడల్లా అరిచి చెప్పాలనుకునేవాడ్ని...

ఎందుకలా చెప్పలేకపోయానో తెలియదు.

ఆరోజు నా 'పెళ్లి' విషయం చర్చకు వచ్చింది.

చాలా ఆలస్యంగా ఇంటికి వచ్చాను. కారణం ఏమిటోకాదు.. మీనుంచి దూరంగా




పారిపోవాలని. కానీ వెళ్లలేకపోయాను. వచ్చేశాను. కేథరిన్‌తో పెళ్లికి అంగీకరించాను. కానీ మీరు మాత్రం నన్ను జయించారు.

ఇప్పుడు నాకు కసిలేదు. ఐడెంటిటీ తాపత్రయం లేదు. అవన్నీ తాత్కాలికం. ఆ పరుగులో వున్నంతవరకే అవి మనల్ని రెచ్చగొట్టగలుగుతాయి. వాటికి దూరంగా జరిగినప్పుడు చాలా అల్ప విషయాలవుతాయి.

భయ్యా... కాలం అందరికీ అవకాశాలిస్తుంది. అభివృద్ధి చెందటానికే కాదు. తప్పుల్ని సవరించుకోవటానికి కూడా.

భూషణం చిరునవ్వుతో చూశాడు.

"మేమందరం కూడా ఇండియా వచ్చేస్తాం. కొంచెం ముందూ, వెనకా. మీకు అక్కడ అన్ని ఏర్పాట్లు చేస్తాను. ప్రశాంతంగా జీవించండి".

"సోదరా... ఒక్కసారి నిన్ను కౌగలించుకుంటాను" అన్నాడు భూషణం.

వారిద్దరి కళ్లల్లో తడి... ఏ.ఎన్. భుజం తడుతూ భూషణం అన్నాడు...

"మనం నిమిత్తమాత్రులం"

★ ★ ★

కేథరిన్, ఏ.ఎన్, సూరిబాబు దంపతులు, ఎయిర్‌పోర్ట్‌కి వచ్చారు.

"సోదరా... నాకూ మన భోషాణానికి పోలికలున్నాయి. కొంతకాలంపాటు అలా స్తబ్దంగా పడుంటాం. తిరిగి ఏదో కదలిక వస్తుంది. కొంతకాలం పాటు ఇంకో ప్రపంచంలో వుంటాం... మరలా స్తబ్దత..."

ఏ.ఎన్. నవ్వాడు.

భూషణం ఎవరికోసమో చూస్తున్నాడు.

"ఇండియాలో దిగిన వెంటనే 'షా'జీ మీకు స్వాగతం పలుకుతారు"

భూషణం మాట్లాడుతున్నాడేగాని చూస్తూనే వున్నాడు...

"అగ్రజా... ఎవరికోసం...."

"నా నేస్తం రాలేదేమిటాని చూస్తున్నాను"

"అఖిలగారా... వచ్చేస్తున్నారు. మీతో ఇండియాదాకా..."

"ఇండియాకా?" ఆశ్చర్యంగా అన్నాడు భూషణం.

"అవును. ఈ జీవితం మీద ఆమెకూ మొహంమొత్తింది.

ప్రశాంతంగా జీవించాలని ఆమె కోరుకుంటున్నారు.

ఆమెను మిత్రురాలిగా స్వీకరించటానికి మీకు అభ్యంతరం వుండదనుకుంటాను..." అన్నాడు ఏ.ఎన్.

"తమ్ముడూ... నా ఫ్రెండ్, ఫిలాసఫర్ అండ్ గైడ్ నువ్వయితే, నా ఆరాధ్యదేవత అఖిల. ఆమెకు నా ఆహ్వానం పలుకుతున్నాను... తిరిగి మేమిద్దరం పసిపిల్లలమైపోతాం. జీవించినంతకాలం మా వయసు ఆ బాల్యం దగ్గరే స్తంభిస్తుంది..."

అఖిల నడిచి వచ్చింది....

భూషణం ఎదురువెళ్ళాడు.

"త్వరత్వరగా ఇండియా వచ్చేస్తారుకదూ" అన్నారిద్దరూ. అందరూ తలలూపారు.

భూషణం, అఖిల మాట్లాడుకుంటూ నడుస్తున్నారు. వెనక్కి తిరిగి చేతులూపుతున్నారు...

ఏ.ఎన్. బుగ్గల మీదకి జారుతున్న కన్నీళ్ళతో...చేతులూపుతున్నాడు.

★

# సచిత్రవిచిత్రం



## డిస్నీ మాయ

అమెరికాకు చిహ్నంగా గుర్తించే "స్టేచ్యూ ఆఫ్ లిబర్టీ"కి ఈ రంగుల దుస్తులెలా తగిలించగలిగారా? అని ఆశ్చర్యం కలుగుతుందిగానీ, వాల్ట్‌డిస్నీ స్టూడియోస్‌వారు చేసిన కంప్యూటర్ మాయ ఇది. ఓ పాత ప్రసిద్ధ హిట్ సినిమాని పునర్నిర్మించేటప్పుడు అవసరార్థం 'స్టేచ్యూ ఆఫ్ లిబర్టీ' ఇలా కనుపించేలా చేశారు, కంప్యూటర్ సాయంతో.

# 'మాతృత్వం' పై సమీక్షలు



ఫిబ్రవరి 'చతుర'లో ప్రచురితమైన తిరునగరి విజయ కిషోర్ రచన 'మాతృత్వం'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## 'ఆణిముత్యం'

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

ఫిబ్రవరి చతుర నవల 'మాతృత్వం' పాఠకులను ఎడ్యుకేట్ చేసేలా వుంది. మనలో అంతర్లీనంగా వున్న సంప్రదాయాలను, మూఢ నమ్మకాలను తోసివేస్తూ సైంటిఫిక్‌గా చక్కని రీజనింగ్‌తో మాతృత్వపు విలువని చాటిచెప్పారు. స్త్రీ ఎంత వున్నత శిఖరాలనధిరోహించినా 'పెండ్లి' అనే బంధంలో 'మాతృత్వపు' మధురిమలను చూడాలని తహతహలాడుతుందని స్పష్టంగా తెలిపారు. ఇన్‌వెట్రో ఫెర్టిలైజేషన్, గిఫ్ట్ పద్ధతి మొదలైన మెడికల్ టర్మ్స్‌ని కథాగమనంలో భాగంగా చక్కగా వివరించారు. పిండాన్ని గర్భంలో ప్రవేశపెట్టడం మానవుని విజయమయితే, ఆ పిండం శిశువుగా మారడం మరో ఘన విజయమేగదా! భారతంలోని ఉదాహరణలతో ఈ పద్ధతిలో తప్పేంలేదని నిరూపించి ఒప్పించారు. మాతృత్వం వరమే కాని శాపంగా మారి జీవితాన్ని కాటేయగూడదని కథలో నిగూఢంగా తెలిపారు. భర్తలో లోపమున్నా భార్యనే హింసించే సమాజానికి, మగాడు తాను తండ్రి అయ్యే అవకాశం లేకపోతే భార్యకు రెండో పెళ్లి చెయ్యగలడా? అనే ప్రశ్న సమాజాన్ని సవాల్ చేసినట్టుగా వుంది. మాతృత్వం కోసం మహిళ పడే తపన చుట్టూనే సంఘటనలన్నీ తిరుగుతూ, నవల పట్టుకుంటే వదిలిపెట్టాలన్పించలేదు. మరి మాతృత్వం కోసం అంతగా తపించిన స్త్రీ మరో తల్లికన్న బిడ్డను అత్తగారి హెూదాలో ఆరడి పెడుతున్నదనేదే విచారించదగ్గ విషయం.

ఏదో కాలక్షేపానికి చదివి అవతల పడేసే నవలలా కాకుండా ఆణిముత్యంలా పదిలపరుచుకునే నవలనందించిన రచయిత విజయకిషోర్‌గార్కి, 'చతుర'కు అభినందనలు.

-సి. హెచ్. సుబ్బరత్నము,
ఒంగోలు- 523002

## 'తారతమ్యం జాస్తి'

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

"స్త్రీకి మాతృత్వం ఒక వరం" అన్నాడొక మహానుభావుడు. మాతృత్వం కోసం స్త్రీ పడే తపనను, ఆవేదనని, సంతానవతులు చేస్తామంటూ మోసాలు చేసే బాబాలు, స్వామీజీలు, ఫెర్టిలిటీ సెంటర్‌లను గురించి చక్కగా విపులీకరించిన నవలే 'మాతృత్వం'

కోడలికి సంతానం లేకపోతే సూటిపోటీ మాటలతో హింసించే అత్తలుండే ఈ రోజుల్లో అర్థం చేసుకుని ప్రవర్తించే యశోదమ్మ లాంటి ఉదాత్త పాత్ర, విడాకులు తీసుకున్న కూతురి జీవితం గురించి ఆవేదన చెందుతున్న శంకర్రెడ్డి దంపతులు, భార్య సంతానవతి కాలేదని తెల్సి విడాకులిచ్చి మరో పెళ్లి చేసుకున్న సతీష్ లాంటి చదువుకున్న మూర్ఖులు, స్నేహితురాలి కోసం గిఫ్ట్ పద్ధతిద్వారా సంతానాన్ని అందించడానికి సిద్ధపడిన మణి లాంటి ఉన్నతాశయాలుగల స్త్రీ, సంతాన వాంఛతో తప్పటడుగు వేసిన కీర్తి లాంటి పాత్రలు 'మాతృత్వం' నవలకు జీవంపోశాయి.

మగాడు సంతానవతివి కాలేవంటూ భార్యను వదిలేయగలడు కాని స్త్రీ నువ్వు తండ్రివయ్యే అవకాశం లేదంటూ దూరం చేసుకోలేదు అన్న జ్యోతి పాత్ర పలికిన పలుకులు అక్షర లక్షలు. ఈమధ్య నా దగ్గరకు ఒక దంపతులు సంతానం లేదంటూ వచ్చారు. భర్త 'డాక్టరుగారూ! మాకు పెళ్లయి 5 సం.లు అయింది. పిల్లలు లేరు. మా అమ్మ నన్ను మళ్లీ పెళ్లి చేసుకోమంటోంది. మా ఆవిడ కూడా ఒప్పుకుందనుకోండి. మీరు ఒకసారి పరీక్షలు చేసి మాకు పిల్లలు పుడతారో లేదో తేల్చాలి' అన్నాడు.

'పరీక్షలు చేయిస్తానుగానీ ఒకవేళ లోపం మీలోనే ఉంటే ఆవిడకు ఇంకో పెళ్లి చేస్తారా' అని అడిగాను ఒక డాక్టరుగా.

దానికా భర్త కోపంతో 'ఇదేమాట ఇంకెవరైనా అంటేనా...' అంటూ విసురుగా వెళ్లిపోయాడు.

భార్యలో లోపం ఉంటే రెండో పెళ్లికి సిద్ధమయిన ఆ భర్త తనలో లోపం ఉంటే భార్యకు రెండో పెళ్లి అన్నమాటే జీర్ణించుకోలేకపోయాడు. భార్య కూడా తనలో లోపముంది కదా అని భర్తకు రెండో పెళ్లి చేయడానికి సిద్ధపడుతుందేమోగాని భర్తలో లోపం ఉంటే తనకు ఇలా రాసిపెట్టి ఉంది అని రాజీపడి బతుకుతుందే కాని విడాకులు కోరదు. అంతటి ఉన్నతమయిన భావాలు కలది భారత స్త్రీ. సంతానవతి కాలేదని జ్యోతికి విడాకులిచ్చి రెండో పెళ్లి చేసుకున్న డా॥సతీష్ ఏక్సిడెంట్‌కు గురయి వంధ్యత్వం కలగడం నాటకీయంగా ఉన్నా కథను రక్తి కట్టించింది. అలాగే సంతానవతి కాలేని జ్యోతిని వంధ్యత్వం ఉన్న మురళి పెళ్లి చేసుకోవడానికి ముందుకు రావడం, మురళి పాత్రను ఎలివేట్ చెయ్యలేదు. సంతానం పొందగోరే వారికి ఫెర్టిలిటీ సెంటర్‌లలో లభ్యమయ్యే గిఫ్ట్ వంటి అధునాతన పద్ధతుల గురించి తెలియజేయడమే కాకుండా నవలను ఆసక్తితో చదివించగలిగారు రచయిత.

-డాక్టర్ బి.వి.రమణమూర్తి

కాకినాడ- 533003

## 'ఏది జీవిత ధ్యేయం?'

*(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**తి**రునగరి విజయకిషోర్ 'మాతృత్వం' చదివిన తర్వాత ఐ.వి.ఎఫ్, ఎ.ఐ.డి, గిఫ్ట్ పద్ధతులకు గల తేడా తెలుసుకున్నాం. అంతేకాక మాతృత్వం కోసం నేరాలు చేసేవారుంటారనీ, పిల్లలకోసం భార్యాభర్తలు ఎన్నోకష్టాలు పడతారనీ కూడా అర్థమైంది. మాతృత్వం అనేది దేవుడిచ్చినవరం. సహజమైన సృష్టికి బదులుగా ప్రతి సృష్టి చేయాలని మనిషి సదా ప్రయత్నిస్తూనే ఉన్నాడు. ఆ ప్రయత్నంలో ఎన్నో కష్టాలను ఎదుర్కొంటున్నాడు. ప్రతి భార్యాభర్తా తాము తల్లితండ్రులవ్వాలని కోరుకుంటారు. అయితే భార్యకు పిల్లలు పుట్టనంత మాత్రాన ఆ భార్యను వదిలేసి వేరొకరిని వివాహం చేసుకోవటం, భర్తవలన పిల్లలు పుట్టరని తెలిసి ఇంకో వ్యక్తితో సంబంధం ఏర్పరచుకోవటం సమంజసమైనవి కావు. భార్యలో లోపం ఉంటే భార్యను వదిలించుకోవాలనుకునే వారుంటారు. కాని





లోపం తమదైతే ఎంతమంది ఎ.ఐ.డి. పద్ధతికి ఒప్పుకుంటున్నారు? అయినా కృత్రిమ పద్ధతులు ఎంతో ఖర్చుతో కూడుకున్నవి. అవి సామాన్యుడికి అందుబాటులోలేవు.

కథాపరంగా చూస్తే తీసుకున్న ఇతివృత్తం మంచిదే. మలిచిన తీరు బాగుంది. కానీ పాత్రలన్నీ పిల్లలు పుట్టటమే తమ జీవిత ధ్యేయం అన్నట్లుగా ఉన్నాయి. పిల్లల కోసం భార్యాభర్తల బంధం విడిపోకూడదు. పిల్లలు జీవితంలో భాగం మాత్రమే. పిల్లలే జీవితం కాకూడదు. మురళి, జ్యోతిల పెళ్లి ఊహించిందే. సతీష్‌కి బుద్ధి రావటం మంచిదేకాని దానికోసం అతడికి వెన్ను విరగటం, అతడి భార్య కీర్తి తప్పుదోవ పట్టటం నాటకీయంగా అనిపించింది. అతడికి బుద్ధి రావటంకోసం అప్పటిదాకా మచ్చలేని కీర్తి పాత్రకు రచయిత అన్యాయం చేశారు. పిల్లలను కృత్రిమ పద్ధతులద్వారా కనటంకన్నా అనాథాశ్రమం నుండి తెచ్చి పెంచుకుంటే నేం? ఒక అనాథ జీవితం సంస్కరించవచ్చుగదా! ఎవరో తెలియని వారి అంశతో పిల్లలని కనటంకన్నా ఇది నయంకాదా? అయినా ఎంతో ప్రగతి సాధించిన ఈ రోజుల్లో కూడా మాతృత్వమే స్త్రీ జీవితానికి పరిపూర్ణతా? మురళిలాంటివాళ్లు ఈ రోజుల్లో ఎవరుంటారు? నవల ఎంత బాగున్నా మధ్య మధ్యలో ఇలాంటి సందేహాలు కలిగాయి. కాకపోతే కృత్రిమ పద్ధతులు ఎన్ని ఉన్నాయో, దాంట్లోని సాధక బాధకాలేమిటో వివరించటంలో రచయిత కృతకృత్యులయ్యారు. ఈ రకంగా కొంత జ్ఞానాన్ని తెలియజేసిన చతురకు కృతజ్ఞతలు.

-ఎస్.హనుమాయమ్మ
గుంటూరు

## 'మార్గదర్శి'

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

నేటి సమాజంలో అనేకమంది దంపతులు ఎదుర్కొంటున్న సంతాన సమస్యల్ని, వాటికిగల కారణాలను, విజ్ఞాన విషయాలను పరిష్కారాలను విశ్లేషణాత్మకంగా అందరికీ అర్థం అయ్యే రీతిలో చొప్పించి ఆద్యంతం ఆసక్తితో చదివించేలా చేశారీ నవలను.

ఈనాటి పాలు ఎక్కువగా తాగే వారిలో సంతాన హీనతకు అవకాశం ఉందనీ, ముఖ్యంగా ఎక్కువ పాల దిగుబడి కోసం ఆవులకు, గేదెలకు ఇచ్చే 'ఈస్ట్రోజన్' ఇంజెక్షన్ల వల్ల ఆ పాలు సేవించేవారిలో ఈ పదార్థం చేరుతుందనీ, దీనివల్ల సంతానవంతులు కాలేరనీ, అలానే శరీరానికి రాసుకునే లోషన్లు, క్రీములు, షాంపూలూ, ఫ్రిజ్‌లో ఉంచిన మాంసంవల్ల కూడా ఈస్ట్రోజన్ ఉత్పన్నమవుతుందనీ తెలిశాయి. ఈవిధంగా నిత్యజీవితంలో మనం వాడే అతి సాధారణ పదార్థాలే సంతాన ప్రతిబంధకాలవటం ఎంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

అన్ని రుగ్మతల్లానే ఇదీ ఒక శారీరక రుగ్మతనీ, ఈ వంధ్యత్వం కలవారు కోటీయాభై లక్షల మంది ఉన్నారనీ, దీనికి కారణం వాతావరణ కాలుష్యం, పెరిగిన ఫ్యాషన్లు, టెన్షన్లు తెచ్చిన విపరీతాలు మనిషిని అంతర్గతంగా బలహీనపర్చటమేననీ కృత్రిమ ఎరువులతో ఉత్పన్నమైన ఆహారం, మద్యం, నీరు, బిగుతైన వస్త్రాలు ధరించటంవలన కొందరు సంతానవతులు కాలేకపోతున్నారని రచయిత ఎంతో వివరణాత్మకంగా చెప్పారు. టెస్ట్‌ట్యూబ్ బేబీ గురించి, గిఫ్ట్ పద్ధతిని గురించి తెలియజెప్పి సంతానం విషయంలో ఉన్న నైరాశ్యం, వైరాగ్యాలను దూరం చేశారు.

బాబాలు, ఫకీర్ల వలన, నాటు మందుల వలన ఎలాంటి ఫలితాలుండవనీ, సైన్స్ ఎంతో వృద్ధి చెందిందనీ సంతాన విషయంలో ఏర్పడే ఎలాంటి సమస్యలకైనా పరిష్కారం దొరుకుతుందనీ తెలియజెప్పడం ద్వారా ఎంతోమందికి కనువిప్పు

కలిగించారు.

మాతృత్వానికి దూరమైన ఎందరో దంపతులకు చతుర నవల 'మాతృత్వం' ఒక గైడ్!

-యం.ఉదయశ్రీ
న్యూఢిల్లీ-110058

## 'మాతృత్వానికి అర్థం'

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**తి**రునగరి విజయకిషోర్ గారి 'మాతృత్వం' కోసం మహిళ పడే తపనను, ఆవేదనను చక్కగా వర్ణించారు. స్త్రీ తను తాళి కట్టించుకుని ఇల్లాలయ్యే వేళకన్నా ఓ బిడ్డకు జన్మనిచ్చి మాతృమూర్తి అయ్యేవేళ అమితానందం పొందుతుందని, మాతృమూర్తి కావడం స్త్రీకి ప్రకృతి ఇచ్చిన వరం అని మాతృత్వాన్ని నిర్వచించిన తీరు ప్రశంసనీయం.

చాలా తక్కువ పాత్రలతో ఆద్యంతం మాతృత్వం పైనే చక్కగా సాగిన నవలకు స్నేహం, స్నేహబంధం జోడించి నవలకు ప్రాణం పోశారు. స్నేహానికి ప్రతీకలుగా నిలిచిన జ్యోతి, సుధాకర్, నాగమణి పాత్రలు వేటికవే సాటి. సుధాకర్, నాగమణి కలిసి గిఫ్ట్ పద్ధతిద్వారా జ్యోతిని తల్లిని చేసి ఆమె రుణం తీర్చుకున్నారు. భార్య సంతానవతి కాలేదని ఆమెను వదిలేసి మరో పెళ్లి చేసుకోవటం, స్త్రీ అంటే పిల్లలుకనే యంత్రం అని భావించే మగాళ్లను, వాళ్లకు వంతపాడే మన సమాజాన్ని డాక్టర్ జ్యోతి పాత్రద్వారా విమర్శించిన రచయిత అభినందనీయులు. యశోదమ్మ, జ్యోతి రెండోపెళ్లి బాధ్యత స్వీకరించడం, సమాజంలో స్త్రీలలో వస్తున్న చైతన్యానికి, పెరుగుతున్న మనస్థైర్యానికి ప్రతీక. మురళి, జ్యోతి ఏకమవడం యశోదమ్మ ద్వారా జరిగివుంటే ఆమె పాత్రకు మరింత న్యాయం చేకూర్చినట్లుండేది. అగ్నిసాక్షిగా పెళ్లాడిన స్త్రీ తల్లికాలేదు అన్న సాకుతో వరకట్నం కోసం మరో పెళ్లి చేసుకునే సతీష్‌లాంటి మగవాళ్లు మన సమాజానికి చీడపురుగులు. ఇటువంటి వారిని సమాజంనుండి వెలివేసిన నాడే స్త్రీకి నిజమైన స్వతంత్రం లభిస్తుంది. తన తప్పులకు ప్రతిఫలంగా సతీష్ విధిచే శిక్షింపబడ్డాడు. ఒక స్త్రీ తన కారణంగా మాతృత్వం నుండి దూరం కావడం ఇష్టం లేక పెళ్లి చేసుకోని మురళి దేశంలో ఆడదాని గురించి ఆలోచించే మగవాళ్లు కూడా వున్నారని నిరూపించాడు.

నవలలో సందర్భానుసారంగా ఇన్‌వెట్రో ఫెర్టిలైజేషన్, గిఫ్ట్ పద్ధతి, ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్ వంటి ఆధునిక ఫెర్టిలిటీ విధానాలను వివరించడం కొద్దిగా విసుగు తెప్పించేదిలా వున్నా ఉపయోగకరంగా వుంది. తల్లి కావాలనే తపనతో నాటుమందులు తీసుకోవటం వలన కష్టనష్టాలు గురించి వివరించడం, మాతృత్వమనే ఎరతో దొంగస్వాములు, మాంత్రికులు చేస్తున్న మోసాలు వివరించడం, మాతృత్వ వాంఛతో కొందరు స్త్రీల తొందరపాటు నిర్ణయాల పర్యవసానాలు తెలియజేయడం ఉపయోగకరంగా వుండి ఆకట్టుకుంది. ఈ నవలను ప్రయోజనాత్మక నవల అని చెప్పడంలో అతిశయోక్తి లేదు.

మాతృత్వంలోని మాధుర్యాన్ని, తల్లి అవటంలోని తన్మయత్వాన్ని, మాతృత్వానికి నిజమైన అర్థాన్ని తెలియజేసే మంచి నవలను చతుర పాఠకులకందించిన రచయితకు నా అభినందనలు.

-ఎమ్.ఎస్.రెడ్డి
లోనవ్లా

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

# కొందరికి కారం అంటే మమకారం!




ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు...
మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.







Pickles
ఏ పచ్చడంటే
ఆ పచ్చడి సంగి




**ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్,** (ప్రియ ఫుడ్స్ డివిజన్), **ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 4**